# ధర్మ సందేహాలు

## ఉషశ్రీ


**ఉషశ్రీ మిషన్**

రేడియో ఆర్టిస్టుల కాలనీ,

విజయవాడ

**Dharma Sandehaalu**
**- Ushasri**

Fourth Edition - 2015



Titile: Bapu
Design: Ramu.P, Vijayawada

**Published by:**
Ushasri Mission
Radio Colony
Vijayawada-8.

**For copies:**
Visalandhra Publishing House,
Hyderabad and its Branches

Navodaya Publishers
Vijayawada

Dr. Gayatri Devi, Hyderabad
Phone 8008599901

www.ushasri.com

**For e copies:**
kinige.com

Price: Rs.60 / -
$. 5

# శ్రీ ఉషశ్రీ

పండితుల కర్మాగారంగా ప్రసిద్ధి పొందిన పశ్చిమగోదావరి జిల్లా కాకరపర్రు గ్రామంలో 1928లో జన్మించిన శ్రీఉషశ్రీకి తల్లి కాశీ అన్నపూర్ణమ్మ, తండ్రి ఉపన్యాస సార్వభౌమ, పురాణవాచస్పతి బ్రహ్మశ్రీ పురాణపండ రామమూర్తి గార లే ప్రథమ గురువులు.

కవీ, కథకుడూ, నాటకకర్తా, ఆధునిక వ్యాసవాల్మీకిగా పేరుపొందిన ఉషశ్రీ 1965లో ఆకాశవాణిలో ప్రవేశించి, సూటిగా లక్ష్యం వైపుకి దూసుకుపోయే బాణం వంటి తన వాక్కుతో 1973 నుండీ దశాబ్దం పైగా ఎందరికో ధర్మసందేహాలు తీర్చారు. రామాయణ మహాభారతాలను మథించి, తన మధుర గంభీర గళంతో అశేష జనావళికి జ్ఞానసుధను పంచారు. ఉపన్యాసాన్ని ఒక కళగా రూపొందించి రామాయణ మహాభారతోపన్యాసాలతో యావదాంధ్రదేశాన్ని ఉర్రూతలూగించారు. రామాయణభారతాలందించే మానవత్వపు విలువలు, సంస్కృతీ వైభవాలు యువతరం గుండెల్లో నాటుకుని, వారి ప్రవర్తనలో అవి ప్రతిఫలించి, సమాజం సుఖశాంతులకు ప్రేమానురాగాలకు నిలయమమై వాసయోగ్యం కావాలన్నది ఆయన ఆకాంక్ష. తెలుగునాట భారత భాగవత రామాయణాలు లేని ఇల్లు

ఉండకూడదనేది విద్యార్థి దశ నుండి శ్రీఉషశ్రీ లక్ష్యం. ఆ లక్ష్యం దిశగా 1950లలో తన తండ్రిగారు తలపెట్టిన బృహత్కార్యంలో భాగంగా వ్యాసభారతాన్ని ఆమూలాగ్రంగా ఆంధ్రీకరించి అచ్చు వేసే కార్యక్రమానికి సంపాదకుడుగా మొదలుపెట్టిన ప్రయాణం 1990లో పాంచభౌతిక దేహాన్ని విడిచిపెట్టే నాటి వరకు కొనసాగించి జీవితాన్ని తన లక్ష్య సాధనకే అంకితం చేశారు. ఆకాశవాణి (విజయవాడ)ని ఆయన లక్ష్య సాధనకి అనువైన, అసలైన మాధ్యమంగా అనుగ్రహించాడు ఆయన నమ్మిన పరమేశ్వరుడు.

మానవజాతి సర్వకాలాలలోనూ సుఖశాంతులతో మనుగడ సాగించడానికి అవసరమైన విశేష గ్రంధాలను ప్రతిపాదిస్తూ ఆయన రాసిన రామాయణ భారత భాగవతాలను గత 40 సంవత్సరాలుగా సొంత ప్రచురణ సంస్థలు - భారత ప్రచురణ సంస్థ, ఉషశ్రీ మిషన్‌ల ద్వారా, తితిదే ద్వారా, ఇతర ప్రచురణ సంస్థల ద్వారా లక్షల సంఖ్యలో పాఠకులకు చేరాయి, చేరుతూనే ఉన్నాయి.

వారు తన గంభీర గళంతో చెప్పిన రామాయణ భారత భాగవతాలు (సిడిలు, యూట్యూబ్) దేవాలయాలలోనూ, గృహాలలోనూ, వాహనాలలోనూ యావత్ప్రపంచం లోని తెలుగువారు నేటికీ విని తరిస్తున్నారు. తన జీవితాన్ని (1928 - 1990) కావ్యత్రయ ప్రాచుర్యానికి అంకితం చేసిన శ్రీఉషశ్రీ కలం, గళం - అమరం.

# ధర్మ సందేహాలు

⌘ **నిరాకారుడైన దేవుని బండరాళ్ళలో ఎందుకు పూజించాలి?**

నిరాకార నిర్గుణ పరబ్రహ్మాన్ని ఆరాధించగల ఏకాగ్రత సిద్ధించిన వారికి ఏ రాయీ అవసరం లేదు. అది సిద్ధించేవరకూ ఇంద్రియాలు అటూ ఇటూ పరిగెత్తకుండా పవిత్రభావంతో ఆరాధించడానికే బండరాతి బొమ్మలు.

⌘ **ప్రతియుగంలో విష్ణువు అవతరిస్తాడు కదా, ఈ అవినీతి యుగంలో...?**

అవతరిస్తాడు, నీతి పూర్తిగా నీరసించిననాడు.

⌘ **భారతంలోని పాత్రలు నేటికీ సజీవంగా మన ముందు నడుస్తున్నాయి, రామాయణ పాత్రలు?**

భారతం సజీవ మానవగాథ. రామాయణం మానవునికి ఆదర్శం చూపే ఇతివృత్తం.

⌘ **విష్ణుమూర్తి కుడిచేతిలో చక్రం ఎడమచేత శంఖం ఉంటాయి. భద్రాద్రి రాముడికి ఇవి అటూఇటూ ఉన్నాయేం?**

రామావతారంలో శంఖచక్రాలు రెండూ లేవు, అందుచేత అవి ఎటున్నా ఒకటే అనుకున్నాడేమో శిల్పి.

⌘ **ఎక్కువ నిద్రపోయేవారిని కుంభకర్ణుడితో పోలుస్తారే కాని ఊర్మిళతో పోల్చరేం?**

కుంభకర్ణుడిది మొద్దు నిద్ర, ఊర్మిళాదేవిది యోగ నిద్ర.

⌘ **సీత రాముని సోదరియా?**

దాంపత్య జీవిత ధర్మం తెలియని పాపాచారరతుల రామాయణాలు నేను చదవలేదు. రామాయణానికి వాల్మీకి ప్రమాణం అనుకునే వారికిటువంటి విషధూమాలు అంటవు.

⌘ **బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల జననీ జనకులెవరు?**

చరాచరజగత్తును లాలాఖేలన భూమిని నడుపుకునే పరాశక్తి విలాసంగా ఈ ముగ్గురినీ సృష్టించి వారికి సృష్టి, స్థితి, లయలు చూసే బాధ్యత ఇచ్చిందని పురాణాలు చెపుతున్నాయి.

**⌘ శివధనుస్సునెత్తిన సీతాదేవిని రావణుడెలా ఎత్తుకుపోయాడు?**

సీతాదేవి శివధనుస్సు ఎత్తడం వాల్మీకి కూడా ఎరగడు.

**⌘ సవతి బిడ్డల మధ్య అంత అన్యోన్యం ఉండడం వాల్మీకి కల్పన కాదంటారా?**

కల్పనే అయినా అలా వుంటే సంసారం, దేశం ఎంత సుఖంగా, శాంతితో ఉంటుందో చూశారా?

**⌘ మనం పూజించే దైవాన్ని ఏకవచనంలో 'నువ్వు' అని సంబోధించవచ్చా?**

మనకు చనువు అభిమానం అధికమైనచోట గౌరవం, అగౌరవం ఉండవు.

**⌘ శ్రీరాముడు అవతారం చాలించినా పరశురాముడింకా ఉన్నాడా?**

మార్కండేయుడు, పరశురాముడు, హనుమంతుడు, అశ్వత్థామ వీరంతా చిరంజీవులు అంటున్నాయి పురాణాలు.

**⌘ యుద్ధం ప్రారంభించకుండా ప్రబోధించిన గీతలో శ్రీకృష్ణుడు ఈ యోధులందరినీ నేను సంహరించాను అంటాడు, అది అబద్ధం కాదా?**

కృష్ణుడు లీలామనుష విగ్రహుడు అని విశ్వసించగలిగితే వారిని చంపడానికి ఆయన నిశ్చయించుకున్న క్షణంలోనే వారు చచ్చినవారిలో జమ. అందులో అబద్ధం ఏముంది.

**⌘ హేతువాదం గురించి ఏమంటారు?**

నాకు తెలిసినంతవరకూ పురాణాలు తగలబెట్టు, ఆలయాలు పడగొట్టు, సాంప్రదాయాలు నాశనం చెయ్యి అనే విధ్వంసక కార్యక్రమమే నేటి హేతు వాదుల నినాదం. కాని ఈ దేశంలో ప్రాచీనకాలంలో 'హేతువాదం' గురించి రాంషాగారి పుస్తకం చదివితే వివేకం కలుగుతుంది.

**⌘ మోక్షం కోరి తపస్సు చేసే వారేకాని అది పొందినవారెవరూ కనపడరే?**

ఇంతకూ మోక్షం అంటే మీకు తెలిసినట్లు లేదు. జనన మరణ సంసార విషవలయం నుండి పరంజ్యోతిలో లీనం కావడం - ఇప్పుడర్థమయిందా?

**⌘ మిమిక్రీ కళాకారులు మీ కంఠంతో రామాయణ భారతాలను వక్రంగా చెపుతుంటే వింటూ ఊరుకుంటున్నారా?**

మిమిక్రీ కళాకారులకు మూలపురుషుడెవరో ఎరుగుదురా, ఆది కావ్యం రామాయణంలో రాముని కంఠస్వరం అనుకరించిన మహామహుని పేరు విన్నారా! నాటి నుంచీ వక్రంగా వ్యాఖ్యానాలు చేసి నలుగురికి సంతోషం కలిగించే కళను అభ్యసించిన వారిని అభినందించాలి. అంతేకాని ఆ వక్ర భాష్యాలు నిజమనుకుంటే మనం పరమ అవివేకులం అవుతాం.

**⌘ కుంభకర్ణుడు, భీముడు, బకాసురుడు వీరి తిండి చూస్తుంటే..?**

గుండె బద్దలవుతుంది, ఈ కాలపు అరగిద్దెడు తిండి అరగించుకోలేని వారికి. కాని మొన్న పత్రికలు చూశారా - లండన్‌లో సాల్వే అనే యువకుడు 20 కిలోల అన్నం, 10 కిలోల మాంసంతో హాయిగా ఫలహారం చేస్తున్నాడట. ఆ బాలుని బరువు విన్నారా, రెండున్నర కాటా బస్తాలు, అంటే తెలుసా.... 250 కిలోగ్రాములు. వీడికి వేల సంవత్సరాల క్రితం పుట్టిన భీమ బకాసురులు ఎంత తినగలరో ఆలోచించండి. మనం చాలా అల్పప్రాణులం. అరకిలో కూర అయిదుగురు తినలేని నీరసులం.

**⌘ గీత ప్రారంభంలో ధృతరాష్ట్రుడు "కిమకుర్వత?" అని ప్రశ్నిస్తాడు. యుద్ధభూమికి వెళ్ళాక యుద్ధం కాక మరేం చేస్తారు? ఈ మాత్రం తెలియని మూర్ఖుడా?**

మూర్ఖాగ్రేసరుడైన దుర్యోధనుని తండ్రి ధృతరాష్ట్రుడు, అంతమాత్రాన మూర్ఖుడనుకోనవసరం లేదు. కురుక్షేత్రంలో ఏం చేశారు? అని అడిగితే అక్కడ యుద్ధం ఎవరెవరు ఎలా చేశారో వినిపించమని ఆయన భావం!

**⌘ భారత రామాయణాలను, తరువాత కాలపు కవులు కావ్యాలుగా, నాటకాలుగా మార్చి రాస్తున్నారు కదా, ఏది నిజమో ఎలా తెలుస్తుంది?**

ఎవరు ఎలా మార్చినా మూలకథలో మార్పు ఉండదు. ఒకటి రెండు సన్నివేశాలు తమకు నచ్చినట్లు కల్పించుకుంటారు. మూలమే మార్చిన వారు సోదిలోకి రాకుండా పోయారు, పోతున్నారు.

✻ **లోకులు కొందరు ఓం నమోనారాయణాయ! అనకుండా, ఓం నమో వెంకటేశాయ అంటున్నారు, ఇది న్యాయమా?**

నారాయణా అంటున్నా, వెంకటేశా అంటున్నా, అయ్యప్పా అని పిలిచినా న్యాయమే. ఎటొచ్చీ నిర్మలమైన మనస్సును దైవం మీద ఏకాగ్రం చేయడం ప్రధానం. ఏకాగ్రత లేకపోతే ఏ నామం జపించినా బూడిదలో పోసిన పన్నీరే.

✻ **శ్రీరాముడు హనుమంతునికి దైవం, మరి రామునికెవరు?**

రాముడికి రామశబ్దం దైవం

✻ **లంకలో సీతాదేవి ఉన్నదని తెలిశాక హనుమంతుడు నిప్పుపెట్టాడు కదా, మరి సీతాదేవి ఆ మంటలలో..?**

ఈ ప్రశ్న సుందరకాండలో హనుమంతుడే వేసుకుని... ఔరా! ఆవేశం ఎంత దారుణాలకు దింపుతుందీ. గురువులను చంపిస్తుంది, సాధువులను హింసింప జేస్తుంది. అంతేనా, అది చేయించని పాడుపని ఏముంది - అని చింతిస్తాడు. అంతటివాడు ఆవేశానికి లొంగి ఎంతకు దిగాడో విన్నవారైనా క్రోధాన్ని ఎంత దూరంలో వుంచాలో గ్రహించడానికి సుందరకాండ చిన్ననాటి నుంచీ చదివిస్తే మన పిల్లలయినా వివేకంతో జీవిస్తారు.

✻ **దేవుడొక్కడే అంటూ ముక్కోటి దేవతలంటారేం?**

ముక్కోటి ఆంధ్రులున్నప్పుడు అలా అనేవారు, ఇప్పుడు ఆరుకోట్ల దేవతలు... ప్రతి ప్రాణీ పరమాత్మ స్వరూపం అన్న నమ్మకం దీనికి కారణం! అది లేని వారికి ఏ బాధా లేదు, ఇందరు దేవతలేమిటా అనే చింత తప్ప!

✻ **స్వర్గం నరకం అంటే ఏమిటి?**

మనం చేసే మంచి అంతా స్వర్గం, చెడుపనులన్నీ నరకం.

✻ **సృష్టిలో చీకటి ముందు పుట్టెనా? వెలుగా?**

**లోకంబులు లోకేశులు**

**లోకస్థులు తెగిన తుదిని అలోకంబగు**

**పెంజీకటికవ్వల**

**ఎవ్వండేకాకృతి వెలుగు**

అన్నారు పోతన్నగారు. వెలుగుకీవల పెనుచీకటి సృష్టిలో ఉన్నది.

⌘ **రాముడు, పరశురాముడు ఇద్దరూ అవతార పురుషులే కదా!**

పరశురాముడు అంశావతారం. రాముడు పూర్ణావతారం అని పురాణాలు చెపుతున్నాయి. పూర్ణావతారం వచ్చినప్పుడు అంశావతారం తాలూకు శక్తి లోపిస్తుంది.

⌘ **పార్టీలు ఫిరాయించేవారికి విభీషణుడు ముత్తాతయా?**

కొందరికి అకారణంగా కీర్తి లభిస్తుంది. అలానే కొందరి నెత్తి మీద అపకీర్తి పడుతుంది.

ఇలా అపకీర్తి పాలయినవాడు విభీషణుడు. పార్టీలు ఫిరాయించేవారికి సమాజ శ్రేయస్సు, దేశ సౌభాగ్యం అవసరం లేదు. వారికి పదవి లభించి పది కాంట్రాక్టులొచ్చే అవకాశం వస్తే చాలు, అలానే తమ పార్టీకి మరో పది సీట్లు వస్తే చాలు అనుకునేవారు ఈ స్వార్థపరుల కౌగిలిలో పడతారు.

విభీషణుని విషయానికి వస్తే-

రాముని శక్తి తెలుసుకున్నాడు, జన్మలో ఏనాడూ దొంగచాటుగా పరదారను అపహరించని రావణుడు కపట సన్యాసి వేషంలో వెళ్ళినట్టు తెలిసిన నాడే లంకలో రాముడు కాలు పెడితే సర్వనాశనం అని గ్రహించి, ఆ విషయం రావణునికి బట్టబయలు చేసి, హితబోధ చేసి, అప్పుడు కదిలాడు. విభీషణుడు రాముని శరణు వేడకపోతే లంకలో రావణ వంశం అంతరించి ఉండేది, అదొక వలస రాజ్యం అయేది. ఇప్పుడాలోచించండి. తన దేశాన్ని పరాయి పాలన నుండి రక్షించడానికి రాముని చేరిన విభీషణునికి, పదవి దొరకక పార్టీ ఫిరాయించే నాయకమ్మన్యులకూ భేదం!

⌘ **తెలుపు శుభానికీ, పవిత్రతకూ గుర్తు కదా, మరి వితంతువులు తెల్లని వస్త్రం ధరిస్తారేం?**

వారిని పవిత్రంగా ఉండమనీ, మనం పవిత్రంగా చూడాలనీ...

⌘ **కలియుగం తరువాత...?**

కృత, త్రేతా, ద్వాపరాల తరువాత కలి...

※ **రాముని వంశం లవకుశులతో అంతమా?**

రాముడు మన గుండెలో వున్నంతకాలం ఎందుకు అంతరిస్తాడండీ!

※ **సన్యసించిన వారు అన్నీ వదులుకోవాలి కదా, మరి శంకరాచార్యులవారు తల్లికి కర్మ చేశారే?**

బాధ్యతలు నిర్వహించలేక, సంసారాన్ని సముద్రంలో ముంచి పారిపోవడం పలాయనం అవుతుంది కాని సన్యాసం కాదు. ఈ కర్మ భూమిలో ధర్మ రక్షణ సన్యాసి కూడా సాగించవలసిందే. అందుకే సన్యసించిన శంకర భగవత్పాదులు మాతృకర్మ చేశాడు. విద్యారణ్యుడు విరూపాక్ష సైన్యం ఏర్పాటు చేసి తురుష్క పాలకులను నిలబెట్టి విజయనగర సామ్రాజ్యం స్థాపించాడు. వివేకానందస్వామి దేశదేశాలలో మఠాలు నెలకొల్పి దీనజన సేవాసంస్థలు ఏర్పాటు చేశాడు. నిస్వార్థ సేవకులతో.

※ **కర్ణ, దుర్యోధనాది శత్రువులుండగా, ధర్మరాజు అజాత శత్రువా?**

దుర్యోధనుడికి భీముడే శత్రువు. కర్ణుడికి అర్జునుని మీదనే ద్వేషం. చదవండి నిశితంగా భారతం.

※ **దేవుడనేవాడుంటే కనిపించడేం? లేడని ఘోషించే హేతువాదులకు దర్శనమివ్వవచ్చుగా?**

తప్పకుండా! కాని దేవుడు లేడనే విష్ణుద్వేషి హిరణ్యకశిపునికి కనిపించిన క్షణంలో వాడు చచ్చాడు. అలా అందరినీ చంపడం కరుణామయునికి ఇష్టం లేదేమో!

※ **భారత భాగవతాల కంటే రామాయణానికి ఎక్కువ ప్రచారం ఎలా వచ్చింది?**

మీరు రామభక్తుల వలె వున్నారు. లోకంలో భారతానికున్న ప్రచారం అంతా ఇంతా కాదు. ఇక పోతన్నగారి భాగవత పద్యాలు అప్పగించగలిగినంత మంది భారత రామాయణాలు వప్పగించలేరు.

※ **ఆంజనేయుని తోకను కదిలించలేని భీముడు రాక్షస సంహారం చేశాడా?**

భీముడు రాక్షసులను చంపడం, తోక ఎత్తలేకపోవడం - ఈ రెండూ భారతంలో విషయాలే కదా, అంటే తాడి తన్నువాని తలదన్ను వాడుండును

అనే నీతి మనం గ్రహించాలి.

※ **దుర్యోధనుని ఉప్పు తినడం వల్ల పాండవులు సోదరులని తెలిసినా యుద్ధంలో దిగాడు కర్ణుడు. రాముని చేరి అన్నగారి చావుకు కారణమయ్యాడు విభీషణుడు. ఈ ఇద్దరిలో ఎవరి దారి మంచిది?**

రక్తసంబంధం ఎంతగా వున్నా, ఒకే తల్లి కడుపున పుట్టిన అన్నదమ్ములు అయినా ధర్మాన్ని విడిచి లోకకంటకంగా తయారవుతూ, వంశ నాశనానికి దిగిన పాపాచారుల నుండి సామాన్యులకు సుఖశాంతులు కలిగించడం మంచిదో, ఆ దుర్మార్గుల తిండి తింటూ వారి కోసం జీవితాన్ని బలి ఇవ్వడం మంచిదో ఆలోచించు కోవడానికే రామాయణ భారతాలలో విభీషణ, కర్ణులను చూడాలి.

మంచిచెడులనేవి అన్ని కాలాలలో అందరికీ ఒకే విధంగా వుండవు. ఆనాడే కాదు, ఈనాడైనా అధికారంలో ఉన్న వారికీ, వారి పాదాల క్రిందపడి నలుగుతున్న వారికీ ఉండే తేడా చూస్తూ విభీషణుని వలె తిరగబడలేక కర్ణుని వలె బలి అవుతున్నవారికి భారత, రామాయణాలు వంటబట్టించాలి.

※ **కృష్ణుడు కుచేలుని పాదాలు కడిగాడా?**

కడిగి నీళ్లు నెత్తిన జల్లుకుని తన ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడని భాగవతం ఘంటాపథంగా చెప్పింది. అంటే భగవంతుడు దరిద్రుల పాలిటి నారాయణుడు కాని, ఆగర్భ శ్రీమంతుల అనుగ్రహం కోసం ఆరాటపడేవాడు కాదు.

※ **ఎవడో సామాన్యుడు ఏదో అన్నాడని సహధర్మచారిణిని రాముడు విడిచి పెట్టడం న్యాయమా?**

గుర్రుకొట్టే భర్తతో కాపురం చెయ్యలేనని విడాకులు కోరే సమాజం వృద్ధి పొందుతున్న వైజ్ఞానిక యుగంలో వున్న మనం రామాయణ కాలానికి వెళ్ళాలంటే చాలా కష్టం.

నూటికి డెబ్బైమంది తిరస్కరించినా ప్రభుత్వం నిర్వహించే ప్రజాస్వామ్యంలో నినాదాల అభినయ వాగ్దానాలతో పాలకులుగా ఆరాధనలు పొందే ప్రభువుల ఏలుబడిలో వున్న మనకు రాముని రాజలక్షణం తెలియదు.

ఈ ప్రశ్న అడగబోయే ముందు, ఒక ఆడదాని కోరిక కోసం సింహాసనం

విడిచి అడవుల పాలైన సత్యవాక్పాలనా పరాయణుడు రాముడు అని గుర్తుంచుకోవాలి.

కాగా పోగా- తన దేశంలో ఒక సామాన్య మానవుని నోట వెలువడిన మాట ప్రజలందరి నోటా నాని ఆ అపవాదులతో తన వంశం అపఖ్యాతి పాలవుతుందని భావించాడు రాముడు. మరొక మాట. సింహాసనం మీద వుండే రాజు ఎంత నిష్కళంక జీవితం గడపాలో చూపించాడు రాముడు. రాజు జీవితం ప్రజలకు ఆదర్శం కావాలి. అయింది కనుకనే 'రామరాజ్యం' నేటికీ ఆదర్శం అవుతున్నది.

**✾ ఈ సృష్టిలో పుట్టేదీ, గిట్టేదీ ఏదీ లేదు అని శ్రీకృష్ణుడు గీతలో అన్నాడు కదా?**

పుట్టేదీగిట్టేది లేదని కాదు గీతాచార్యుని మాట, పుట్టినది గిట్టి తీరుతుంది.

జాతస్య హి ధృవోమృత్యుః-

మరికొంత వివరించాలంటే ఈ భూతకోటి ఆదిలో లేదు. మళ్ళీ అంత మందుండదు. మధ్యలో వుండిపోయేదానికి శోకం దేనికి - అంటాడు.

**అవ్యక్తాదీని భూతాని**
**వ్యక్త మధ్యాని భారత**
**అవ్యక్త నిధనాన్యేవ**
**తత్ర కా పరిదేవనా।**

ఈ మాట 5 వేల సంవత్సరాల క్రితం చెప్పినా మానవుడు ధనలోభంతో తన అక్రమధనాన్ని స్విస్ బ్యాంకుల్లో దాచుకునే మూర్ఖత్వం వదలలేక పోతున్నాడు.

**✾ విద్య యొసగును వినయము అనే సూక్తి ఈనాడు పనికి వస్తుందా?**

ఈనాడు దేశంలో విద్యావంతులు లేరు. చదువు కొనుక్కుంటున్న అక్షరాస్యులే ఉన్నారు. అక్షరాలు దిద్దించి, అల్లరి చెయ్యకుండా బిస్కట్లు పెట్టి నిద్రపోగొట్టే కాన్వెంటులో వేలు పోసి పిల్లలకు అవినీతి, అక్రమం అంటే భయంలేని చదువు కొనిపెడుతున్నాం. వారికి వినయం అనేమాట తెలియదు.

**✾ రావణుడు సీతను అశోకవనంలో ఎందుకు పెట్టాడు?**

రావణుడు గొప్ప మనస్తత్వవేత్త. సీతాదేవికి అంతఃపురాల మీద, భోగాల

మీద విసుగుతో వనాలకు వచ్చిందని గ్రహించి, లంకలో కూడా వనంలో వుంచాడు.

⌘ **మనిషికి నాలుగు వాక్కులున్నాయనీ, ఒక వాక్కు మనిషికి తెలుసుననీ అంటారు...?**

పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని శబ్దం ముందు నాభి దగ్గర బయలు దేరుతుంది. అది పరావాక్కు. హృదయాన్ని చేరేది పశ్యంతి, కంఠం దగ్గర వెలువడేది మధ్యమ, మనకు వినబడేది వైఖరి.

⌘ **పాదరక్షలు పెట్టి రాజ్యం ఏలిన భరతుని పిచ్చివాడనుకోలేదా?**

పాదాక్రాంతమయిన రాజ్యభోగాన్ని గడ్డిపరకలా వదిలి వెళ్లిన సత్యవాక్పాలనా పరాయణుడైన రాముని పాదుకలవి... కాని వాగ్దానాలు ప్రజల మొహాన పోసి విద్య, ఉద్యోగం వేలం పాడి బ్రీఫ్‌కేసులు పుచ్చుకునే పాలకుల, స్వోదర పూరణ పరాయణుల పాదాల మీద పడే వారికంటే భరతుడు పిచ్చివాడా!

⌘ **ఊరూరా దేవాలయాలు కడితే భక్తి పెరిగి మనుషులలో అత్యాచారాలు తగ్గుతాయేమో?**

ఇంకా ఎందుకండీ ఆలయాలు? ఉన్న ఆలయాలను కూడా తాలూకా ఆఫీసు గుమాస్తా పదవులు రాని వారికి ఉపాధికల్పనా కేంద్రాలుగా తయారు చేస్తుంటే, కట్టవలసినవి ఆలయాలు కావండి, మనస్సును అర్థ, కామాలకు బానిసచేసే ధృతరాష్ట్ర, దుర్యోధన ప్రకృతి నుండి మరలించే ఉద్యమాలు రావాలి.

⌘ **రామాయణ, భారతకాలాల తరువాయి భూఖండంలో మార్పులొచ్చాయా?**

రామాయణం కిష్కింధకాండలో, భారతం భీష్మపర్వంలో భూగోళ వివరాలు సావధానంగా చూడండి. ఒకనాడు అగాధ సముద్రంగా ఉన్న ప్రాంతం ఈనాడు అత్యున్నతమైన హిమాలయగిరి శిఖరాలతో అలరారుతున్నది. ఈ ప్రపంచం పరిణామం చెందుతూనే ఉంటుంది.

⌘ **హనుమంతుడు సీతాదేవిని 'వరారోహే! దేవతా ప్రతిభాసిమే' అనడం న్యాయమా?**

విక్టోరియన్ నపుంసకత్వం ఈ జాతికి ఇంగ్లీషు చదువులతో నరాలలో జీర్ణించక ముందు ఇంత పాశవికకామం ప్రకోపించని కాలంలో పుట్టిన కావ్య, ఇతిహాసాలను సావధానంగా అధ్యయనం చెయ్యాలి. సౌందర్య సంబోధనలన్నీ స్త్రీ శబ్దానికి పర్యాయ వాచకాలుగానే కవిచంద్రులు ప్రయోగిస్తారు. లేకపోతే దేవతా ప్రతిభాసిమే అని ఎందుకంటాడు హనుమంతుని వంటి శబ్ద బ్రహ్మవేత్త!

**❀ పురాణగాథల్ని హేళనగా సినిమాలలో చూపడం న్యాయమా?**

న్యాయం, న్యాయస్థానం అనే వాటిని గురించి మాట్లాడడం ఈ కాలంలో ఎంత అన్యాయం. పోగా పురాణాలను నమ్మి పూజించి కొందరు సుఖశాంతులు అనుభవిస్తుంటే, దేవతను హేళన చేసి నాటకాలూ, సినిమాలు ఆడి కొందరు పొట్టుపోసుకుంటున్నారు, వారికీ, వీరికీ తిండి పెడుతున్నది దేవతలే!

**❀ శివధనుస్సు ఎత్తకుండానే సీత రాముని మోహించింది?**

సినిమాలలో సీతను చూశారా! వాల్మీకి రామాయణంలో సీత పెళ్లి పీటల మీదనే ముందు చూసింది రాముని. చూస్తూనే మోహించిన పడుచు శూర్పణఖ.

**❀ హనుమంతుడు బ్రహ్మచారికాదా?**

బ్రహ్మచారిగానే వాల్మీకి మనకు చూపించారు. అనంతకాలంలో ఎవడో సంసారి ఆయనను కూడా సంసారసాగరంలో ముంచి తృప్తి పడ్డాడు.

**❀ పురాణగాథలు నమ్మలేకుండా ఉన్నారే?**

నమ్మడానికి కాదండీ ఆ కథలు, ఆ కథలు విని మనిషి సత్యాన్నీ, ధర్మాన్నీ పాలిస్తూ అహింసనూ, అన్యోన్యభావాన్నీ, భూతదయనూ పెంపొందించుకోవడానికి, ఈ రహస్యం తెలియకపోతే గోతిలో పడిపోతాం.

**❀ అన్నమో రామచంద్రా అంటారు కదా! రామరాజ్యంలో అంతా ఆకలి బాధితులా?**

నీరు దొరకక, పశుగ్రాసం దొరకక బాధపడే ప్రాంతాలకు వెళ్ళి అక్కడ ప్రభువులను యాచించే మూర్ఖులుంటారా! అన్నానికి లోటు లేకుండా చేసే ప్రభువునే అన్నం-అన్నం అంటారేమో!

**❀ రామాయణ, భారతాలలో ఏది ముందు జరిగింది?**

జరిగిందని నమ్మితే రామాయణం త్రేతాయుగం నాటిది. జరగలేదనుకుంటే రామాయణం ఆదివాక్యం.

⌘ **పుణ్య పాపాలంటే?**

పొరుగువారికి బాధకలగకుండా ప్రవర్తించడం పుణ్యం. అందరూ నాశన మైనా మన సంసారం బాగుపడాలనుకోవడం పాపం.

⌘ **సరస్వతి బ్రహ్మకు భార్యయా?**

నిస్సందేహంగా, ఈ సందేహం విడిచి సరస్వతీ సమారాధనం చేయండి.

⌘ **బ్రహ్మచారియైన హనుమంతునికి కొడుకున్నాడా?**

హనుమంతుడు ముందుగా కనిపించే వాల్మీకి రామాయణంలో కొడుకులు లేరు. ఆ తరువాయి వచ్చిన భక్తి కథలలో ఈ కొడుకును పుట్టించారు. భీష్మునికి కూడా కొడుకులను పుట్టించే బుద్ధిమంతులు బయలుదేరతారేమో!

⌘ **సీతాదేవి లంకలో నుండి తన మాయలతో రాముని చేరలేదేం?**

ఆవిడకు మాయలూ, మర్మాలూ తెలిస్తే లంకలోకి వెళ్లేదికాదు. రావణాసురుడక్కడే బూడిద! అరణ్యకాండతో రామాయణానికి కథ లేదు. మీరా ప్రశ్న అడిగే అవకాశము, నేను చెప్పే అదృష్టమూ.... అన్నీ భస్మం!

⌘ **నీతిగా ధర్మంగా నడిచేవారికి దేవుడెందుకు?**

నీతిగా ధర్మంగా నడవడానికే దేవుడు.

⌘ **కర్ణుని వంటి మహావీరుని అర్జునుని చేత కృష్ణుడు అధర్మంగా చంపించడం న్యాయమా?**

అధర్మం ఎప్పుడూ న్యాయం కాదు. కాని భీష్మ, ద్రోణ, దుర్యోధనులు కూడా అలానే నేలకూలారు. ధర్మాధర్మ విషయం భారతం చదివితే తెలుస్తుంది. చదివే శక్తి లేకపోతే భారతం గురించి మనసు పాడుచేసుకోకండి.

⌘ **ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం ఈ మూడూ ఒకే సత్యాన్ని బోధిస్తాయి కదా! మూడెందుకు?**

సత్యం ఒకటే అయినా దాన్ని సాధించడానికి దారులు చాలా ఉంటాయి. మనిషి యొక్క మనస్సు రకరకాల దారులు చూస్తూంటుంది. ఒకేదారి అందరికీ

నచ్చదు. అందువల్ల ప్రముఖులయిన ఆచార్యులు అలా మూడు మార్గాలు చూపించారు. మార్గాలు వేరయినా చేరేది ఒకచోటికే. అయితే అద్వైతం మాత్రం వేరే చేరడం అనేది లేదు. అదే నువ్వు అంటుంది. అయినా ఈ విషయం తెలియాలంటే ఉపనిషత్తుల పాఠం చదవాలి.

❋ **ఏడాదిపాటు రావణుడు లంకలో ఉన్న సీతను ముట్టుకోలేదంటే నమ్మవచ్చా?**

ఈ ప్రశ్న రామరాజ్యంలో పుట్టడం వల్లనే ఉత్తరకాండ తయారయింది! అనుమాన ప్రాణుల బుద్ధి అమ్మవారిని హింసించింది.

❋ **రామాయణ కల్పవృక్షం మీద అభిప్రాయం?**

దగ్గరకు వెళ్లినవారికి రామాయణామృతం ఇస్తుంది. దూరంగా ఉన్నవారికి వాతావరణ కాలుష్యం, విషధూమం.

❋ **యజ్ఞంలో పశుబలి జీవహింస కాదా?**

ఈ ప్రపంచంలో అనుక్షణం హింస జరగుతూనే ఉంటుంది. జీవం లేని పదార్థం ఏదీ తినడానికి పనికిరాదు. కాయగూరలు, ఫలాలు, పప్పుధాన్యాలు అన్నిటిలోనూ జీవం ఉన్నది. జీవితోనే జీవి బ్రతుకుతుంది. యజ్ఞంలో జరిగే పశుబలి విషయం ఆలోచించేవారు ఈ జాతి సంస్కృతికి మూలమైన వేద ధర్మాల్ని ఆలోచించాలి. విందు వినోదాల కోసం రోజూ లక్షలాది చేపలను, కోళ్ళను, మేకలను సంహరించి పెడుతున్నాం. యజ్ఞంలో ఒకానొక పవిత్ర లక్ష్యం కోసం నిర్మలమైన చిత్తంతో చేసే పశుబలిని గురించి ఎందుకు తలలు బ్రద్దలు కొట్టుకోవడం. న్యాయస్థానంలో విధించే ఉరిశిక్ష హింస అయితే యజ్ఞంలో జరిగేదీ హింసయే!

❋ **రామాయణ కథ ఇందరెందుకు వ్రాయడం?**

వ్రాసినవారి జన్మ చరితార్థం అవుతుందనే విశ్వాసం. అలా వ్రాయడం వల్ల మరికొందరు రామకథ చదివి చరితార్థులవుతారని.

❋ **బ్రహ్మకు మీసాలు లేవా?**

ఇంగ్లీషు వాసన తగిలేవరకూ ఈ దేశంలో మగవారికి మీసాలుండేవి. పౌరుషం ఉండేది. బానిస బ్రతుకులు ఆరంభమై పౌరుషం చచ్చి మీసాలు

పోయిన కాలంలో బ్రహ్మను ఊహించిన కళాకారులు మీసాలు ఆయనకు మాత్రం ఎందుకనుకున్నారు.

అలానే నాటకాలలో సినిమాలలో రాముడు, కృష్ణుడు వేషాలు వేసేవారు మీసాలు తీసివేయడం వల్ల వారికీ మీసాలు లేవనే అజ్ఞానం ప్రబలింది.

**⌘ అంగదుని తల్లి మండోదరియా?**

మండోదరి కొడుకులు ఇంద్రజిత్తు, అక్షకుమారుడు. తార కొడుకు అంగదుడు.

**⌘ దేవుడందరినీ ఒకేలా ఎందుకు సృష్టించడు?**

దేవుడు యంత్రం కాదు. పైగా ఈ జగత్ సృష్టి, స్థితి, సంహారాలు ఆయనకు క్రీడ అంటారు పురాణ పురుషులు.

**⌘ ప్రభవ పార్థివ మధ్యే మహాప్రళయం అని యోగులు చెప్పారట..?**

వారు చెప్పిన తరువాత మూడో ప్రభవ వచ్చింది. పార్థివ రానున్నది. ఏమీ భయపడకండి. అంత త్వరగా ప్రళయం వస్తే మనం చేసిన పాపఫలం ఎవడనుభవిస్తాడు.

**⌘ జ్యోతిష్యం చదివినవారు పెట్టిన ముహూర్తాలకు జరిపిన శుభకార్యాలు సుఖాంతాలు కావేమి?**

మనకు తెలిసినంతవరకు మొట్టమొదట రామపట్టాభిషేకానికి దశరథుడు ముహూర్తం పెట్టాడు. అది అడవికి నడిపింది. అంటే మూహూర్తం పెట్టేవాని శాస్త్రజ్ఞానంలో దోషం లేదు. అది నిర్ణయించడంలో వాని మనస్సు ఏ దోషాలకి గురి అవుతుందో! మరొకమాట - దోషం శాస్త్రానిది కాదు. శాస్త్రిది అంటారు అనుభవజ్ఞులు.

ఇది జ్యోతిష విషయంలోనే కాదు వైద్య విషయంలోనూ ఉన్నది. అందరూ అయిదారేళ్ళు చదివి డిగ్రీపుచ్చుకున్నవారే. కాని ఒక్కో డాక్టరు వైద్యం చేస్తే మనుషులు తిరిగి ఇంటికి రారు. మరొక అనుభవజ్ఞుడు చిరునవ్వుతో ఎటువంటి వ్యాధినయినా అవలీలగా తగ్గించగలడు. శాస్త్రం ఇద్దరూ చదివారు, కాని అనుభవం!

**⌘ రావణుడు సీతను తన చేతులతో అపహరించాడా?**

ఒక చేత్తో శిరసును, ఒక చేత్తో ఊరుభాగాన్ని పట్టుకుని ఎత్తుకు వెళ్ళాడని వాల్మీకి చెప్పిన దానినే అక్షరం తప్పకుండా రామానందసాగర్ చూపించి ముని రుణం తీర్చుకున్నాడు. లక్ష్మణస్వామిచే గీతలు గీయించడం మాత్రం వాల్మీకి చెయ్యని పని. ఏమయినా ఇన్ని లక్షలమంది చేత రామచరిత్రను దర్శింపజేసిన పుణ్యం ఆయనకు దక్కుతున్నది.

**⌘ శంకరాచార్యుల వారి జ్ఞానమార్గం సామాన్యులకు సాధ్యమా?**

సామాన్యులకే కాదు మాన్యులకూ సాధ్యం కాదు. కనుకనే కృష్ణభగవానులు ముందు కర్మమార్గాన్ని ఉపదేశించి మానవులను సోమరులు కాకుండా చేసి అనంతరం భక్తినీ ఆ తరువాయి జ్ఞానాన్నీ అందించింది. సామాన్యులు ఈ క్రమంలో సాగాలని గీతాచార్యుడు బోధించిన దానిలో శ్రేష్ఠం జ్ఞానం అని శంకరులు, భక్తి ఉత్తమమని రామానుజులూ, కర్మ పరమోత్కృష్టమని కార్ల్‌మార్క్స్ తమ అనుయాయులకు బోధించారు.

**⌘ రాముడు దేవుడే కదా, సీతాపరహణం జరుగుతుందనీ, ఎత్తుకుపోయిన వాడు రావణుడనీ తెలియదా?**

అంతకుముందు కౌసల్య కడుపున పుడితే పట్టాభిషేకం భంగం అయి అడవికి పోవాలని కూడా తెలుసుకోవాలి కదా. అది తెలిసిపోతే రామాయణం లేదు, మనకీ శ్రమ లేదు. కాని రాముడు మానవుడుగా అవతరించింది మొదలు దివ్య శక్తులన్నీటికి దూరంగా వుండి మానవుడు మానవత్వంతో కీర్తిశాలి కావాలంటే ఎలా ఉండాలో దానిని ఆచరించి చూపి మనకు ఆరాధ్యుడైనాడు, రామకథ మనకు నిత్యపారాయణ గ్రంథం అయింది.

**⌘ మనస్సు నిర్మలంగా ఉంటే చాలునంటూ దైవప్రార్థన ఉదయమే చెయ్యాలంటారేం?**

మనస్సు నిర్మలమైతే అది నిరంతరం భగవంతునియందే లగ్నమై ఉంటుంది. ఆ నైర్మల్యం రావడానికే ప్రశాంతమైన ప్రభావంతో కొంతసేపయినా భగవంతుని యందు లగ్నం చేస్తే క్రమక్రమంగా అది సాంసారిక బంధాల నుండి విముక్తమై

ఆత్మ సాక్షాత్కారం చేసుకోగలుగుతుంది.

⌘ **సృష్టికి మూలకారణం ఎవరు?**

శబ్ద బ్రహ్మ! అదే ప్రణవం అని వేదం చెపుతున్నది, విశ్వసించగలిగితే!

⌘ **కాగితాలు లేని రోజుల్లో రామకోటి ఎలా వ్రాసేవారు!**

ఆ రోజుల్లో మనస్సును ఏకాగ్రం చేసి రామనామం జపించేవారు.

⌘ **కృష్ణరాయబారం విఫలమైంది కదా, దాన్ని గొప్పగా ఎందుకు చదువుతారు?**

మహాభారతంలో నాలుగు రాయబారాలున్నాయి. అందులో అందరికీ తెలిసింది కృష్ణరాయబారం. ఆయన తన లక్ష్యాన్ని సాధించాడు కనుక రాయ బార విధానం అదే కనక గొప్పదయింది. ఫలితం కలగకుండా విచారణ సంఘాలతో లోపాలను కప్పుకుంటూ కాలక్షేపం చెయ్యాలంటే సంజయ రాయబారం వుంది. చదవండి మరోసారి.

⌘ **హనుమంతుడు బలవంతుడు కదా, వాలినెందుకు చంపలేదు?**

ఎంత బలవంతుడైనా రాజు మీదికి సేవకుని యుద్ధానికి పంపరు. మరొక రహస్యం వాలి చంకలో ఊపిరి సలపకుండా నలిగిన రావణుని పిడి గుద్దుకి గిలగిలలాడాడు హనుమంతుడు. ఇప్పుడాలోచించండి హనుమంతుని ముందు వాలి ఎంతవాడో!

⌘ **నాస్తికులు, హేతువాదులు రామాయణ, భారత భాగవతాలను తిట్టి పోయడం వల్ల ప్రజలలో వాటి పట్ల అభిమానం తగ్గుతోంది?**

హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల వల్లనే నారాయణుని ఘనత పెరిగింది. వారు తిట్టి పోయడం వల్లనే రామాయణ భారతాలు చదివే వారి సంఖ్య ఇటీవల పెరుగుతోంది. తిట్టేవారు కూడా రామాయణ భారతాలు గట్టిగా చదువుతున్నారు. అందుకే ఆదివారం ఇంటిలో టీవీలో రామాయణం చూసేవారెక్కువయ్యారు.

⌘ **మనదేశంలో ప్రాచీన కాలంలో సతీసహగమనం ఉన్నదా?**

దశరథుడు మరణిస్తే ఆయన రాణులు సహగమనం చెయ్యలేదు. కురు క్షేత్రంలో లక్షల యోధులు నేలకూలినా సహగమనం చేసినవారు లేరు. పాండు రాజుతో మాద్రి సహగమనం చేసింది. దానికి ధర్మశాస్త్రం కారణం కాదు.

భారతం చదివితే గ్రహించగలరు.

ఈ దురాచారం మహమ్మదీయుల దాడి అనంతరం ఈ దేశానికి అంటు కుంది. వారు చేతికందిన స్త్రీని చెరచడం, కంటబడ్డ ఆలయం పడగొట్టడం సాగించే పైశాచిక కాలంలో రాజపుత్ర స్త్రీలు ప్రాణత్యాగానికైనా అంగీకరించి శీల సంరక్షణ చేసికొన్న కాలంలో పుట్టింది. అంతే! శాస్త్ర విధి కాదు.

⌘ **దేవతలలో నారదుని పూజించరేం?**

నారదుడు దేవర్షి, దేవతాపూజకు అవశ్యమైన భక్తి సూత్రాలు అందించిన వాడు. అంటే భక్తులందరూ పరోక్షంగా ఆయనకు గురుపూజ చేస్తున్నారు.

⌘ **రాధ కృష్ణుని మేనత్తయా?**

ఈ పాపాయిని భారతంలో భాగవతంలో చూడము. అందుచేత ఏ వరుసతో పిలిచినా బాధలేదు. జయదేవుని ధర్మమా అని అద్భుతమైన ప్రణయానికి పెద్దపీట ఎక్కి కూర్చుంది.

⌘ **అయిదుగిరి భార్య ద్రౌపది. ధర్మరాజు ఆమెను జూదంలో ఎలా ఓడినాడు?**

వ్యసనంలో పడ్డవానికి వివేకం నశిస్తుందనే సత్యాన్ని బోధించి ధర్మరాజు పదమూడేళ్ళు నానాక్లేశాలు పడ్డాడు. వివేకం చచ్చాక ఎవడైనా వాడు చేసేపని గ్రహించలేడు.

⌘ **సీత పవిత్రత అని తెలిసినా అగ్నిప్రవేశం చేయించాడు రాముడు, ప్రజాభిప్రాయానికి భయపడడం వల్లనా?**

అందుకు సందేహమా, ప్రజాభిప్రాయానికి ప్రభువులు అంత భయపడ్డారు. ప్రభువులకు భయపడి బ్రతికే ప్రజలం మనం.

⌘ **రామాయణ, భారతాలలో ఏది ముందు?**

మీరు వ్రాసిన క్రమం ప్రకారం జరిగాయని పెద్దలు చెబుతున్నారు. అంతకంటే పెద్దలం కావాలనుకుని ఆ క్రమాన్ని అక్రమం అంటున్నారు.

⌘ **దుష్టులను సంహరించిన రాముడు, పాపులను రక్షించిన ప్రభువు ఎవరు గొప్పవారు?**

ఎవరికి వారు గొప్పవారు!

**⌘ పునర్జన్మ ఉన్నదా? పూర్వజన్మ స్మృతులంటారు నిజమా?**

పదేళ్లు నిండకుండా మహాలింగం వేణుగానంతో, బాలమురళీకృష్ణ కర్ణాటక గాత్రంతో శ్రీనివాస్ మాండలిన్‌తో మహామహులను ఆశ్చర్య చకితులను చేస్తుంటే అది జన్మాంతర సంస్కారం కాదా! అలానే పూర్వ స్మృతులుండవచ్చు కొందరికి. అందరికీ అన్నీ అందవు.

**⌘ క్షణభంగురమైనది జీవితం అని తెలిసినా కుట్రలూ మోసాలూ చేసి సంపాదించేవారినేమనాలి?**

జీవితం క్షణభంగురమైనా, ధనం శాశ్వతం కనక మనం చచ్చినా డబ్బు పాతర్లు పోవు అని వారి నమ్మకం. అందుకే మనిషి కంటే పశువు నయం. దానికి రేపటి బాధ లేదు.

**⌘ రామాయణ, భారతాలూ రష్యా, ఇంగ్లండు, అమెరికాలవారు చదువుతున్నారు కదా, వారు కూడా నమ్ముతున్నారా?**

రామాయణ, భారత గాథలలోని మానవత్వ విశిష్ట లక్షణాలు ఏ దేశంలోని మేధావులనయినా ఆకట్టుకుంటూ వారికి మార్గదర్శకంగా ఉంటాయి. ఊరందరి దారినీ పోలేని ఉలిపికట్టెలకు నమస్కారం.

**⌘ ఆత్మ ఇంద్రియాలకు గోచరిస్తుందా?**

**అప్రాప్య మనసా సహ** మనస్సుకు కూడా అందనిది ఆత్మ అంటారు ఆత్మవేత్తలు.

**⌘ బ్రాహ్మణులు బ్రహ్మపుత్రులా?**

బ్రహ్మ అనేవాడుంటే ప్రాణికోటి అంతా ఆయన సృష్టి అంటారు పురాణాలలో.

**⌘ భగవంతుడు నిరాకారుడు కదా మరి శంఖుచక్రాల విష్ణువు, త్రిశూలపాణి శివుడు...?**

నిర్గుణుడు, నిరాకారుడు అయిన పరమేశ్వరుని ఉపాసించలేని సామాన్యుల కోసం సాకారుడైన వైకుంఠవాసి, పినాకపాణి, గణపతి ఆదిగాగల వానిని అనుగ్రహించారు పెద్దలు.

**⌘ అగ్నిసాక్షిగా పాణిగ్రహణం చేసిన జానకిని ఎవడో ఏదో అన్నాడని విడవడం న్యాయమా?**

రాజ్యం పాలించేవాడికి సాంసారిక బంధాల కంటే ప్రజాభిప్రాయం ప్రాణ ప్రదం. వాడు మాన్యుడైనా సామాన్యుడైనా అపవాదు పుట్టిందంటే రాజు ఎంత అప్రమత్తంగా వుండాలో చెపుతుంది రామాయణం, నూటికి 70మంది దూషిస్తున్నా ఆసనాలు వదలలేని వారి ఏలుబడిలో రాముడు దోషి.

**⌘ సీతాన్వేషణకు వెళ్ళే వానరులందరిలో హనుమంతుని చేతికే అంగుళీయకం యిచ్చాడు రాముడు?**

అందుకే రాముడు దేవుడయాడు. ఒక్కసారి రామాయణం చదవండి. కిష్కింధలో హనుమంతుడు ప్రప్రథమంగా రాముని చూచి మాట్లాడిన క్షణంలో హనుమంతుడెంత ధీశాలియో గ్రహించాడు రాముడు. అంటే మనం మాట్లాడే మాటలో మన తత్వం వ్యక్తం అవుతుంది, గ్రహించగలిగిన వివేకం ఎదుటి వారిలో వుంటే. మాటలతో మనిషి శక్తిని పట్టగలవాడు కనుకనే రాముడు హనుమంతునికే అంగుళీయకం ఇచ్చాడు.

అంతేకాదు పట్టాభిషేక సమయంలో సత్కారాలు సాగిస్తూ తన మెడలోని రత్నాలహారం తీసి సీతాదేవి చేతికిచ్చి హనుమంతునికి బహూకరింపించాడు. అదీ శ్రీరాముని లక్షణం. ఇప్పుడు చదవండి మళ్ళీ రామాయణం. భక్తితో కాదు, శ్రద్ధతో.

**⌘ కులమతాలు ఎలా పుట్టాయి?**

కులాలు ఎలా పుట్టాయి, ఎప్పుడు పుట్టాయి అనేది మరో వంద డాక్టరేట్లకు పనికొచ్చే సరుకు. ఇక మతం అంటారా, క్రీస్తు ప్రభువుతో క్రైస్తవం, మహమ్మద్ ప్రవక్తతో ఇస్లాం, బుద్ధునితో బౌద్ధం, మహావీరునితో జైనం- ఇలా ప్రవక్తల పేరు మీద వచ్చాయి. మనవారు "హిందూ" అంటున్నారే ఇది మతం కాదు, ఇంగ్లీషు వారు అమెరికా, ఫ్రాన్సు, ఆఫ్రికాల వలె దేశవాచకం అయినా అందరికీ మతాలున్నప్పుడు మనకూ వుండాలనుకుని హిందూమతం అంటున్నారు.

మనకు మతం లేదు. వేద ప్రతిపాదితమైన ధర్మమే అనుసరణీయం. ఉదయం కన్ను తెరిచింది మొదలు రాత్రి నిద్రపోయే వరకూ ఎలా ప్రవర్తించాలో, ఎలా మాట్లాడాలో, భుజించాలో, సంసారం చెయ్యాలో, నిద్రించాలో బోధించేది ధర్మం... ఇలా చెపుతూ వెడితే మహాభారతం అంత గ్రంథం అవుతుంది. అంతకంటే మీరు భారతంలో శాంతి, అనుశాసనిక పర్వాలు పదిసార్లు చదివితే మన ధర్మం కొంత తెలుస్తుంది.

⌘ **సాకేత్ రామాయణం ఎవరు వ్రాశారు? సాకేతమనగానేమి?**

'సాకేత్' అనే పేరుతో హిందీలో మైథిలీశరణ్ గుప్త అనే కవి రచించారు. సాకేత్ కోసల రాజధాని అనుకుంటాను.

⌘ **నీటిలో మొసలికున్న బలమే మానవ జీవితసాగరంలో పాపకర్మలకుంటుంది. ఆ కర్మ బంధితుడు మహావిష్ణువును ప్రార్థించాలనే అంతరార్థం గజేంద్రమోక్షం బోధిస్తుంది కదా?**

వాస్తవం చెప్పారు, ఈ వివేకం పురాణాలు చదివేవారికి కలిగితే వారి మనస్సు సాగర కల్లోలాల నుంచి బైటపడుతుంది.

⌘ **సంవత్సరం తన ఆధీనంలో ఉన్న సీతాదేవిపై అత్యాచారం జరపని రావణుడు రాముని కంటే గొప్పవాడు కాడా?**

ఒక్క ఆడదాన్ని అపహరించినంత మాత్రాన వంశనాశనం చేయాలా రాముడు - అని అడిగితే యింకా బావుండేది! రావణాసురుడు నిజంగా గొప్పవాడే, ఎందుకంటే వాడికి రసికత వుంది. ఆడది అనురాగంతో లేకపోతే సుఖం వుండదనే జ్ఞానం వుంది వాడికి. అందుకే అత్యాచారానికి దిగలేదు.

పరదారాపహరణం ఎంత పాపమో గ్రహిస్తాడేమో అని ఏడాది వదిలాడు రాముడు. హనుమంతుని చేత కబురు పంపాడు. అంగదుని చేత రాయబారం నడిపించాడు. కాని అహంకారం, కామం ఎగదన్నిన వాడికి వినిపించలేదు. సర్వనాశనం అయ్యాడు. రావణుని కంటే నీచుడైన కీచకుడు ఆడదాని హృదయంతో నిమిత్తం లేకుండా బలాత్కరించబోయాడు. వాడికి ఆ రాత్రే

దిక్కులేని చావు అనుగ్రహించాడు భీమసేనుడు.

**⌘ ధృతరాష్ట్ర ప్రేమ అంటే?**

భారత యుద్ధంలో నూరుగురు కొడుకులూ మరణించాక ధృతరాష్ట్రుడు భీముని దగ్గరగా రమ్మని ప్రేమతో గాఢాలింగనం చేసుకుంటాడు. ఆ గుడ్డివాని బుద్ధి తెలిసిన శ్రీకృష్ణుడు ఇనుపబొమ్మను ధృతరాష్ట్రుని కౌగిలింతలో ఉంచగా అంత ఉక్కుబొమ్మా పొడిపొడి అయింది. అదీ ధృతరాష్ట్ర ప్రేమ. దీనికే మరోపేరు మొసలికన్నీరు - ఈ కథ తెలియాలంటే నీతిచంద్రిక చదవండి.

**⌘ సీతాకళ్యాణం అయిదు రోజులు జరిగిందా?**

అయిదురోజులపెళ్ళిళ్ళు, పదహారు రోజుల పండుగలు, మనుగుడుపులు, ఆఖరికి మంగళసూత్రధారణ కూడా రామాయణ భారతాలలో లేదు. కన్యాదానం కాగానే పెళ్ళికూతురును తీసుకుని మగపెళ్లి వారు తిరుగుముఖం పట్టాలి. రామాయణంలో సీతాకళ్యాణం, భారతంలో ద్రౌపదీ పరిణయం, భాగవతంలో రుక్మిణీ కళ్యాణం చదవమనండి పెళ్లి పేరిట ఆడపిల్ల తాలూకు వారిని పీడించుకుతినే పూర్వాచార పరాయణులను. వివాహం అనేది పరమపవిత్రమైన బంధం, అంతే, ఆడపిల్లను కన్న తండ్రిని అడుక్కుతినే దశకు తెచ్చే కట్నాలు, కానుకలు, లాంఛనాలు యివన్నీ మానవుడిలో పిశాచదృష్టి పెరిగినప్పుడు దిగాయి.

**⌘ మానవునిలో దైవాంశ లేదా?**

మానవునిలోనే కాదు ప్రతి పరమాణువూ దైవమే అంటాడు ప్రహ్లాదుడు.

**⌘ ఇందుగలడందులేడని గీతలో ప్రహ్లాదునితో అన్నాడు, కలడు కలండ నెడువాడు కలడోలేదో? అనీ అన్నాడు, అప్పుడీ హేతువాదం వున్నదా?**

మీరు వ్రాసిన పద్యాలు రెండూ శ్రీమద్భాగవతంలో పోతనగారు వ్రాశారు. మొదటిది ప్రహ్లాదుడు చెప్పినది, రెండవది గజేంద్రమోక్షంలోది. ఇంతమాత్రాన హేతువాదం నాడే వున్నదనడం న్యాయం కాదు.

ఈనాడు హేతువాదులకు తెలియవలసినది ఒకటి ఉన్నది. సహస్రాబ్దుల

పూర్వమే హేతువాదులకు పాఠ్యగ్రంథమైన తర్కశాస్త్రం, ఈ దేశంలో పుట్టింది. ప్రతిదానికీ కార్యకారణాలు చర్చించడం ఎలాగో అది నేర్పుతుంది. హేతువాదులైన ఆధునిక మేధావుల కోసం అభిసారిక సంపాదకులు రాంషాగారు ఆ గ్రంథాన్ని 'హేతువాదం' అనే పేరుతో చక్కని తెలుగులో వ్రాశారు. అది చదివితే కొంత వివేకం కలుగుతుంది.

**⌘ దేవుని పూజించే వారందరూ మంచివారా?**

దేవుని పూజించడం ఆరంభించాక అయినా దుష్ట లక్షణాలూ, దురా చారాలూ మానగలిగితే మంచివారే, చేసే పాడుపనులు చేస్తూ వారానికోమాటు లెంపలు వాయించుకునే వారికంటె నాస్తికులు మంచివారు.

**⌘ ఆడ-మగ కలిసి పవిత్రంగా జీవించగలిగితే పెళ్లి అవసరమా?**

పవిత్రంగా కలిసి జీవించడానికే పెళ్లి, అయితే పెళ్ళి చేసుకున్న వారంతా పవిత్రంగా ఉంటున్నారనీ అనలేము. పెళ్లి కాకపోయినా అన్యోన్యాను రాగంతో వుండేవారుండకపోరు.

సమాజానికి భయపడి అయినా కట్టుకున్న భార్యను ధర్మబద్ధంగా ఏలుకునేవారిని నిలబెట్టడానికే పెళ్లి.

**⌘ సత్కర్మలంటే?**

పొరుగువారిని హింసించకుండా కన్నవారినీ, మనకు కలిగిన వారినీ సుఖశాంతులతో ఉంచగలగడం.

**⌘ రామాయణంలో వానర స్త్రీలకు తోకలు లేవే?**

సినిమాలలో, రామానందసాగర్ రామాయణంలో వేషాలు వేసే స్త్రీలు తోకలు పెట్టుకోవడానికి ఒప్పుకోరు.

**⌘ ముస్లింలకు మహమ్మద్, క్రైస్తవులకు క్రీస్తు అలా ఒక్కడే దేవుడు, మనకు ముక్కోటి దేవుళ్ళా?**

మహమ్మద్, క్రీస్తు ఒకరు ప్రవక్త, మరొకరు దేవుని బిడ్డ, అడగండి ఆ మతాల పెద్దలను. వారి దేవుడు క్రిందికి రాడు. ఆ దయాదాక్షిణ్యమూర్తి

పరలోకమందే వుంటాడు. మనకు అలా కుదరదు ఏ భక్తుడు ఏ నామంతో ఏ రూపాన్ని ప్రార్థిస్తే అలా దిగాలి, దిగకపోతే భగవంతుడు కాడు మనకు.

⌘ **రామబాణానికి తిరుగులేదంటారే, రావణసంహారానికి విభీషణుని సలహా ఎందుకు తీసుకున్నాడు?**

ఒకేమాట, ఒకే భార్య, ఒకే బాణం అన్నవారు త్యాగరాజస్వామివారు. ఆయన భక్తికి నమస్కారం. రామరావణ సంగ్రామం ఒక్క బాణంతో తేలిపోలేదు. ఒక టెస్ట్‌మ్యాచ్, ఒక వన్‌డే ఇంటర్నేషనల్ అయ్యాక రాముడు గెలిచాడు. చదవండి.

⌘ **రాజకీయాలలో ప్రవేశించడానికి అర్హత ఉన్నదా?**

రాజకీయం అనేది ఉద్యోగం కాదు. పదవికాదు, కులం కాదు, మతం కాదు. అయితే దేశం బానిసత్వంలో ఉన్న కాలంలో మేధావులైనవారు తమ సర్వస్వం త్యాగం చేసి దేశానికి స్వతంత్ర్యం సాధించారు, తమ బిడ్డలు అడుక్కు తింటున్నా బాధపడలేదు వారు. ఈనాడు వాగ్దానాలు ప్రజలపాలు, కరెన్సీ కట్టలు ఆత్మీయులపాలు చేయగలవారు రాజకీయాలలో రాణకెక్కారు.

⌘ **ఒకప్పుడు కన్యాశుల్కం తీసుకుంటే అది గొప్ప అని చెప్పారు, ఇప్పుడు వరకట్నం అన్యాయం అని అరుస్తారేం?**

కన్యాశుల్కం, వరకట్నం రెండూ మనిషిని సంతలో పశువులా వేలం వెయ్యడమే. కన్యాశుల్కం గొప్ప అంటున్నారంటే అది గురజాడ అప్పారావుగారు రాసిన నాటకం గురించి, ఏనాటికయినా మనుషులు సంత పశువులు కాకుండా ఉండే రోజు కోసం ఎదురుచూడాలి విద్యాగంధం కలవారు.

⌘ **చంద్రుడు భూమి చుట్టూ, భూమి సూర్యుని చుట్టూ, మరి మనిషి...**

అధికారపీఠం చుట్టూ, అందమైన చర్మం ఉన్న ఆడదాని చుట్టూ.... ఇంకా... ఇంకా...

⌘ **మీ రామాయణంలో వాలి సుగ్రీవ యుద్ధం వర్ణిస్తూ భీమబలులు అన్నారు...?**

మహాభారతంలో పుట్టిన కుంతీదేవి కొడుక్కి పేరేం పెట్టాలా అని ఆలోచించి వాని బలం భీమంగా వుంది కనుక ఆ పేరు పెట్టారు. భారత రామాయణాలు

పుట్టడానికి ముందే రామ, భీమ శబ్దాలు ఉన్నాయి. ఎవరికేది ఉచితమో వారికా పేరు పెట్టారు.

❋ **పవిత్రమైన భగవద్గీత మీద ప్రమాణం చేసి అబద్ధాలాడుతున్నారే, అది అపవిత్రం కాదా?**

అగ్నిహోత్రుడికి చెద పడుతుందా?

❋ **ఎందరో దేవతలుండగా కష్టం వచ్చినా, బాధ కలిగినా, హాయిగా ఉన్నా రామనామం జపిస్తారేం?**

అంతగా ఈ జాతి గుండెలో నిలిచిన పురుషోత్తముడాయన!

❋ **ఒక ప్రక్క భక్తి తత్వం, మరొక ప్రక్క నాస్తికత్వం ప్రబలుతున్నాయి, ఏది నిలుస్తుంది?**

రెండూ అలా సాగుతూనే ఉంటాయి. నాస్తిక ప్రబోధం పెరిగే కొద్దీ భక్త సంఘాలు మేలుకుని కర్తవ్య నిర్వహణ దీక్ష వహించడం భాగవతకాలం నుంచీ వస్తున్నది.

❋ **అమావాస్యనాడు సూర్యగ్రహణం, పూర్ణిమనాడు చంద్రగ్రహణం ఎందుకొస్తాయి?**

సూర్యుని చుట్టూ భూమి, భూమి చుట్టూ చంద్రుడు తిరుగుతూండడం వల్ల రాత్రి, పగలు ఏర్పడుతున్నాయి. అందువల్లనే చంద్రకళలు క్షీణిస్తూ వృద్ధిపొందుతున్నాయి. ఈ భ్రమణం వల్లనే చంద్రగ్రహణం పూర్ణిమ నాడు వస్తేనే తెలుస్తుంది. ఇక సూర్యగ్రహణం-భూమికీ సూర్యునికీ అడ్డంగా చంద్రుడు అడ్డుపడడం అమావాస్యనాడే సాధ్యం. అయితే ప్రతి అమావాస్యకూ అది రాదు. దానికొక లెక్క ఉన్నది. ఆ గణితం తెలిసిన పంచాంగకర్తలు శతాబ్దాలుగా తమ పల్లెలోని పాకలో కూర్చుని చెప్పగలుగుతున్నారు. అయినా ఈ జాతికి శాస్త్రీయ దృక్పథం లేక రాహు, కేతువులనే పాములు మ్రింగుతాయంటారు. అవి పసిపిల్లలకు చెప్పే కథలు. అవి నమ్మి విజ్ఞానులమనుకునే మేధావులు, పాశ్చాత్యుల పాదదాసులై ఆత్మగౌరవ శూన్యులవుతున్నారు.

❋ **వాలి తన సోదరుని భార్యను చేపట్టడం ద్రోహం అయితే, సుగ్రీవుడు తారను**

**అంతఃపురానికి రప్పించుకుని సంసారం చేయడం..?**

అందుకే రామాయణం శ్రద్ధగా చదవాలి. పారాయణం చేసేవారికి, సీరియల్ నవలలా చదివేవారికీ రామాయణ భారత విషయాలు తెలియవు.

"సోదరుడు జీవించి వుండగా" వాని భార్యను కూడినందుకు వాలిని చంపిన రాముడు సుగ్రీవుని ఎందుకు చంపలేదో తెలియలేదా? భర్త బ్రతికి వుండగా ఆ పని పనికిరాదు. అది వానరనీతి. వానరులకే కాదు, నరులు కూడా నియోగ విధానంలో మరదలుతో వెళ్ళవచ్చు. భారతం ఆదిపర్వం శ్రద్ధగా పదిసార్లు చదవండి.

⌘ **అర్జునా, నీకే ఈ విశ్వరూపం చూసే అవకాశం అనుగ్రహిస్తున్నాను, అన్నాడు గీతలో కృష్ణుడు. వేదవ్యాసుని దయావిశేషం వల్ల సంజయుడు కూడా చూశాడు కదా?**

వ్యాసుల వారెవరో ఎరుగుదురా!

**ద్విబాహురపరో హరి**

రెండు చేతులతో దిగిన విష్ణువు, అంటే కృష్ణుని అనుగ్రహమే.

⌘ **కాషాయం కట్టే సన్యాసులకు ధనకాంక్ష, అధికార వ్యామోహం ఉంటాయా?**

నీతిచంద్రికలో ఆషాఢభూతి కథ చదవండి. సన్యాసుల ధనకాంక్ష తెలుస్తుంది. ఇక వేమనయోగి మాట విన్నారా...

తలలు బోడులైన తలపులు బోడులా...

⌘ **రాముడు దివ్యదృష్టితో సీతాదేవి ఎక్కడున్నదో చూడవచ్చుగా?**

చూసి వుంటే రామాయణం సగంలో ఆగేది. చూడగల శక్తి ఉంటే మారీచుడు మాయలేడి అని గ్రహించరాదా!

⌘ **మాయలేడి రాక్షసుడని సీతకు తెలియదా?**

తెలిస్తే రామాయణం లేదు. మీకీ ప్రశ్నే లేదు. నాకీ బాధ లేదు.

⌘ **శివుడు విష్ణుభక్తుడనీ, విష్ణువు శివభక్తుడనీ పురాణాలు చెబుతున్నాయే...?**

శివకేశవులకు భేదం లేదని గ్రహించాలి.

⌘ **గర్భవతులు మంచి విషయాలు వింటే వారికి కలిగే శిశువులు మంచి**

**వారవుతారా?**

అందుకు సందేహమా. పురాణాలే కాదు ఆధునిక శాస్త్రవేత్తలు కూడా అంగీకరించిన విషయం. మంచిపిల్లలు అవసరం లేదనుకున్న గర్భవతులు అసభ్య, అశ్లీల, హింసామయ చిత్రాలు చూసి, నవలలు చదివి ప్రసవించిన సంతానాన్ని చూస్తున్నారుగా!

※ **బాబా, యోగి, అమ్మ అంటూ అవతారాలుగా ప్రచారం చేసుకుంటున్నారే?**

చూడండీ. ప్రచారం చేసుకున్నంతలో అవతారాలయిపోతే చాలామంది ఆషాఢభూతుల దివ్యమంగళ విగ్రహాలు చెక్కించుకుని ధూపదీప నైవేద్యాలు ఏర్పాటు చేసుకునేవారు.

సత్యసాయిబాబా, బాలయోగి, జిల్లేళ్ళమూడి అమ్మవారికి వారుగా అవతారాలమని ప్రచారం చేసుకోలేదు. వారి శక్తి చూసి, వారి ఆశ్రమంలో శాంతిని పొందినవారు, వారి సేవా కార్యక్రమాలకు సహకరిస్తూ దైవాంశ సంభూతులుగా భావిస్తున్నారు. అవన్నీ అలా ఉంచితే ఈ బాబాలు, అమ్మలు ఎంతమందికి అన్నదానం, విద్యాదానం చేస్తున్నారో చూడగలిగితే, ఆ సాధకుల పేర నడిచే సేవా సంస్థల కృషి తిలకించగలిగితే వ్యర్థ ప్రలాపాలకు అవకాశం ఉండదు. వీరిని దుయ్యబట్టి, దుమ్ము పోసేవారు తమ కనుల ఎదుటసాగే అత్యాచారాలను, కుంభకోణాలను సాగించే, కీచక, దుశ్శాసనుల మీద దాడి చేయగలిగితే ఈ మేధావులకు మనం జోహారులర్పించగలం...

※ **కులమతాలు నశించాలంటూనే ఉద్యోగాల దగ్గర కులమతాలకు ప్రాధాన్యం ఇస్తున్నారే?**

అదే ఈనాటి మేధావులు అనుసరిస్తున్న ఆత్మద్రోహిమార్గం, నశించవలసినవి కులమతాలు కావు. కులద్వేషాలను బూడిదచేసి, స్వార్థాన్ని దాచుకుని నీతులు చెప్పే బుద్ధులు.

※ **సంభవామి యుగే యుగే అన్న భగవంతుడు మళ్లీ త్రేతాయుగంలో రాముడిగా, ద్వాపరంలో కృష్ణుడిగా పుడతాడా?**

మన్వంతరాలు, కల్పాలు కూడా ఉన్నాయి. కల్పం మారినప్పుడు వచ్చే త్రేతా ద్వాపరయుగాలలో ఈ సృష్టిచక్రం అంతా తిరుగుతుందనీ, అప్పుడు

మళ్లీ రామాయణ, భారత గాథలు జరుగుతాయనీ పురాణ వేత్తలు అంటున్నారు.

✾ **సీతారాములు, లక్ష్మీనారాయణులు, పార్వతీపరమేశ్వరులు అలా అందరూ భార్య పేరు ముందు పెట్టుకోవడం కంటే భర్త పేరు ముందుంచరాదా?**

స్త్రీలకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కావాలనే ఉద్యమాల ఊసులేని రోజుల్లో వారికిచ్చిన గౌరవస్థానం అది. ఆ కాలం గడిచి అన్నిటా సమానత్వం అని మొదలుపెట్టాక ఆత్మహత్యలకు కిరసనాయిల్ డబ్బాలు, గ్యాస్ పొయ్యిలు నాశనమవుతున్నాయి.

✾ **రావణ దుర్యోధనులు మహాఘోర పాతకాలు చేసినవారని తెలిసీ వారి మార్గాన నడిచినవారే మహామహులవుతున్నారే?**

ఆ కాలంలో రావణ, దుర్యోధనులూ మహామహులుగా ప్రచారం సాగించుకున్నవారే. పాపం పండగానే పదితలలూ నేలపాలయాయి. ఉక్కు తొడలు తుక్కుతుక్కు అయాయి. కాలం మూడాలి, అంతవరకూ పరమేశ్వరారాధన చేద్దాం.

✾ **పరదారాపహరణం రావణునితోనే మొదలయిందా?**

ప్రపంచ సాహిత్యంలో ప్రభవించిన మొదటికావ్యం రామాయణం. దానిలో దొరికాడు దశకంఠుడు. ఆ పాపానికి వంశనాశనం చేసుకున్నాడు. అదీ రామాయణం చదివినవారు నేర్చుకోవలసిందీ, నేర్పవలసిందీ....

✾ **మహాభారతంలో యశోద దగ్గర పెరిగిన ఒకరు సూత్రధారికాగా, రాధ దగ్గర పెరిగినవాడు దాన, వీర, శూరుడయ్యాడు. అంటే కన్నతల్లి కంటే పెంపుడు తల్లుల వల్లనే కీర్తిప్రతిష్టలు వస్తాయా?**

మహాభారతంలో అసలు యశోద పేరు రాదు. ఇక భారతంలో ఉన్న రాధ గీతగోవిందంలో రాధ కాదు. కన్నతల్లి కంటే పెంపుడు తల్లి ప్రేమ గొప్పది కావచ్చు. కానీ అది కాదు కీర్తిప్రతిష్టలకు కారణం. అలా అయితే ఈనాడు ఆయాల రక్షణలో బ్రతికేవారందరూ కృష్ణులూ, కర్ణులూ కావాలి.

✾ **కురుక్షేత్రంలో చచ్చిన యోధుల రక్తం త్రాగి, మాంసం తినేసేదిట ద్రౌపది..?**

ఈ కథ చెప్పిన ఇడ్డీ అమీన్ ఎవడు! ద్రౌపదీదేవి రక్తం త్రాగడం, సహదేవుడు

తన తండ్రి శవాన్ని తినడం, ద్రౌపదికి కర్ణుడి మీద మనసుండడం ఈ దేశంలో భారతకథలోవి కావు. నరభక్షకుల కథలు మ్రింగిన పిశాచపు బుర్రలు కట్టిన సమాధులవి.

**⌘ ద్వైతం, అద్వైతం అనగా ఏమి?**

ఆత్మ పరమాత్మ విడిగా ఉంటే ద్వైతం, భేదం లేదు అంటే అద్వైతం. ఈ రెండుముక్కలూ అర్థం కావడానికి శంకరుల ప్రస్థాన త్రయం, మధ్వాచార్యుల వారి భాష్యాలూ చదవాలి. ఈ జీవితం చాలదు అవి ఒంట బట్టడానికి. అయినా భగవద్గీత చదవండి. కొంత తెలిసినట్టు భ్రమ కలుగుతుంది.

**⌘ ధర్మరాజు అబద్ధం ఆడాడా?**

ఒక్కసారి కాదు. రెండుసార్లు. అజ్ఞాత వాసానికి విరాట నగరం చేరాక ఆ రాజుగారితో మాట్లాడుతూ తాను ధర్మరాజు కొలువులో పనిచేశానన్నాడు. ద్రోణాచార్యుల వారు చండప్రచండంగా బాణ వర్షం కురిపిస్తుంటే ఆగలేక "అశ్వత్థామ హతః" అన్నాడు. రెండుసార్లు అబద్ధం ఎందుకాడినాడూ అని చూడండి. ధర్మం ఉన్నదే దానికి భారతవే ప్రమాణం. ధర్మం మురికి గుంటలో నీరులా ఒకమాదిరిగానే ఉండదు. గంగా ప్రవాహంలా నిత్యం మారుతుంటుంది.

ప్రాణవిత్తమానభంగమందు బొంకవచ్చు- అన్నారు ధర్మ శాస్త్రవేత్తలు. ధర్మరాజు అబద్ధం ఆడిన రెండు సన్నివేశాలూ అటువంటివే కనక ఆయన ధర్మరాజే!

**⌘ ప్రార్థనలు, భజనలు ఆత్మకు శాంతినిస్తాయా?**

ఆత్మకు శాంతి, అశాంతి, రాగం, ద్వేషం వుండవు. అన్నిటికీ అతీతం అది అని భారతీయతత్వం బోధిస్తున్నది. ఇతర దేశాలవారి ఆత్మశాంతికి ప్రార్థనలు, భజనలు అవసరం. ఎందుకంటే అది తుది తీర్పు వరకూ సమాధి వదలకూడదు. ఆ వాసన మనకూ సోకి, ఎవడు కన్ను మూసినా ఆత్మశాంతికి మౌన ప్రార్థన చేయడం విధి చేశారు.

**⌘ హిందూ, క్రైస్తవ, ముస్లిం దేవుళ్ళ మధ్య మతకలహాలున్నాయా?**

దేవుడనేవాడు ఒకటే అని అన్ని మతాలవారూ అంటూంటే ఆ ఒకడు ఎవరితో కలహం సాగిస్తాడు.

⌘ **శ్రీకృష్ణుని వంటి రాజనీతివేత్త ఈనాడున్నాడా?**

రాజనీతి సంగతి తెలియదు కాని కృష్ణవేషం వేస్తే చాలు రాజకీయం తెలుస్తుందనుకునే వారిని సింహాసనాలెక్కించే ఓటర్లు కోకొల్లలు.

⌘ **ముక్కు మీద కోపం ఉన్నవాళ్ళు మునీశ్వరులా?**

ముక్కు మూసుకుని మౌనవ్రతంతో మహారణ్యాలలో ఉప్పు, కారం తినని మునీంద్రులను కూడా కామక్రోధాలు ఎంత లొంగదీసి, పాతాళానికి తీసుకుపోతాయో గ్రహించి, చిన్ననాటి నుంచీ పిల్లలకు ఈ పురాణకథలను చెపుతూ వారికి నీతిబోధ చేస్తే ఈనాడు ఇంత అశాంతి, ఇన్ని అత్యాచారాలూ, ఘాతుకాలూ రేగేవి కావు.

⌘ **అంగదుడు రావణుని సభలో తోక చుట్టబెట్టి రావణుని కంటే ఎత్తు మీద కూర్చున్నాడా?**

బహుశా మీరు చూసిన సినిమాలోనో, టెలివిజన్‌లోనో అలా ఇంద్రజాలం చేసి చూపించారు కాబోలు. వాల్మీకి రామాయణంలో హనుమంతుడు కూడా ఇలాంటి కోతిపనులు చెయ్యలేదు. ఇద్దరూ నిలబడే మాట్లాడారు. రాయబారులు రాజు దగ్గర ఎలా వుండాలో అలాగే వున్నారు అయితే రావణుని అహంకారం ఎక్కువ కావడంతో ఆంజనేయుడు లంక తగలబెట్టాడు. అంగదుడు మరో అవమానం చేశాడు.

⌘ **కిడ్నాపింగు విద్య రావణునితో, వాంప్ పాత్ర శూర్పణఖతో, సి.ఐ.డి. శాఖ హనుమంతునితో ఆరంభమయాయంటారా?**

అందుకు సందేహమా! ఆ విద్యలు యింకా వున్నాయి. కనుకనే రామాయణం చదువుతున్నారు దేశ దేశాలవారు.

⌘ **మనిషి పీల్చే గాలికి, త్రాగే నీటికీ, తినే తిండికీ తేడా లేదు కదా, మనుషులలో యిన్ని తేడాలెందుకొచ్చాయి?**

అక్కడే పొరబడుతున్నారు - గాలి అన్ని ప్రదేశాలలో వున్నదీ ఒకటి కాదు.

సముద్ర తీర ప్రాంతాలలో సముద్రపు గాలి, అలాగనే కొండలున్న చోట కొండగాలి, వరద సమయంలో గోదావరి గాలి, కృష్ణగాలి. ఈ యంత్ర యుగం లో కర్మాగారాలున్న చోట భోపాల్ గాలి, ఇక నీరంటారా.... గోదావరి, కృష్ణా, పెన్నా నదుల నీరు వేరు. గంగ నీరు స్వచ్ఛంగా తెల్లగా వుంటే యమున నల్లగా వుంటుంది. త్రివేణీ సంగమం దగ్గర చూడండి. ఇక ఆహారం ఇది ఇంటికో రకం. మనం వాడు ఉప్పున్నదే రాతి ఉప్పు, సముద్రం ఉప్పు, సైంధవ లవణం మార్కెట్టులో దొరికే శూన్య రహిత లవణం... ఇలానే మిర్చి, ఉల్లిపాయ ప్రాంతాలను బట్టి మారుతున్నాయి. ఇన్ని తేడాలుంటే మనిషి మాత్రం ఒక్కరకంగా ఎలా ఉండగలడు.

⌘ **మానవ శక్తియా? భక్తియా? ఏది ఘనం...**

నా యందు భక్తితో నీశక్తి కొద్దీ కృషి చేస్తే ఫలం అన్నాడు గీతాచార్యుడు.

⌘ **శివపూజాదురంధరుడైన రావణుడు పరదారాపహరణమేల చేసెను?**

ప్రజాసేవయే మా జీవత లక్ష్యం అని ప్రమాణం చేసిన నాయకులు ప్రజాపీడకులు అవడం చూసి కూడా ఈ శివపూజను నమ్ముతున్నారా?

⌘ **వెంకటేశ్వరస్వామికి సంతానం వున్నదా?**

వెంకటేశుడు విష్ణువు అవతారం, విష్ణువు జగన్నాథుడు అయినప్పుడు మనమంతా 'దేవుని బిడ్డలం' కామా!

⌘ **రాముని కంటే రఘుమహారాజు గొప్ప పరిపాలకుడైనా రఘురాజ్యం గురించి చెప్పుకోరేం?**

రఘువే కాడు ఆ వంశీయులందరూ పరిపాలనాదక్షులే. కాని వారి చరిత్ర రాసిన వాల్మీకి లేడు, కాళిదాసు ఉన్నా చాలలేదు.

⌘ **దానమా? త్యాగమా? ఏది గొప్పది?**

చెయ్యగలిగితే రెండూ గొప్పవే, వాదనలో తేలవు.

⌘ **అస్సలు బ్రహ్మచారి ఎవరు?**

పదహారు వేలమంది గోపికలు, ఎనమండుగురు రాణులు ఉన్న శ్రీకృష్ణుడు అని 18 పురాణాలూ చదివిన పెద్దలు చెబుతున్నారు. అర్థమవుతుందా మీకు?

బ్రహ్మచారికి నిర్వచనం తెలియాలి ముందు.

**✽ తథాస్తు దేవతలు, అశ్వనీ దేవతలూ ఒకరేనా?**

అశ్వనీ దేవతలు దేవ వైద్యులు, మొదటి వారున్నారే చెడు మాటలు, పరుషవాక్యాలు పలకకుండా మన నోటిని మంచి మాటల మీదకు మళ్ళించడానికి ఎప్పటికప్పుడు పెద్దల నోట పుట్టేవారు. ఈనాడు పెద్దల నోరు నొక్కుతున్నాం. ఇంక దేవతలెలా వుంటారు?

**✽ మన ఇంట్లో దేవుని కంటే పాతిక రూపాయల టికెట్ దేవుడు గొప్పవాడా?**

ఇద్దరికంటే మనసులో నిలిచిన దేవుడు గొప్పవాడు. టికెట్ దేవుడంటారా... ఎన్ని వేల మందికి తిండిపెట్టి ఉద్యోగాలిస్తున్నాడో చూశారా!

**✽ మన జీవితంలో పెళ్ళికి చదివే మంత్రాలు సినిమాల్లోనూ చదువుతారు కదా? వారు దాంపత్య జీవితం...?**

సినిమాలలో మాంగల్యం తంతునానేనా అనే శ్లోకం చదువుతారు, అది మంత్రం కాదు. చిన్న రహస్యం, యెవరికీ చెప్పకండీ. వేదంలో మంగళసూత్రం లేదు. అందుచేతనే కొన్ని ప్రాంతాలలో మంగళసూత్రం, తలంబ్రాలు ఉండవు.

**✽ భగవంతుని మీద మనసు నిలిపితే చాలదా? ధూపదీపాలు అవసరమా?**

మనసు నిలపగలిగితే ఏమీ అక్కరలేదు. నిలపకపోతే ఎన్ని చేసినా వ్యర్థం.

**✽ ఆడవాళ్లను అసభ్యంగా చిత్రించే దురాచారం ఎప్పుడు పోతోంది?**

చదువుకున్న మూర్ఖుల సంఖ్య తగ్గినప్పుడు.

**✽ మార్కండేయునితో చిరంజీవిత్వం వరం పొందిన వారెవరు?**

మార్కండేయుడొక్కడే శివుని అనుగ్రహంతో చిరంజీవి, మిగిలినవారు బ్రహ్మచర్యదీక్షతో సాధించుకున్నారని విన్నాను.

**✽ గోవిందరాజస్వామి ఎప్పుడూ పడుకునే ఉంటాడా?**

అంతటి శిల్పి మరొకడు పుట్టేవరకూ ఆయనకు విశ్రాంతి, ఆయననైనా అలా వుండనివ్వండి.

**✽ నానా కష్టాలు పడి కని పెంచిన సంతానం తల్లిదండ్రులను ద్వేషిస్తే...?**

అంతకంటే నరకం లేదు అనే సంగతి ఈ పిల్లలు సంతానవంతులై, తిరిగబడినప్పుడు తెలిసి పశ్చాత్తాపంతో లెంపలు వాయించుకుంటారు. చేతులు

కాలిపోయాక దొరికే ఆకులవి.

⌘ **విశ్వరూపం అంటే?**

విశ్వం యొక్క రూపం అనగా మనం నివసించే భూగోళం, కనిపించే గ్రహతారాగణాలు, కనిపించని గోళాలు, రెండవది భగవద్గీతలో కృష్ణుడు చూపించినది. అది తెలియాలంటే జగద్గురు పీఠం వారు వేసిన కులపతి కృష్ణమాచార్యగారి శంఖారావం అను గ్రంథం చదవండి.

⌘ **వేల సంవత్సరాల క్రితం ఏకపత్నీవ్రతం, సత్యవాక్పాలనం సాగించిన రాముడు నేడు దేవుడయాడు, అలానే గాంధీజీ కూడా ముందుతరాలకు భగవానుడు కాడా?**

అంతదాకా దేనికి, ఇప్పటికే ఆయనను భగవానుడుగా భావించేవారున్నారు.

⌘ **మంచి మంచి మాటలతో ప్రజలను వంచించి, నాయకులై అవినీతి పనులు చేసేవారికి యమలోకంలో పడే శిక్షలన్నీ ఈ లోకంలో చూపిస్తే మిగిలిన వారు నీతిగా బ్రతకరా?**

ఎంత అమాయకులండీ, ఎక్కడో యమలోకం దాకా ఎందుకు, ఈ లోకంలోనే తాము చేసిన పాపాల ఫలితం అనుభవిస్తూ, దీర్ఘరోగాలతో కుళ్లుతున్నవారు, జైళ్ళలో మగ్గుతున్నవారు కనిపిస్తున్నా ఆ పాపఫలం తమ నెత్తి మీద పడేవరకూ వీరికి బుద్ధి రాదండీ!

⌘ **పూర్వకాలపు రాక్షసులు నేటి టెర్రరిస్టులా?**

వారిని మించినవారు నేటి ప్రజావంచక నాయకులు. రాక్షసులు, టెర్రరిస్టులు క్షణంలో ప్రాణం తీసేస్తారు. వాగ్దానాలు చేసే మహనీయులు జలగల్లా పీల్చి పీల్చి చంపుతున్నారు.

⌘ **రెక్కాడితే కాని డొక్కాడని వారికి కడుపు నిండా తిండి కావాలి కాని మత ప్రబోధం దేనికి?**

అదే మాట స్వామి వివేకానందుడు దేశదేశాల వారికి బోధించాడు. దరిద్ర నారాయణులు అసంఖ్యాకముగా ఉన్న మా దేశానికి కావలసినంత ఆధ్యాత్మిక సంపదను బోధించడానికి ప్రచారకులను పంపక ఆహారధాన్యాలు, ఔషధాలు

ఇవ్వండి అని ఘోషించాడు.

❋ **జాంబవంతుని ఆయుర్దాయం?**

ఆయనను సృష్టించిన బ్రహ్మగారు చెప్పాలి.

❋ **రాజులు ప్రజలకు ఓటు హక్కు యివ్వలేదేమి?**

హక్కుగా యిచ్చి ప్రక్కగా సారాకుండలు, నోట్లకట్టలు, బరిసెపోట్లు అందించే తెలివి అవసరం లేకుండా నిర్భయంగా వుండేవారు కనక.

❋ **సుందర మనోహరమైన అడవులు చూడాలని కోరగానే నెలలు నిండిన సీతను అరణ్యాలకు పంపడం?**

నిజానికి మొదట రామాయణం రాసిన వాల్మీకి రామపట్టాభిషేకంతో కథ ముగించాడు. ఆ తరువాయి ఏ మహానుభావుడో రావణాసురుడి మీద ప్రేమతో ఉత్తరకాండ రాశాడు. అందులో సీత అడవికి వెళ్ళి లవకుశులను కన్నది. అనంతరం నాటకాలు వ్రాసినవారు సీతాదేవి గర్భవతిగా ఉన్నప్పుడు కోరిన కోరిక కనక రాముడు అడవికి పంపాడన్నారు. వాల్మీకి రామాయణంలో లేని కట్టు కథలకు నా దగ్గర సమాధానం లేదు.

❋ **భర్త పోయిన స్త్రీ బొట్టు, కాటుక వగైరా వదిలేయాలా?**

ఈ దుర్మార్గాలన్నీ దుష్టుల దాడుల తరువాయి ఏర్పడిన దౌర్భాగ్యాలు.

❋ **పానకంలో పుడక అంటే?**

ఈ పేజీలో మీ ప్రశ్న!

❋ **వారాలకూ దేవుళ్ళకూ ఏమిటి సంబంధం?**

అభిమాన దైవాల మధ్య పేచీలు రాకుండా భక్తులు చేసుకున్న ఏర్పాట్లు.

❋ **దేవుని సన్నిధిలో కూడా తారతమ్యమా?**

దైవాన్ని వ్యాపార స్వరూపం చేసుకున్న ప్రభువుల బుద్ధిని ఏ ప్రభువూ మార్చలేడు. దేవుడు ఎప్పుడూ మైనరు బాలుడట!

❋ **పురాణాలను బట్టి మానవ నాగరికత యుగాల క్రితమే అభివృద్ధి చెందినా చరిత్రకారులు చెప్పేది భిన్నంగా ఉంది?**

మేం చరిత్ర చదివినప్పుడు మానవజాతి చరిత్ర అయిదువేల సంవత్సరాలతో

అయిపోయింది. మా పిల్లలు వచ్చేసరికి మొహెంజదారో, హరప్పాలు బయట పడి మరో రెండు వేలు వెనకకు నడిచాయి. ఇప్పుడు సముద్రంలో ద్వారకా నగరం బైటపడుతుంటే ఈ చరిత్ర మరో ఐదు వేలు వెనకకు నడవాలి. అలా క్రమంగా చరిత్ర వ్రాసే అయ్యవార్లు నామాలు దిద్దుతూంటారు.

※ **అయిదుగురు భర్తలు ద్రౌపదికి శాపమా?**

వ్యాస భారతం, కవిత్రయ భారతం కూడా ద్రౌపదీదేవికి శివుడిచ్చిన వరం వల్ల అయిదుగురు భర్తలు లభించారని చెపుతున్నాయి.

※ **కర్ణుడు మహాదాత కదా, దుర్యోధనుడి దగ్గర అంగరాజ్యం ఎలా పుచ్చుకున్నాడు?**

దాతలలో శిబి, బలి ప్రముఖులు. వారు మరీ సర్వ శూన్యులైపోవడం వల్ల, ఎంతో కొంత మిగుల్చుకున్న కర్ణుడు కలియుగ మానవులకు ఆదర్శం అయ్యాడు. అందుచేత అంగరాజ్యం దుర్యోధనుడిచ్చిన విషయం లెక్కలోకి రాలేదు. వాస్తవానికి కర్ణుని ఘనత దానంలో కాదు రాయబారం విఫలం అయ్యాక కృష్ణుడు ఏకాంతంలో మాట్లాడుతూ సామ్రాజ్యం ధారపోసినప్పుడు దానిని తృణప్రాయంగా విడిచి పెట్టడంలో ఉంది. ఈ విషయం మరోమారు భారతం చూసి గ్రహించాలి.

※ **శ్రీకృష్ణుడు ద్రౌపదికి చీరలిస్తే నమ్ముతారు, సత్యసాయిబాబా విభూతి, శివలింగాలు యిస్తే నమ్మరా?**

నమ్మనివారు దేనినీ నమ్మరు. నమ్మకం కలవారు రెండూ నమ్ముతారు. వారిని చూసి వీరు, వీరిని చూసి వారు నవ్వకపోతే చాలు.

※ **హిందూ దేవతలను హాస్యం చేస్తూ కార్టూన్లు వేసే దుర్మార్గులు..?**

అంతమాట అనకండి. హిరణ్యకశిపుడు, రావణుడు, కంసుడు కూడా భక్తులే. అసలు భక్తుల కంటే వాళ్ళే ఎక్కువగా భగవన్నామ స్మరణ చేశారు. వైరంతో ఈనాడు వీరూ అంతే. హాస్యం కోసం అలా ఆరాధిస్తున్నారు.

※ **రామాయణ, భారతాల నాడు నాస్తికులు లేరా?**

రామాయణంలో జాబాలి, భారతంలో ద్రౌపది ఈనాటికీ నాస్తికులకు

అవసరమైన శాస్త్ర పాఠం చెప్పారు.

❋ **రాముడు వ్యాయామం చెయ్యలేదా?**

రాముడే కాదు రాజకుమారులందరూ వ్యాయామం చేసి తీరవలసిందే. శరీరం ఉక్కులా తయారయితే గానీ గురువులు విడిచిపెట్టరు.

❋ **వాల్మీకి, వ్యాసులు హిందూ దేవతల కథలే వ్రాశారు, వారికి కూడా మతపిచ్చి...?**

వాల్మీకి, వ్యాసుడు బ్రతికిన కాలంలో ఈ దేశంలో హిందువులూ లేరు. మతమూ లేదు. ఈ మతం పిచ్చి అయిదారు శతాబ్దాల క్రితం ఎక్కింది. ఇప్పుడు విలయం సృష్టిస్తున్నది.

❋ **బ్రహ్మచర్యం ఎంతో శ్రేష్ఠం అని పెద్దలు చెబుతున్నారు, కాని అది అనర్థాలకూ, అనారోగ్యానికీ కారణమంటున్నారు డాక్టర్లు?**

ఈ దేశంలో చదువు వ్యాపారంగా కాక, జీవితాలతో చెలగాటమాడే డాక్టర్లు లేని రోజులలో పుట్టిన శాస్త్రవేత్తలు, మునులు ఇంద్రియ నిగ్రహం శక్తిమంతం అన్నారు. కాని మూడేళ్లు రాకుండా ముప్పై పుస్తకాల బరువు మోసి మూడు లక్షలు ఖర్చు పెట్టి పట్టా పుచ్చుకున్నవారు ఇంద్రియ నిగ్రహాన్ని బోధిస్తే జాతి ఆరోగ్యవంతంగా మారిపోతే, కొనుక్కున్న చదువును అమ్ముకునే దారి ఏదీ? అందుచేత అనారోగ్యం పెంచే డాక్టర్లకు వందనం!

❋ **ఒకే భార్య, ఒకే మాట, ఒకే బాణం అంటారు రామునికి..?**

అంటారు రామభక్తులు. కాని రామాయణం రాసిన వాల్మీకికి భక్తి కన్నా రాముని శక్తి మీద విశ్వాసం. ఒక్క బాణం పడితే చచ్చే నీరస రావణునితో యుద్ధం చేసినవాడు మహావీరుడు కాడని ఆదికవికి తెలుసు.

రణరంగంలో తనతో సమానమైన వీరులనే ఎదుర్కొంటాడు రాముడు. యుద్ధకాండ చదవండి.

❋ **అయిదుగురు భర్తలుంటే పాంచాలి, భార్యలుంటే?**

పాంచాల దేశ రాకుమారి పాంచాలి, ద్రుపద రాజపుత్రి ద్రౌపది అంతే! భర్తలతో సంబంధం లేదు.

**⌘ కీచకుడు భీముని కత్తిపోటుకి మరణించాడా?**

నాలుగడుగులు వేస్తే నీరసం వచ్చి పడిపోయే సుకుమారులు వీరులుగా నటించే కాలంలో కత్తులే కాదు, తుపాకులు కూడా కావాలి కీచక సంహారానికి. ఇలానే హనుమంతుడికీ గదాదండం అందించి తృప్తిపడుతున్నారు రామానంద సాగరులు. హనుమంతుడు, భీముడు కరాటే యోధులకు ఆదిగురువులు.

**⌘ హనుమంతుడు శివుడా?**

శివాంశ సంభూతుడంటారు.

**⌘ రావణబ్రహ్మని చంపిన పాపం పోవడానికి రాముడు శివలింగం ప్రతిష్ఠించాడా...?**

రాముడు రామేశ్వరంలో లింగప్రతిష్ట చేశాడని భారతంలో కూడా లేదు. ఆనాటికి ఆలయాలే లేనిదే ప్రతిష్టలెక్కడివి. శివకేశవ భక్తి రామాయణ, భారతాల తరువాయి లేచింది. రామాయణంలో సూర్యోపాసన, భారతంలో దుర్గాస్తుతి కనిపిస్తాయి.

**⌘ నపుంసకుడికి అప్సరస..?**

గుడ్డివానికి వెన్నెల, చెవిటివానికి సంగీతం, పందికి పన్నీరు, మూర్ఖుడికి హితబోధ, నపుంసకుడికి అప్సరస.

**⌘ సంధ్యావందనం చేయకపోతే ఆందోళన కలుగుతుంది?**

ఆందోళన కలిగే క్షణంలో ప్రణవం (ఓం) ఉపాసించండి. ప్రశాంతంగా ఉంటుంది.

**⌘ స్వామీజీలు, బాబాలు, అమ్మలూ లేకపోతే దేవుణ్ణి నమ్మలేమా?**

నమ్మకానికి ఎవరూ అవసరం లేదు, నమ్మకాన్ని బలపరచుకునేందుకు వెడతారనుకుంటాను.

**⌘ సూర్యపుత్రి సువర్చలను హనుమంతుడు పెండ్లాడెనని చదవలేదా?**

నేను చదివిన రామాయణమున హనుమంతుడు బ్రహ్మచారి, బ్రహ్మచారి, బ్రహ్మచారి.

**⌘ భారత, భాగవతాలలో దేనిని పూజించాలి?**

భారత, భాగవతాలే కాదు రామాయణం కూడా పూజించవలసిందే. అయితే దేవుని ముందుంచి గంధం జల్లి, పువ్వులు జల్లడం కాదు. ఆ మహాగ్రంథాలు చేతబట్టి, నిర్మల హృదయంతో ఏకాగ్రచిత్తంతో అర్థం చేసుకుంటూ చదివి మానవ జన్మను ఎలా చరితార్థం చేసుకోవచ్చునో గ్రహించి ఆచరించాలి.

❋ **ద్వాదశే మాసే చైత్రే - అని వాల్మీకంలో వుంది. అంటే చైత్రం పన్నెండో నెలయా?**

రామాయణ కాలంనాడు చైత్రం ఆఖరు నెల. వరాహమిహిరుడు నక్షత్ర గమనం, భూ భ్రమణం లెక్కకట్టిన నాటికి చైత్రం మొదటి నెల అయింది. అలా ఎప్పటికప్పుడు ఈ కాలగమనాన్ని గుణించే శాస్త్రజ్ఞులు వరాహ మిహిరునితో అంతం. మళ్ళీ ఇంకో మహనీయుడు పుట్టాలి పంచాంగ సంస్కరణకు.

❋ **అందరిలో ఉన్నదీ ఒకే రక్తం, ఒకే చర్మం అయినా కులం మారుతున్నదే?**

కుక్కలన్నింటికీ తోకలుంటాయి. నాలుగు కాళ్ళు, రెండు చెవులూ ఉంటాయి. అన్నీ మొరుగుతాయి. కానీ వేటకుక్కలు, ఆల్సేషియన్, బుల్‌గాడ్, వీధికుక్క.... ఎన్నిరకాలు! అలానే నెమలి, డేగ, కాకి పేర్లతో కోడి పుంజుల రకాలున్నాయి. వీటి వివరాలు విస్సాకోడేరులో తాతరాజుగారిని అడగండి. కోడి పందాలలో మాజీ మహరాజాయన.

❋ **ఇంద్రజిత్తు అస్త్రం రామలక్ష్మణులిద్దరినీ మూర్ఛలో ముంచెనా?**

ఒక సారి కాదు రెండుసార్లు. రెండవసారి రామలక్ష్మణులతో పాటు వానరులందరూ మూర్ఛపోతారు. హనుమంతుడు, జాంబవంతుడు తప్ప.

❋ **అతిథిగా వచ్చిన రామునికి శబరి ఎంగిలిపళ్లు ఇచ్చిందా?**

ఇవ్వలేదు, వాల్మీకి రామాయణంలో - ఆ తరువాయి పుట్టిన భక్తులు రాముణ్ణి ఎంత అభాసుపాలు చేశారో చూపడానికి ఈ ఎంగిలి కథ ఉదాహరణ.

❋ **భారతంలో గాంధారికి తగినంత ప్రాముఖ్యం కనిపించదే?**

మీరు కోరమండల్ ఎక్కితే నెల్లూరు, ఒంగోలు, ఏలూరు కనిపించవు.

అలానే భారతం ఒక్కమారు చదివేస్తే చాలామంది కనపడరు. ఈసారి ఉద్యోగ పర్వం, స్త్రీ పర్వం మాత్రం చదవండి. ఆవిడ రాజనీతి, స్త్రీ హృదయం కనిపిస్తాయి.

⌘ **భగవంతుడు ఆత్మలో వున్నాడా?**

ఆత్మయే భగవంతుడు అంటారు అద్వైతులు.

⌘ **ద్రౌపదీదేవి మెడలో పది మంగళసూత్రాలా?**

భారత, రామాయణాల నాడు మంగళసూత్రాలు, తలంబ్రాలు, వరకట్నాలు, ఆడపడుచు లాంఛనాలు, వియ్యపురాలు చీరలూ లేవు.

⌘ **వేదమంత్రాలన్నిటి చివర స్వాహా అని ఉంటుంది?**

అగ్నికాహూతులర్పించే సమయంలో మంత్రాలకే స్వాహా ఉంటుంది. అన్నిటికీ కాదు.

⌘ **మతం మత్తు మందు - అంటాడు మార్క్స్, మతం చాలా అవసరం మనిషికి అంటారు మహర్షులు..?**

మార్క్స్ కాలానికి మతం పేరిట జరిగే అత్యాచారాలు, అన్యాయాలు ఆయనకా భావం కలిగించడం ధర్మం. మహనీయుల దృష్టిలో మతం అంటే అహింస, సత్యం, సహనం, వినయం... ఇన్ని కలిసినది ఇప్పుడాలోచించండి.

⌘ **మూడు అవతారాలతో మూడు యుగాలు ఏర్పడ్డాయి. మిగిలినవి?**

అవతారాలు యుగాలలో వున్నాయి. కాని అవతారాలతో యుగాలు కాదు.

⌘ **దేవుళ్లని పూజించేవారు మానవ కళ్యాణానికి మరణించిన వారిని పూజించరాదా?**

మానవ జీవన కల్యాణ పథం చూపడం వల్లనే రామకృష్ణులను పూజించాలి. ఈనాడు కనపడని మహనీయుల కంటే కనిపించే కాలనేములనే పూజించే బుద్ధి పెరిగింది.

⌘ **కుంతి సంతానం అయిదుగురా? ఆరుగురా?**

కుంతి కన్నది నలుగురిని, పెంచినది అయిదుగురిని.

⌘ **భగవద్గీత ఎవరు రాశారు?**

కృష్ణుడు చెప్పగా విన్న సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పాడని వ్యాస మహర్షి

రాశాడు.

❋ **జీవహింస మహాపాపం కదా! మరి మునులు జింకచర్మం, పులి చర్మం వాడతారు, ఆ జంతువులను చంపవచ్చునా?**

జీవికి జీవి ఆహారం. ఏ ప్రాణికి ఏది ఆహారమో అది ఆ ప్రాణిని కబళిస్తుంది. ఇది ప్రకృతి ధర్మం. ఇంకా వివరాలు కావాలంటే మహాభారతం అరణ్యపర్వంలో ధర్మవ్యాధుని కథ సావధానంగా చదవండి.

❋ **కథలలో, నవలల్లో పాత్రలకు మంచి పేర్లుండవు. అవి అభూత కల్పనలు కనక- అందుచేత రామాయణ భారత పాత్రలకు కూడా ఇంటిపేర్లు లేవు...?**

నిజమేనండి. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, నన్నయ వీరికి ఇంటి పేర్లేమిటి? కనుక వీరు కూడా కల్పిత పాత్రలే అందామా అంటే మూడు నాలుగు శతాబ్దుల ముందు ఇంటిపేరున్న పురుషుడు లేడు ఈ దేశంలో.

❋ **కవులను చిన్నచూపు చూస్తూ వారి కృతులకు పూజలు చేస్తారే?**

కవికి చాలా దశలు, అవలక్షణాలు ఉంటాయి. కలం పట్టినప్పుడు ఈ దుర్లక్షణాలు దాగుంటాయి. అప్పుడు ఉన్న పాత్రలు వచ్చి పూజలందు కుంటాయి.

❋ **ఎంతో పుణ్యం చేసుకుంటే మానవజన్మ లభిస్తుంది. ఈ యుగంలో జనాభా చూస్తుంటే అందరు పుణ్యాత్ములున్నారా?**

సైన్స్ ప్రభావం వల్ల మరణాల సంఖ్య తగ్గి జనాభా పెరుగుతున్నది. మరణాలు తగ్గాయే కాని ఏనాడూ లేనంత అనారోగ్యం పెరుగుతున్నది.

❋ **దేవుడు అంతటా వున్నప్పుడు ఏదో రాతిబొమ్మను పట్టుకు పూజించడం దేనికీ?**

మీ మనస్సు ఆ రాయిలా నిశ్చలంగా ఉండి మీలో ఉన్న పరమాత్మ వైపు ఏకాగ్రం కావడానికి.

❋ **రామునికి లవకుశులు పిల్లలు, మిగిలిన లక్ష్మణ, భరతాదులకు సంతానం లేదా?**

పిల్లలు లేని దంపతులు రామాయణభారతాలలో వుండరు.

**⌘ కులమతాలు నశించే మార్గం లేదా?**

ఈ రెండింటి మీద ఆధారపడి నాయకత్వం, మంత్రి పీఠం సింహాసన భ్రష్టత్వం... ఇలా ఎన్నో వుండగా, వాగ్దానాలతో బ్రతికే పెద్దలు కులమతాలను నాశనం కానిచ్చి తమ పదవిని పాతాళానికి త్రొక్కుకుంటారా! వీటిని గురించి ఆలోచించి ద్వేషాలు పెంచుకోవడం మానిననాడు అవే తప్పుకుంటాయి.

**⌘ ఒక్కో దేవుడికి ఒక్కోవారం నాడే పూజలు రావడానికి కారణం?**

ఇందరు దేవుళ్ళనూ ఒక్కనాడు ఆరాధించలేక! వాస్తవానికి ఉన్న ఒక్క దేవుణ్ణి ఏకాగ్రచిత్తంతో స్మరించగలిగితే వారాలూ వర్జ్యాలూ అడ్డు రావు.

**⌘ అర్జునుడు పాశుపతాస్త్రం వినియోగించాడా?**

సైంధవుని తల నేల మీద పడకుండా ఉండటానికి వినియోగించాడు. ద్రోణపర్వం చదవండి.

**⌘ వేదాలు లిఖిత పూర్వకంగా లేవా?**

వేదాలే కాదు ఉపనిషత్తులు, రామాయణం కూడా ఒకరి నోటి నుండి ఒకరు నేర్చుకున్నవే.

**⌘ మీరు మంత్రి అయితే?**

మా మునిమనుమలకు స్విస్ బాంకులో ఖాతా తెరచుకుని పదవి వదిలేస్తా.

**⌘ రామాయణ హనుమంతుడు భారతంలో వున్నాడా?**

ఉన్నాడని వ్యాసులవారు భారతంలో చెప్పారు. ధర్మసంహిత రాసిన ఋషి అబద్ధం ఆడతాడంటారా.

**⌘ దేవుడి కళ్యాణంలో అమ్మవారికి అర్చకులు మంగళసూత్రాలు కడతారేం?**

దేవుని అసలు పెళ్లినాటికి మంగళసూత్రం లేదు కనక! విగ్రహంలోనూ అర్చకునికి అంతరంలోనూ వున్నది పరమేశ్వర శక్తి కనక!

**⌘ ద్రౌపది కర్ణుని ఆరవ భర్తగా కోరడం..?**

ద్రౌపది కోరిందని మీకు చెప్పిన శకునికి, మానసిక చికిత్స చేయించండి. రాయబార సన్నివేశంలో కృష్ణుడు కర్ణునితో సంభాషిస్తూ సామ్రాజ్యంతో పాటు

సౌందర్యరాశిని కూడా ఎరవేసినట్లు తెలుగు భారతంలో వున్నమాట నిజం. వ్యాసప్రోక్తమైన సంస్కృత భారతంలో మాకు దొరికినంత వరకూ ఈ ప్రస్తావన లేదనీ, తిక్కన్నగారికి దొరికిన ప్రతిలో వుండకపోదనీ మా గురువులు సెలవిచ్చిన దానినే మేమూ చెప్పుకుంటున్నాం.

✻ **రాముడు మాంసాహారియా?**

వాల్మీకి రామాయణం రాసిన కాలంలో మానవులందరూ సుఖంగా మాంసం ఆరగించారు. ఆయన రాసిన ప్రకారం రాముడు ఇక్ష్వాకు వంశంలో పుట్టిన క్షత్రియ బాలుడు. అప్పటికింకా మూడు నామాలు, అడ్డబొట్లతో సిగపట్లు పట్టే దౌర్భాగ్యం రాలేదు.

✻ **రావణుడు సీతాపహరణం చేయడం తప్ప ఇతర దోషాలు చెయ్యకపోగా శివభక్తుడు కూడా. అయినా ఈనాటి స్వార్థపర నాయకులను ఆయనతో పోల్చడం?**

చాలా అన్యాయం. అయితే త్రేతాయుగంలో ఏమాత్రం దారి తప్పినా తల తీసి, పాతిపెట్టే రామచంద్రులుండేవారు, కలియుగంలో రామచంద్రులు లేరు కనుక అత్యాచారాలు అధికంగా చెయ్యగల రావణసంతానం పెరిగిపోతుంటే వారిని తిట్టడానికి మరో పేరు దొరకక ఆ శివభక్తునితో ఈనాటి శవభక్షకులను పోలుస్తున్నారు.

✻ **పరోపకారానికే ఈ శరీరం అన్నారు. అందరూ పరోపకార పరాయణులైన బోయీలే అయితే పల్లకీలెక్కేవారేరీ?**

అది తెలియక శ్రీశ్రీ ప్రభువెక్కిన పల్లకీ కాదోయ్ అని అమాయకంగా మహాప్రస్థానం సాగించాడు.

✻ **కైక లోకకళ్యాణం కోసం రాముని అడవికి పంపిందంటారా?**

అంటున్నారు. ఏకపత్నీ ధర్మాన్ని పాటించలేక రెండో కుంపటి అంటించుకున్నవారందరికీ - వాల్మీకి రామాయణంలో మాత్రం కైక సవతి తల్లి. నేటి సవతులందరూ ఆమెకు పూజచేయాలి.

**⌘ కలియుగంలో పాపాత్ములే చిరకాలం బ్రతుకుతుంటే దేవుడేం చేస్తున్నాడు?**

వాళ్ళ పాపం పండేవరకే చూస్తున్నాడు.

**⌘ విద్య నేర్పని ద్రోణుడు గురుదక్షిణ కోరడం న్యాయమా?**

పరీక్ష పేపర్లు రెండు రోజుల ముందే బజార్లో కొనుక్కుని, చక్కగా కాపీ కొట్టి, విరాళాలిచ్చి సీట్లు, లంచాలిచ్చి పదవులు సంపాదించే యుగంలో జీవచ్ఛవాల వలె బ్రతికే కాలంలో ఈ ప్రశ్న పుట్టకపోతే భారతం బూడిదై పోయేది.

విద్య ఉన్నదే దాని బోధలో గురువులు అవలంబించే విధానాలన్నీ ఒక మార్గాన వుండవు. గురువు మౌనంగా శిష్యుని చూస్తే వాని సర్వసంశయాలూ ఛిన్నాభిన్నమై జ్ఞానం పొందేది, ఉత్తమ మార్గం కొస అందిస్తే చివరదాకా తెలుసుకోగలిగిన మార్గం మరొకటి. శిష్యుడి శక్తిని, మనస్సును బట్టి బోధించేది మరొకటి. సిమెంటు మేడల మధ్య మండుటెండలలో 125మందిని కూర్చోబెట్టి వారు విన్నా వినకపోయినా రేడియో ప్రోగ్రాం వలె చెప్పుకుపోవడం నేటి అధమ విధానం.

ఇవన్నీ లేక గురువును మనసా స్మరిస్తూ విద్య నేర్చుకోవడం అతి విశిష్టమైన పద్ధతి. ఈ దారిలో నేర్చుకున్న ఏకలవ్యుడు-

నా గురువు ద్రోణాచార్యుడని చెప్పాడు. ఏకలవ్యుడు స్వయంగా ఈ మాట చెపితే, అది కాదనడం మన చదువు ప్రభావం. అసలీనాడు గురు శిష్య సంప్రదాయం ఎక్కడుంది? వేలు విరాళిలిచ్చి, మరిన్ని వేలు జీతాలు పోసి కొనుక్కునే సరుకు చదువు. డబ్బు పోస్తే దొరికే కల్తీ మందు కాదు భారతంలో విద్య. అందుచేత గురుదక్షిణ కోరడం, ఇవ్వడం న్యాయం అని ఏకలవ్యుడు భావించాడు.

**⌘ సజ్జనులు దుర్జనులూ కూడా దైవప్రార్థన చేస్తారు. మరి దేవుడు ఎవరిని అనుగ్రహిస్తాడు?**

ఆయనకు ఆగ్రహం అనుగ్రహం లేవు. ఎన్నికల్లో నిలబడినవారంతా కొబ్బరికాయలు కొట్టి, కుంకుమపూజ చేస్తారు. కాని ఒక్కడే నెగ్గుతాడు.

సక్రమంగానో, అక్రమంగానో! ఇద్దరినీ నవ్వు రాజిల్లెడు మోముతో చూడడం దైవం చేసే పని. ఆయన లీల అనుకుని దండం పెట్టాలి!

❖ **ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి స్వాధీనమయితే పరమాత్మలో లీనమవుతామా?**

లీనం కావడం కాదు, పరమాత్మయే అవుతారు అంటారు అద్వైతులు!

❖ **ఫలాపేక్ష లేకుండా కర్మ ఎవడు చేస్తాడు?**

కూర్చున్న చోట నుండి కదలకుండా అన్నీ కాళ్ళ దగ్గరకు రావాలనుకునే సోమరులు పెరిగిన కాలంలో కర్మ చేసేవాడే లేడు. కాని ఆపేక్ష లేకుండా తన కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో ఎంత సుఖం ఉన్నదో గ్రహించగలిగితే దేశంలో ఆత్మహత్యలు, అత్యాచారాలు తగ్గుతాయి.

❖ **ఇద్దరు భార్యలున్నారు, ఎందరో ప్రియురాళ్ళున్నారు, అయినా కృష్ణుడు దేవుడు. ఈనాడు ఇద్దరు భార్యలుంటే వాడు ద్రోహి?**

కృష్ణ భగవానుడికి రుక్మిణి, సత్యభామ ఇద్దరే భార్యలనుకుంటున్నారా! ఎనమండుగురున్నారని భాగవతం చెబుతున్నది. ఆయన దేవుడని నమ్ముతారా మీరు, నమ్మితే దైవలీలకు తల వంచాలి. కాదు మానవుడంటారా. ఆయనకు ఎందరు భార్యలున్నా అందరినీ సమానమైన అనురాగంతో చూడగలిగాడు. ఈనాటివారివలె కట్టుకున్న ఇల్లాలికి తిండి పెట్టకుండా పర్సనల్ సెక్రటరీతో విహారాలు చేసే ప్రబుద్ధుడు కాడు కనుక దండం పెట్టి పూజించాలి.

❖ **రాముడు అగ్నిప్రవేశం చెయ్యమంటాడని తెలిస్తే సీత..?**

అది తెలిస్తే లంకలో బ్రతికేది కాదు. చిత్రం ఏమంటే రాముడు నిప్పులో దూకమనలేదు. సీతాదేవి తనంత తాను దూకబోయింది. దూకితే తాను మాడిపోతానని అగ్నిహోత్రుడు గజగజలాడాడు. చదవండి రామాయణం!

❖ **క్యూలో కళ్ళు తెరుచుకుని గంటల తరబడి నిలబడి దేవుని విగ్రహం ముందు కళ్ళు మూసుకుంటారేం?**

ఆ విగ్రహం మనస్సులో నిలబడాలని.

❖ **మతం మార్పిడులకు కారణం?**

దేవుడు ఒక్కడే అని తెలియక.

**⌘ భగవంతుడు మనిషిని పుట్టించాడా? మనిషి దేవుని సృష్టించాడా?**

దేవుడు చేసిన మనుషులు తమలో దైవత్వం ప్రవృద్ధం కావడానికి దేవుని సృష్టించారు.

**⌘ మనిషి-మృగం ఏమిటి తేడా?**

మృగాలు అబద్ధం ఆడవు. దొంగతనం చెయ్యవు. అత్యాచారాలు అభినయ వాగ్దానాలు, అయిదు తరాలకు సరిపడే స్విస్ బ్యాంకు ఎకౌంట్లు... ఇవేవీ తెలీవు.

**⌘ రావణుడు మాయా సీతను అపహరించాడా?**

మాయా రావణుడుంటే మాయా సీతను కల్పించక తప్పదు. అసలు రావణుడు అస్సలు సీతనే దొంగచాటుగా ఎత్తుకుపోయాడని వాల్మీకి ఘోష.

**⌘ ఓంకారం నుండి బ్రహ్మ, పరబ్రహ్మ పుట్టారా?**

నిస్సందేహంగా ఓంకారం నుండి సర్వసృష్టి నడుస్తున్నది.

**⌘ బ్రహ్మాస్త్రానికి తిరుగులేదు కదా! ఇంద్రజిత్తు లక్ష్మణుడి మీద వేసినప్పుడు వ్యర్థమైందేం?**

అస్త్రం ప్రయోగించేవాని శక్తి మీద దాన్ని ఎదుర్కొనే వాని శక్తి మీద ఆధారపడి ఉంటుంది. చిన్న ఉదాహరణ. లోభి దగ్గర కోట్లు మూలుగుతూంటాయి. అవి భూమిలో పాతిపెడతాడు. ఎవరికి దొరుకుతాయో తెలీదు. అవే మంచి వ్యాపారి దగ్గరుంటే కోటి పది కోట్లవుతుంది. దాత దగ్గరుంటే పదిమందికి గ్రాసవాసాలకు వినియోగపడతాయి.

**⌘ భిక్షాందేహి అన్నపూర్ణేశ్వరీ, అని యువజనానికి యాచన నేర్పడం..?**

యాచనచేసేవారికి భిక్షాందేహి, మనస్సును ఏకాగ్రం చెయ్యవలసిన వారికి కృపావలంబనం!

**⌘ జడపదార్థాలలో ప్రాణం ఉన్నదనీ, వానిలో భగవంతుడున్నాడనీ అంటారే?**

ఇందుగలడందులేడని సందేహము వలదు అని అంతటా భగవంతుని

చూసిన ప్రహ్లాదుని మాట నమ్మలేక చివరకు చూస్తూనే ప్రాణాలు వదిలాడు అనుమానప్రాణి హిరణ్యకశిపుడు.

ఇక మీ ప్రశ్నకు సమాధానం జగదీశ్ చంద్రబోస్ వృక్షాలలో ప్రాణి అనుభూతులు చూపించాడు. ఇటీవల అమెరికాలో మూడు గదులలో మూడు లతలు పెంచుతూ ఒకదానికి డిస్కో, బ్రేక్ పాటలు, రెండోదానికి వారి జాన పదాలు, మూడో దానికి శాస్త్రీయ సంగీతం వినిపించగా మొదటి తీగ మాడి పోయింది. రెండోది నిశ్చలంగా ఉంది. మూడోది పాట వినిపించే దిశగా తీగ సాగింది. ఇప్పుడు తెలిసిందిగా ప్రాణంతో పాటు, ఈ రణగొణ సంగీతం ప్రాణి నరాలను ఎలా తోడి మాడ్చి మసి చేస్తున్నదో.

⌘ **రాముడు సంధ్యావందనం చేశాడా?**

రాముడేకాదు గుహుడు కూడా. ఉభయసంధ్యలలో ప్రవాహోదకంలో నిలబడి సూర్యునికి అర్ఘ్యం వదిలి నమస్కరించవచ్చు.

⌘ **వ్యాసుని తల్లి, భీష్ముని తల్లి ఒకరేనా?**

వ్యాసులవారిని కన్నతల్లి దాశరాజు ఇంటపెరిగిన సత్యవతి, భీష్ముని మాత గంగ.

⌘ **అన్ని జన్మలలో మానవ జన్మ ఉత్తమం, దీనినే పాపిష్టి జన్మ అంటారేం?**

ఉత్తమంగా నడవకపోవడం వల్ల పాపిష్టి అవుతుంది. పక్షులు, జంతువులు పాపం పనులు చెయ్యవుగా! అబద్ధాలాడవు. అత్యాచారాలు చెయ్యవు. అన్నీ చెయ్యగల పాపి మానవుడే.

⌘ **రాముడు మానవుడా? దేవుడా?**

మీ ఆలయంలో దేవుడు, వాల్మీకి గుండెలలో మానవుడు.

⌘ **వాలిసుగ్రీవుల జన్మగాథ..?**

ఋక్షరజనుడనే వానరరాజు పిల్లలని వాల్మీకం.

⌘ **విధి రాత మార్చుకోలేమా?**

మార్చుకునే రాత కూడా విధి రాయాలి.

**⌘ అన్ని మతాలకు ప్రవక్తలున్నారు. హిందువులకు?**

మనకు మతం లేదు. వేదప్రతిపాదితమైన ధర్మం ఉన్నది. దానికి ప్రవక్త ఉండడు. ఏ మతం వారికైనా ధర్మం అనుసరణీయం మానవత్వం కావాలంటే.

**⌘ రామాయణం నిజంగా జరిగిందా? వాల్మీకి కల్పనయా?**

జరిగిన కథను నారదుడు పొడిపొడిగా చెప్పగా దానిని నవరసభరితంగా మానవజాతికి మహౌషధిగా ఇచ్చిన శక్తి వాల్మీకిది.

**⌘ మంత్రులు, శాసన సభ్యులు ప్రమాణం చేసి ఆ ప్రమాణం ప్రకారం నడవరేం?**

నడిస్తే మళ్లీ పదవికి పెట్టుబడి దొరకదు. మరోసారి ప్రమాణానికి సందు చిక్కదు.

**⌘ మాద్రి వలె కుంతి సహగమనం చేయలేదేం?**

భారత కాలం నాటికి సహగమన దురాచారం ఈ జాతిలో లేదు. దేశదేశాల ముష్కరులు ఈ భూమి మీద దాడి చేసి సంపదలు దోచుకు తృప్తిపడక పశువుల వలె పతివ్రతల మీద పడుతూంటే మానధనమైన జాతి ఆ దౌర్భాగ్యానికి లొంగక తప్పలేదు. తరువాయి కొన్నిచోట్ల ఆ ఆచారం నిలబడిపోయింది.

**⌘ దేవాదాయ, ధర్మాదాయ శాఖ హిందూమతానికే పరిమితమా?**

ఇతర మతాలవారికున్న దైవభక్తి మనకు లేదని తెలుసుకున్న వారు మన సెక్యులర్ స్వాములు. మనది నిర్వీర్యమైన జాతి.

**⌘ ఆంజనేయులు బ్రహ్మచారి కాదా?**

రామాయణంలో బ్రహ్మచారిగానే ఉన్నాడు. ప్రేమాయణ కర్తల చేతిలో పడి పెళ్ళి చేసుకున్నాడేమో తెలియదు.

**⌘ భీష్మ జననం, శ్రీకృష్ణ జననం సమంగా లేవూ?**

అష్టమగర్భం వరకూ మీరు చెప్పింది బావుంది.

**⌘ ప్రపంచంలో ప్రతి మతం వారు తమ మతమే గొప్పదంటారేం?**

తమ మతంలో ఉన్న సత్యాలూ, ధర్మాలూ ఇతర మతాలలో ఉన్నాయని తెలియక. అలానే అన్ని మతాలకూ దేవుడొక్కడే, నామాలు వేరు అని

చెబుతున్నా వినిపించక మతం కంటే మతికి స్థిమితం తప్పి, ఉన్మాదం పెరిగి ఈ అల్పబుద్ధులు సాటివారిని హతమారుస్తున్నారు.

**⌘ దశరథుడు పట్టాభిషేకానికి రాములవారి మామగారినెందుకు పిలవలేదు.**

భరతుని తాతగారిని పిలిస్తే కొంప మునిగిపోతుంది. కైకేయిని వివాహమాడే సమయంలో ఆమె కుమారునికి పట్టాభిషేకం చేస్తానని వాగ్దానం చేశాడు. అందుచేత ఆయనను మాత్రమే పిలవకపోతే అనుమానానికి దారితీస్తుందని రాముని మావగారిని కూడా మరిచిపోయినట్టే అనుకోవాలని ఊహించాడు దశరథుడు. ముసలితనంలో ఆ మాత్రం మరుపు సహజం అని అందరూ అనుకున్నారు. అయినా కథ ఆయన అనుకున్నట్లు జరిగితే రామాయణం లేదు. మనకి తాపత్రయం లేదు.

**⌘ పశ్చాత్తాపం వల్ల పాపాలు పోతాయా?**

పశ్చాత్తాపం పాపాలను ప్రక్షాళన చేస్తుందని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. అయితే ఈ పశ్చాత్తాపం ఆ క్షణంలో వదిలి మళ్ళీ పాపాలు మొదలుపెడితే పూర్వ పాపాలకు శిక్ష మూడింతలవుతుంది. అంటే పశ్చాత్తాపంతో మనస్సు నిర్మలం కాకపోతే నిష్ప్రయోజనం.

**⌘ రావణుడు రామ నామంతో ప్రాణాలు వదిలాడా?**

వానరసేన హరహర మహాదేవ అనడం, వారధి నిర్మాణంలో ప్రతి బండ రాయి మీద శ్రీరామ, శ్రీరామ ఇవన్నీ హరిదాసులూ, పౌరాణికులూ ఎక్కించగా సినిమాలవారూ, దూరదర్శన్ వారూ పూసుకున్న బూడిదపూతలు. రావణుడు చచ్చినా రామనామం జపించడు.

**⌘ రావణాసురుడు రామలక్ష్మణులకు చేసిన ధర్మోపదేశం వివరిస్తారా?**

రావణుడి దగ్గర ధర్మం నేర్చుకునే రాముడు రామాయణంలో వుంటే ఇన్ని వేలమంది ఆరాధనలందుకునేవాడు కాదు.

**⌘ భగవద్గీత పుచ్చుకుని కోర్టులో ప్రమాణం చేసినంతలో నిజం చెబుతారా?**

ఈ దేశం వారికి మత పిచ్చి ఎక్కువని భావించిన తెల్లదొరలు ఈ విధానం

పెట్టారు. వాస్తవానికి ఈ జాతికి మత గ్రంథం లేదు. భారతం, రామాయణం, భారతంలోని గీత ఇవేవీ మత గ్రంథాలు కావు. మానవునిలోని పశువునీ, పిశాచాన్నీ పారద్రోలి మనిషిగా నిలబెట్టడానికి పుట్టిన గ్రంథాలవి.

పైగా ఈ జాతికి మతం పేరు తెలియని రోజులలో పుట్టిన పుస్తకాలవి. పర్యవసానంగా కన్నతల్లికి తిండి పెట్టకుండా, కట్టుకున్న పెళ్ళాన్ని నడివీధికి తోలే ప్రబుద్ధులకు గీత ఒక లెక్కయా? అయినా అలవాటు ప్రకారం ప్రమాణం తప్పదు.

**⌘ భారతం మొత్తంలో ధృతరాష్ట్రుడంత దుర్మార్గుడు లేడంటాను?**

ఈమాటే ఆ గుడ్డివాని ఆంతరంగిక సచివుడు సంజయుడు చెప్పాడు. మహాసాధ్వి గాంధారి చెప్పింది అయినా ధన లోభంతో అంతకు తెచ్చుకున్నాడు. ఆ కళ్ళు లేని వాడి కథ విని కళ్ళున్నవాళ్ళు తమ సంతానాన్ని సరైన దారిలో నడుపుకుంటారని వ్యాసమహర్షి ఈ ఇతిహాసం అందించాడు.

**⌘ కుంతీదేవి చిన్ననాడే తనను ప్రసవించినట్లు కర్ణుడికెలా తెలుసు?**

ఎలా తెలుసునో వ్యాసులవారు సెలవియ్యలేదు. అయితే ఇటువంటి పరమరహస్యాలు నీలాటి రేవులలో ఆడవారి గుసగుసలలో బైటపడ్డాయని అనుకోవాలి.

**⌘ సీతాపహరణం చేసినంతలో రావణుడు దుర్మార్గుడెలా అయ్యాడు, సోదరికి జరిగిన పరాభవానికి ప్రతీకారం చేయరాదా?**

రామాయణం చదివారా? పరాభవం ఎందుకు జరిగింది? జరిగిన పరాభవ గాథను శూర్పణఖ ఎలా త్రిప్పింది. త్రిప్పెనుబో, పరస్త్రీని అపహరించడం మీకు సన్మార్గం అనిపిస్తే కోటిదండాలు.

**⌘ కురుక్షేత్రంలో అందరు యోధులు 'పసిబాలు'ని హతమార్చడం యుద్ధ తంత్రమా?**

మీరు పసిబాలుడనుకుంటున్న అభిమన్యుడి వయసు పాతికేళ్ళ పైమాట. అందరు మహారథికులను ఆరుచెరువుల నీరు త్రాగించి ఆవురావురు

మనిపించిన యోధుడు. అంతమాత్రాన అందరూ చుట్టుముట్టడం ధర్మం కాదు, యుద్ధ నీతి కూడా కాదు. కాని గత్యంతరం లేక త్రొక్కిన అడ్డదారి.

**⌘ టీవీ రామాయణం చూస్తూ కొబ్బరికాయలు కొట్టేవారినేమనాలి?**

తెరమీద బొమ్మను పడకగదిలో పెట్టుకు ఆరాధించేవారికంటే అధములు కారనాలి.

**⌘ కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తే పుణ్యం అని ఏ పురాణం చెప్పింది?**

పురాణాలకు ముందు పుట్టిన వేదం చెప్పింది.

**⌘ బూడిదకు విభూదికి తేడా ఏమి?**

సంస్కృత విభూతి 'తెలుగు బూడిద' అయింది.

**⌘ నేను సుఖంగా వున్నానని చెప్పగల నాస్తికుడిని అని చెప్పగల ఆస్తికుడున్నాడా?**

సుఖానికి ఆస్తి, నాస్తి విచికిత్స లేదు. మనస్సు ప్రధానం. మీరు చెప్పుకుంటున్నారంటే అది ఎదుటివాడికి తెలియడంలేదనే బాధ కనిపిస్తున్నది.

**⌘ రావణుడు సీతను రామునికిచ్చి శరణు వేడితే విభీషణుని గతి ఏమి?**

కామదాసుడైన రావణుడు రామదాసు అయితే భద్రాచల రామదాసుకి బందిఖానా తప్పేది కదా! రావణుని అహంకారం మనకంటే రామచంద్రునికి బాగా తెలుసు.

**⌘ ఇతర దేవతల ఆలోచన మాని హనుమంతుని సేవించిన సర్వ సుఖములనిచ్చునా?**

ఆ మాట చెప్పిన తులసీదాసు అబద్ధం ఆడడు.

**⌘ బహుపత్నీ వ్రతుడైన దశరథుని కొడుకు ఏకపత్నీవ్రతుడా?**

తండ్రి బాధలు చూసిన జ్ఞాని రాముడు. అంతేకాదు శ్రీహరిని ద్వేషించే హిరణ్యకశిపుని కొడుకు ప్రహ్లాదుని కథ ఎరగరూ?

**⌘ కుంతీదేవి ఐరావత వ్రతం చేసినపుడు...?**

లక్ష శ్లోకాల భారతంలో ఈ ఏనుగు వ్రతం లేదు.

**⌘ భగవద్గీత చదివితే అన్ని సమస్యలూ పరిష్కారం అవుతాయా?**

చదివినంతలో ఏదీ పరిష్కారం కాదు. దీని సారాంశం మనస్సుకెక్కితే సమస్యలే వుండవని అనుభవజ్ఞుల జీవితాలు చెబుతున్నాయి.

⌘ **మహాజ్ఞాని వశిష్ఠులవారు పట్టాభిషేక ముహూర్తానికి ఎందుకు అంగీకరించారు?**

జ్ఞానికి అయోధ్య- అరణ్యం రెండూ ఒకటే.

⌘ **భగవన్నామ జపం శుచిగా చేయవలెనా?**

మనస్సు శుచిగా ఉంటే చాలు, కాని నిరంతర దురాలోచనల దుఃఖాల మధ్య వుండే మనస్సు శుచిగా వుండదే. అందుచేత దేహం శుచిగా వుంటే క్రమంగా మనస్సు నిర్మలమవుతుందని శుచి పెట్టారు.

⌘ **యుద్ధంలో ప్రాణాలు పోయినవారు వీరస్వర్గం చేరుతారని చెప్పిన తమరే శత్రువులను యమపురికి పంపాడని రాశారే?**

యమ సదనం చేర్చాడు. యమపురికి పంపాడు. కాలపాశం తగిలించాడు - ఈ మాటలన్నీ ప్రాణం తీశాడన్నదానికి పర్యాయంగా వాడుతారు. అంతే తప్ప వాడు నరకానికి పోయాడని కాదు. ఈ దృష్టితోనే పరమ దుర్మార్గుడు చచ్చినా స్వర్గస్థుడయ్యాడని వాడేవారూ వున్నారు. చావును చెప్పడానికే యివన్నీ.

⌘ **భారతాన్ని కవిత్రయం వ్రాశారు, రామాయణాన్ని?**

భాస్కరుడు, రంగనాథుడు, మొల్ల, గోపీనాథుడు, శ్రీపాద, విశ్వనాథ, తెలుగులో కవిత్రయ భారతానికున్న పలుకుబడి ఎవరి రామాయణానికీ రాలేదు. తెలుగు వారికున్న వారి రామభక్తి అంతటిది.

⌘ **టీవీలో రామాయణం మూఢనమ్మకాలను పెంచుతుందంటున్నారే?**

అది వారి మూఢ విశ్వాసం అని మీరూ అనండి. నమ్మకం లేకపోతే మానవత్వం లేదు.

⌘ **సీతను అగ్ని దగ్గర దాచి స్వాహాదేవిని ఆ వేషంతో లంకలో వుంచారా?**

రామానందసాగర్‌కు ముందు రామాయణ సాగరంలో మునిగిన తులసీ దాసులు కొందరికి జానకీ దేవిని ఒంటరిగా లంకలో వుంచడం యిష్టం లేక ఆ కష్టాలు స్వాహాదేవి పడితే బావుంటుందనుకున్నారు. వాల్మీకికి అంత భక్తి

ముదరలేదు సీతారాముల మీద.

※ **కృష్ణుడు రాయబారానంతరం కర్ణునితో మాట్లాడుతూ ద్రౌపదీదేవి విషయం ప్రస్తావించలేదనీ, కర్ణుడు డెబ్భయ్యేళ్ళు పైబడ్డ ముసిలాడనీ, ద్రౌపది అమ్మమ్మ వయసుదనీ అంటున్నారే?**

కర్ణుడే ముసలివాడయితే కర్ణుని కంటె యాభై యేళ్లు పైబడ్డ భీష్ముడెంత వృద్ధుడు కావాలి, అంత ముసలివాడూ కృష్ణార్జునులకు చెమటలు పట్టే యుద్ధం చేసినట్లు భారతం చెపుతున్నదే. అంటే కర్ణుడు ముసిలివాడు అనే ఈ కాలపు వృద్ధులున్నారే వారికి తెలియవలసిన రహస్యం-

భారత కాలం నాడు వయసుతో వార్ధక్యం రాదు. వందల సంవత్సరాలు జీవించగలిగిన ఆరోగ్యకర వాతావరణం ఉన్న యుగం అది. గాలి, నీరు, ఆహారం, ఔషధాలూ, కలుషితమైన కాలంలో బ్రతికే మనకు మూడు పదులు నిండకుండానే ముసలితనం వస్తున్నది. అయినా ఈనాడు కూడా తొమ్మిది పదులు నిండిన మొరార్జీ దేశాయ్‌తో రాజీవ్‌గాంధీ పరుగెత్తలేడు.

※ **స్వామి వివేకానందుడు - 'ఆత్మ సృష్టింపబడదు' అన్నాడు, మరి జీవకోటి రోజు రోజుకూ ఎలా పెరుగుతోంది?**

ఆత్మకు ఆది అంతం లేవని ఉపనిషత్సారంగా అందిన భగవద్గీత చెప్పిన దానిని వివేకానందస్వామి చెప్పారు. జీవకోటి పెరుగుతున్నదని మీరు చెపుతున్నారే, పెరిగేది దేహకోటి.

※ **రథచక్రం ఎత్తుకునే కర్ణుని చంపించడం అధర్మం కాదా?**

భారతం కర్ణపర్వం చదవండి. కర్ణుడు రథం మీద వుండగానే చంపించాడు కృష్ణుడు.

※ **అంతా కర్మానుసారం జరుగుతుందని ఎరిగినవారు కూడా కొన్నింటికి విశ్వప్రయత్నాలు చేస్తారేం?**

చేసేటప్పుడు కర్మజ్ఞానం జారిపోతుంది.

※ **మాంసాహారులు జీవహింస చేస్తే వారిని దేవుడు శిక్షించడా?**

హింస, అహింస అనేవాటి కథ తెలియాలంటే భారతం అరణ్యపర్వంలో ధర్మవ్యాధుని కథ చదవాలి.

⌘ **మనిషికి మనసుంది కనుక ఆలోచిస్తాడు, మరి దేవునికి..?**

దేవుడు ఆలోచిస్తూ కూర్చోడు. ఆచరిస్తాడు.

⌘ **వంతెనలు, భవనాలు ప్రారంభించడానికి మంత్రులు రావాలా? ఆ పుర ప్రముఖులు పనికిరారా?**

శంకుస్థాపనలూ, ప్రారంభోత్సవాలూ లేకపోతే వారికింక పనేముంది!

⌘ **వ్యాకరణాన్ని విడిచి భాష దిగజారిపోతుంటే ఎవరూ అడ్డుకోరా?**

నీతిని, ధర్మాన్ని విడిచి మహామహులు ముష్టిచేతులు జాపి ముడుపులు జుర్రుకుంటుంటే ఎవడికీ పట్టని కాలం యిది.

⌘ **అమృతం రాక్షసులకే దొరికి వుంటే?**

రాక్షసులకే దొరికింది. అంతకంటే అధరామృతం అవసరమై ఆ కలశం జగన్మోహిని చేతికిచ్చారు.

⌘ **నాస్తికులు ఆస్తికులు కావచ్చునా?**

కాలచక్రం పైకీ క్రిందకీ తిరుగుతూన్నంత కాలం ఆ చక్రంలో తిరిగేవారు అటూ యిటూ మారాలి.

⌘ **మన మతాన్ని మనమే దూషించడం?**

అన్నిమతాలూ ఒకే ఈశ్వరుని గురించి చెప్పినట్లు తెలియని అవివేకులు చేసిన పని అది.

⌘ **కోడిగ్రుడ్డు శాకాహారమా?**

పాలు కూడా మాంసాహారమనే పెద్దలన్నారు.

⌘ **అన్ని మతాల సారం ఒక్కటే అయితే మతం మార్చడం దేనికి?**

మార్చవలసింది మతి కానీ మతం కాదని తెలియక.

⌘ **భారతంలో ఆర్యపుత్ర, పితామహరాజ్ అంటున్నారు. పితాజీ, పితాశ్రీ అని రామాయణం సీరియల్‌లో అన్నారు, ఇందులో ఏది సాంప్రదాయం?**

రెండింటికీ సాంప్రదాయమే ఆధారం.

⌘ **ప్రపంచాన్ని భస్మీపటలం చేయగల మారణాయుధాలు కనిపెట్టిన మానవుడు తుఫానులు, భూకంపాలు ఆపలేడా?**

ప్రకృతిలోని పంచభూతాలనూ జయించిననాడు మానవుడు మృత్యువునే జయిస్తాడు. అంతవరకూ దీనికి ఒకో ఉద్యమం లేచినప్పుడల్లా ఎన్నికోట్ల ఆస్తి నష్టం, ఎంత ప్రాణనష్టం చేస్తున్నాడు. వైజ్ఞానికంగా పెంచుతున్నామే కాని మానవత్వాన్ని పెంపు చెయ్యలేని చదువులు కొనిపెడుతున్నాం. దాని ఫలితం గానే ఏ ఉద్యమం లేచినా బస్సులు తగలబెట్టడం, రైళ్ళు నిలిపేయడం సాగించుతున్నారు. అందువల్ల తోటి మానవునికి ఎంతక్లేశం కలిగిస్తున్నాడో ఊహించలేకపోతున్నారు. ఆవేశం ఎంత దారుణానికి దింపుతోందో గ్రహించి నందువల్లనే ప్రాచీన ఋషి ఇంద్రియ నిగ్రహం నేర్పని విద్య విద్య కాదన్నాడు.

⌘ **అధిక మాసాలు తెలుగు సంవత్సరాలకేనా?**

మనది చాంద్రమాసం. ఇందులో నెలనెలా తిథులు హెచ్చు తగ్గ లుంటాయి. దాన్ని సవరించడానికి అధికమాసాలూ, క్షయమాసాలూ. ఇంగ్లీషు వారికి కూడా నాలుగేళ్ళకోసారి ఫిబ్రవరికి మరోరోజు ఎక్కువగా వస్తుంది.

⌘ **అన్ని మతాల వారికి ఒక్కడే దేవుడు. మనకు మాత్రం ముక్కోటి?**

మనది అనేకత్వంలో ఏకత్వం సాధించే దృష్టి.

⌘ **మనలో పాపభీతి కలిగించడానికే రామాయణ భారతాలూ పుట్టాయా?**

పాపభీతితో రావణ, దుర్యోధన సంతానానికి జరపవలసిన ప్రాయశ్చిత్తం నేర్పడానికి.

⌘ **అక్క....అత్త అనే స్త్రీ వాచక శబ్దాలకు అయ్య జేరుస్తారేం?**

అయ్య అనేది ఆర్య శబ్దం నుంచి వచ్చింది. అది గౌరవసూచకం. పెద్దవారికి జరిపే మర్యాద అది.

⌘ **ముడుపులు చెల్లిస్తే పాపాలు పోతాయా?**

పాపాన్ని పంచిపెట్టడానికే ముడుపులు.

⌘ **డాక్టర్లు కూడా మా ప్రయత్నం మేం చేశాం, ఆపైన దేవుని దయ అంటారేం?**

డాక్టరు రోగానికి చికిత్స చేస్తాడు. ప్రాణం పొయ్యలేడు. అందుకే పురుష ప్రయత్నానికి ఈశ్వరుడు తోడు కావాలి.

⌘ **జీవితం బుద్బుదం అంటూ అనంతరం అంటారేం?**

జీవితం బుద్బుదం, జీవాత్మకు ఆద్యంతాలు లేవు.

⌘ **ధర్మంగా యుద్ధం చేస్తే పాండవులేమవుతారు?**

యుద్ధ ధర్మం నిర్వహించి గెలిచారు పాండవులు అని భారతం చెపుతున్నది.

⌘ **మీరు రాజకీయాల్లో దిగితే కుళ్ళు కడగవచ్చుగా?**

కడగడానికి ముందు అది మనకు కూడా అంటుకుంటే.

⌘ **వింటే భారతమే వినాలా, రామాయణం?**

భారతంలో ధర్మ సూక్ష్మాలు తెలియాలంటే పెద్దల వద్ద వింటూ సందేహాలు అడిగి తెలుసుకోవాలి. రామాయణానికి ఈ ఇబ్బంది లేదు.

⌘ **ఆడది ఆదిశక్తి అయితే మగాడు?**

ఆ శక్తికి ఆరాధకుడు.

⌘ **ఋశ్యశృంగుడు ముని కదా, రాకుమారిని ఎలా పెళ్ళాడాడు?**

విశ్వామిత్రుని మేనత్తను జమదగ్ని తండ్రి ఋచీకునికిచ్చి పెళ్ళి చేశారు. అగస్త్య మహర్షి భార్య లోపాముద్ర రాజుగారి గారాల కూతురు. కులాలు నశించాలనే తియ్యని నినాదంతో ద్వేషాలు రెచ్చగొట్టే వంశనాశనాలు చేసేయుగంలో వున్నంత దౌర్భాగ్యస్థితి ఆనాడు లేదు.

⌘ **ఈ ప్రపంచాన్ని నడిపేది విజ్ఞాన శాస్త్రమే కాని దైవం కాదంటారేం?**

ఆ విజ్ఞానం కొందరికే లభించడానికి కారణం దైవం కాదంటారా!

⌘ **భగవద్గీత బోధించడానికి ఎన్ని రోజులు పట్టింది?**

శ్రీకృష్ణుని వంటి గురువు అర్జునుని వంటి శిష్యునికి పద్దెనిమిది క్షణాల్లో బోధించాడు. మనవంటి వారికి 18 జన్మలయినా గీత ఒంటబట్టదని అనుభవజ్ఞులంటారు.

**⌘ పొద్దున్నే లేవగానే అరచేతులు చూసుకొని దణ్ణం పెట్టుకుంటారు ఎందుకు? కారణమేమిటి?**

అరచేతులలో లక్ష్మీదేవి వుంటుంది. కనక ఉదయం లేస్తూనే వాటిని చూడడం శుభప్రదం.

**⌘ ఈనాటి స్త్రీ పొరపాటున కాలుజారితే నీచంగా చూస్తున్నారు. కాని భారతంలోని స్త్రీలను ఎంతో గౌరవంగా చూసినట్లు వింటున్నాం?**

భారతకాలంలో నాటి మానవుడికి ఏది ఎందుకు జరిగిందో, అలా జరిగినంతలో యావజ్జీవం అందుకు శిక్షించాలో, అవసరం లేదో తెలుసు కోగలిగిన విశాలహృదయం వున్నది. కారణాలతో నిమిత్తం లేకుండా కార్యాన్ని చూసి ఆగ్రహావేశాలకు లొంగే దౌర్భాగ్య దశ ఈనాడు తాండవిస్తున్నది.

**⌘ 'లోకో భిన్నరుచిః' అన్నారు కదా. మరి రామాయణ, భారతాలు అందరినీ అలరించాయే?**

అని మీరనుకుంటున్నారు. అలరించే కొందరు దండాలు పెడితే ఆగ్రహించి కొందరు తగలబెడుతున్నారు. మరో రహస్యం దేశంలో ఎప్పుడూ ధర్మరాజులూ - దుర్యోధనులూ వుంటారు. అది గ్రహించి వారిమధ్య పబ్బం గడుపుకునే శకునులు ఉంటారు. ఈ భిన్న రుచులవారు తమ రుచికి నచ్చిన పాత్రకు తాము భజన చేస్తారు.

**⌘ కన్యాశుల్కం మళ్ళీ ప్రవేశిస్తే..?**

వరకట్న దురాచారం ఇలానే సాగితే కన్యాశుల్కం దిగుతుంది. అప్పుడు కడుపులో బిడ్డ మగవాడని తెలిస్తే గర్భస్రావం చేయించుకుంటారు డబ్బే ప్రాణం అనుకునేవారు.

**⌘ శకుని కౌరవ పక్షపాతియని ముందే దూరదర్శన్‌లో చూపించారు. కానీ కారాగారం నుంచి వచ్చాకా...?**

శకునిని కారాగారంలో పెట్టవలసిన అవస్థ ఏమిటో! వ్యాసభారతం ఈ మాట చెప్పలేదు.

**⌘ అన్నీ కుదిరినా జాతకాలు కుదరలేదని పెళ్ళిళ్ళు ఆపుతారేం?**

గ్రహాలకూ ప్రాణికోటికీ సంబంధం వున్నదని అంగీకరిస్తే వివాహాలకు జాతకాలు కుదరవలసిందే. అయితే ఆ ఉభయులకూ వివాహమయ్యే యోగ్యత లేకపోతే జాతకాలు చూడకపోయినా పెళ్ళికాదు. ఈ రహస్యం తెలియక జాతకాలు పట్టుకు వ్రేలాడేవారిని ఏమనాలి?

**⌘ యుద్ధభూమిలో అభిమన్యునికి కత్తిదానం చెయ్యని కర్ణుడు దాతయా?**

రణరంగంలో శత్రువు దగ్గర చెయ్యిజాపే నీచుడు కాదు అభిమన్యుడు. కాక మీరు భారతం చదవకుండా బొమ్మలు చూసి వుంటారు. ఈ ఘట్టానికి భారతంతో సంబంధం లేదు.

**⌘ మీరు రాసిన భారతంలో కృష్ణలీలలు లేవే?**

మీరు టీ.వీలో చూస్తున్నది భారతం కాదు. భాగవతం. మళ్ళీ భాగవతంతో కుస్తీదేనికని భారతంలో దాన్ని ఇరికించేశాడు. నేనేకాదు వ్యాసభారతం ఎవరు రాసినా కృష్ణ లీలలుండవు.

**⌘ రాక్షస సంహారానికి అవతారాలెత్తే నారాయణుడు ఈ యుగ రాక్షసుల కోసం అవతారం ఎత్తడా?**

ఈ యుగంలో రాక్షసులు వారిలో వారే కొట్టుకు చస్తారు. సుందోపసుందులవలె నారాయణుడికీ ఆ అవకాశం ఇవ్వరు. ఇంకా మిగిలితే ఆలోచిద్దాం.

**⌘ భారత కృష్ణుడు భాగవత కృష్ణుడు కాడా?**

భారత కృష్ణుని బాల్యం భాగవతంలో జరిగిందని పెద్దలంటారు. కాని నిన్న మొన్న కన్ను తెరుస్తూనే వంకలు పెట్టే సంకుచిత బుద్ధులకు వేరుగా కనిపిస్తున్నాడు. ఇంతకూ వారు ఒకరా, ఇద్దరా అనే కుస్తీ కంటే భారత, భాగవత పఠనంతో శ్రవణంతో మనశ్శాంతి, బుద్ధివికాసం సాధించే ప్రయత్నం సాగించండి.

**⌘ కులమతాలు నశించే రోజు రాదా?**

నశించాలనడం వల్లనే ఎవరి కులానికి వారు కంచుకోటలు కడుతున్నారు. కులాలు కాదు నశించవలసింది. కులద్వేషాలు, మతోన్మాదాలు ఇవి చావాలి.

**⌘ బలరాముడు నంద యశోదల బిడ్డయా?**

వసుదేవుని భార్య రోహిణి వున్నది ఆవిడ కొడుకు.

⌘ **మహామహా శాస్త్రజ్ఞులు కూడా దేవుని పూజ చేస్తున్నారే?**

వారే చెయ్యాలి, వారు సాధించిన కృషి మానవాళి క్షేమానికి ఉపయోగపడుతుందనుకున్నారు. అది క్షణాలలో మానవజాతిని నాశనం చెయ్యబోతున్నదని తెలిశాక ఏం చేస్తారు.

⌘ **రామాయణ, భారతాలే నేటి సినిమాలకీ ఆధారమా?**

సినిమాలకే కాదండీ సర్వ సాహిత్యానికి అవే ఆధారం. అబలలపై అత్యాచారాలు, ముష్టియుద్ధాలు, అపరాధ పరిశోధనలు - అన్నిటికీ రావణ, కీచక, సైంధవులు, భీమ-హిడింబాసుర యుద్ధాలు, నలోపాఖ్యానం - జాగ్రత్తగా చదివితే మానవజాతి ఉన్నంతకాలం వారిలోని పశుప్రవృత్తి, ధర్మ దృష్టి, దైవ సంకల్పం అన్నీ ఈ రెండు కథలలో దొరుకుతాయి. మూలగ్రంథాలు చూస్తే...

⌘ **హుండీలో నోట్లకట్టలు వేస్తే పాపాలు పోతాయా?**

ఆ నోట్లకట్టలు కొందరు దీనులకు తిండి, బట్ట పెడుతున్నాయి. అందువల్ల పుణ్యం వస్తుంది. అందులో కూడా అవినీతికి దిగేవారు ఈ పాపం కొంత కూడబెట్టుకుంటారు.

⌘ **కల్పం మారగానే మళ్ళీ అన్నీ యిలానే జరుగుతాయా?**

అని పురాణాలు చెపుతున్నాయి. ఆ ఆరాటం విడిచి ఈ జన్మను సార్థకం చేసుకునే ప్రయత్నం చెయ్యి అని గీత చెపుతున్నది.

⌘ **ఉత్తమమైన మానవజన్మ లభించినా పాపాలు చేస్తాడేం?**

మానవుడే ఏదయినా చెయ్యగలడు. సృష్టిలో ఏ ప్రాణీ అత్యాచారం చెయ్యదు. అత్యాశకు పోదు, అవిశ్వాసంతో ఉండదు. అబద్ధాలూ, దొంగతనాలు చెయ్యదు. మనిషి ఒక్కడే ఇన్ని దురాచారాలూ, దుర్మార్గాలు చెయ్యగలడు. కనకనే వానిని సన్మార్గాన నడపడానికి సత్యం-ధర్మం అవసరమని వేదం బోధించింది.

⌘ **ఉపనయనం కాని వారు దేవుని స్తోత్రాలు చదువుతూ పూజ చేయరాదా?**

దేవుని పూజకూ, ఉపనయనానికీ సంబంధం లేదు. ఉపనయనంతో బ్రహ్మోపదేశం పొంది బ్రహ్మచర్య వ్రతం పూనాలి. ఈ అశ్లీల, అసభ్య వాతావరణంలో బ్రహ్మచర్యం అసాధ్యం.

**⌘ మంత్రాలూ, శ్లోకాలు లేకుండా దేవుని పూజించడం కుదరదా?**

మంత్రాలూ, శ్లోకాలూ అనవసరం. మనస్సు నిలబెట్టి మీ ఇష్టదైవాన్ని స్మరించుకోగలిగితే.

**⌘ రామాయణ, భారతాల మీదనే విమర్శిస్తారేలనో?**

పేరెల్లా వస్తుందిరా పెద్దిభొట్లూ అంటే గొప్పవాళ్ళని తిట్టరా కొండుభొట్లూ అని మీరు వినలేదా! రామాయణ, భారతాలకున్న ఖ్యాతి మరే గ్రంధానికీ లేదు. అటువంటి వాటిమీద దుమ్ము జల్లితే ఈ అవివేకి ఎవడురా! అని నలుగురూ తనవైపు చూస్తారని వారి తాపత్రయం!

**⌘ ద్రౌపదికి కర్ణునిపై మనసున్నదా?**

భారత, రామాయణాల ప్రయోజనం తెలియనివారు, ఆ కాలాన్ని, సమాజాన్ని ఈనాటి నల్లకళ్ళజోడుతో చూసే దురదృష్టం పట్టడం వల్ల ఈ దుష్ప్రచారాలు జరుగుతున్నాయి. అందుకే వ్యాస, వాల్మీకుల హృదయం తెలిసినవారు చెప్పే గాథలు వినాలి, చదవాలి.

**⌘ గురువు బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపుడు కదా. ఈనాడు గురువును గౌరవించే వారెవరు?**

ఈనాడున్నది గురువేనా! నేర్పే విద్యకు జీతం చాలక రాత్రింబవళ్ళు ట్యూషన్లు చెప్పి డబ్బు పోగుచేసుకోవడమే పరమావధిగా గలవాడు టీచరు కావచ్చుకాని గురువు కాదు. అన్ని రంగాలలోనూ వ్యాపారం సాగుతున్నది అంతే.

**⌘ మంత్రిపదవులు ప్రజాసేవకా? స్వార్థానికా?**

ప్రజాసేవ చేసి ఆంధ్రకేసరి వంటి వారు క్లేశాలు పడడం విన్న నేటి మంత్రులు ఆ తలంపు విడిచి స్వోదర పూరణం చేసుకుంటున్నారు.

⌘ **ఆలయంలో నెత్తి మీద శఠగోపం దేనికి?**

ఏదో ఒకనాడు ఆ అతీతశక్తి పాదాల ముందు తల వంచాలని గుర్తు చెయ్యడానికి.

⌘ **దేవుళ్లందరూ ఒకటే అని దేవీ ఉపాసన చేశాడే పరమహంస?**

దేవిలోనే నిఖిలదేవతలనూ సందర్శించాడు పరమహంస. అంతటా దయ్యాలను చూసేవారికేం చెప్పగలం?

⌘ **ఆంజనేయులు ఆడవారికి పూనుతాడా?**

పూనుతున్నది వారి బుర్రల్లోని కోతి, చుట్టూ చేరిన వారి కోతి బుద్ధులు.

⌘ **దేశానికి వెన్నెముక వంటి రైతు మీద పన్నులభారం వేసి ఆ ఎముక విరుగకొడుతున్నారే?**

రోజుకొక బంగారు గుడ్డుపెట్టే బాతును చంపితే అన్ని గుడ్లూ ఒక్కమారే దొరుకుతాయనుకున్న మేధావులు పాలకులయ్యారు.

⌘ **దేవుని సన్నిధిలో వుంటే మోక్షం వస్తుందా?**

దైవసాన్నిధ్యమే మోక్షం. ఈ దైవం మీ గ్రామంలోని ఆలయంలో వేప చెట్టు క్రింద రాతిలో వున్నది కాదు.

మీ మనసు లోపల రాగద్వేషాల పొరలకు సంబంధం లేకుండా వెలుగుతున్న జ్యోతి. అక్కడ నిలపండి మనసుని.

⌘ **కృష్ణుడికి దేవకీదేవి అంటే ఇష్టమా? యశోద అంటే ఇష్టమా?**

ఆయన జగన్నాటక సూత్రధారి. ఆయనకు ఎవరి మీదా ఇష్టం లేదు. ఆయన మీదనే ఆయనకు ప్రీతి. ఆయనలోనే యశోద, దేవకీ, గోపికలు, మీరు, నేను అంతే వున్నాం అని తెలిసినవాడు. అది తెలియకపోతే మనలానే తాపత్రయపడేవాడు.

⌘ **మీకు కులాభిమానం వుందా?**

అంత అభిమాన హీనుడను కాను. కాని కులద్వేషులంటే అసహ్యం. ఎందుకంటే ద్వేషంతో దేనినీ సాధించలేమని పెద్దల వల్ల విన్నాను. అనుభవంలో

గ్రహించాను. అదే అందరికీ అందించాలని ఆరాటం.

※ **అమ్మవారిని పరదేవత అంటారేం? ఆమెను పురుషులే పూజిస్తారేం?**

అంతకంటే పరమైన దేవత లేదు కనక దేవతలందరికీ పరమందుండేది అనగా పైన వుండేది పరదేవత. ఇంట్లో వుండే దేవత బారి నుండి రక్షించమని పురుషులు పూజిస్తారు కాబోలు.

※ **సంగీతం రోగాలను నివారిస్తుందా?**

నివారించిందని విదేశాలవారు వక్కాణిస్తున్నారు. అయితే ఈనాడు వినిపించే శునక, జంబూక, వ్యాఘ్ర గర్జనల సంగీతం వింటే నరాలు నలిగి రోగాలు పెరుగుతాయని కూడా అమెరికా పరిశోధకులు చెపుతున్నారు.

※ **వయసులో ఉన్న కుర్రవాళ్ళు చలికాలంలో చాప మీద పడుకుని చల్లని నీరు స్నానం చేసి, చప్పిడి తిండి తింటూ నల్లగుడ్డలు కట్టి 40 రోజులు దీక్షతో, అడవుల వెంట నడిచి అయ్యప్ప దర్శనం చేసే బదులు దగ్గరలో వున్న దైవాన్ని పూజించరాదా?**

చక్కని మాట సెలవిచ్చారు. కాని చలికాలంలో చన్నీటి స్నానం, చాప మీద పడుకోవడం, చప్పిడి తిండి శరీరాన్ని ఎంత ఆరోగ్యంగా ఉంచుతాయో ఊహించలేదు మీరు. శరీరం ఆరోగ్యంగా వుంటేనే మనస్సు ఆరోగ్యంగా వుంటుంది. అప్పుడు దురాచారాలు, దుస్సంకల్పాలు రావు. సక్రమంగా సత్కార్యాల వైపు నడుస్తుంది. అంతే! పూజా సమయంలో ఏకాగ్రత ప్రధానం, ఆ ఏకాగ్రత లేనిదే ఏది చేసినా వ్యర్థమే. మనస్సును ఏకాగ్రం చేసే స్థితిని పొందడానికి ఏ మహానుభావుడో ఈ దీక్ష పెట్టాడు. అయితే దీక్షాకాలంలో ఎంతమంది ఏకాగ్రత కోసం కృషి చేస్తున్నారో?

※ **రామాయణ, భారతాలు ఉత్తరాది కథలు కనక మనం చదవరాదా?**

ఇంగ్లీషు వాడి ధర్మమా అని దేశమంతా ఒకే త్రాటి క్రింద నడిచినా వాడు నాటిన విషబీజాలు ఎంతవరకూ వచ్చాయో - ఏ జిల్లావాడు ఆ జిల్లాలోనే బ్రతకాలి. ఈ జిల్లావాడు ఇంకో జిల్లా చేరితే చంపుతాం- అన్నంత హృదయ

వైశాల్యం ఉన్న కాలంలో ఉత్తరాది దేవుళ్ళు దక్షిణాది దెయ్యాలు అనే పిశాచ సూక్తాలకు దూరంగా వుండండి.

ఈ కామెర్ల వెంకటప్పయ్యల కళ్లకు సత్యం కనిపించే రోజు రావాలని రామకృష్ణ నామం జపించాలి.

⌘ **జీవితం అశాశ్వతం అని తెలిసినా భోగభాగ్యాల కోసం తాపత్రయం దేనికి?**

జీవితం గాలిబుడగ అని బోధించేవారే ఆ తాపత్రయం వదలలేకపోతున్నారు. వారిని చూసిన నాయకులు "అంతా ప్రజా సేవకే" అంటూ తమ నిధులు విదేశాలలో దాచుకుంటున్నారు.

⌘ **దేశదేశాల వారు మన దేవతలను పూజించి, రామాయణ, భారత గ్రంథాలను గౌరవిస్తుంటే మనదేశం వారు...?**

పెరటి చెట్టు వైద్యానికి పనికిరాదు.

⌘ **గాయత్రీ మంత్రం స్త్రీలకు చెప్పరాదా?**

ఏ మంత్రమైనా ఎవరికయినా చెప్పవచ్చు - దానిని ఉపాసించేవారు నిర్మల హృదయంతో, పవిత్రమైన మనస్సుతో ఉండగలిగి మంత్రాన్ని స్వరంతో పలకగలిగితే ఇందులో ఏది లోపించినా పురుషుడైనా, బ్రాహ్మణుడైనా వారికి మంత్రం అనవసరం. తంత్రాలతో ఆస్తి కూడబెట్టుకోవడం మంచిది.

⌘ **తన కష్టాలు ఎదుటివారి ముందు వెల్లగ్రక్కకుండా అందరినీ నవ్విస్తూ బ్రతికేవారు...?**

వారినే మహనీయులనీ, యోగులనీ అంటారు.

⌘ **కళ్ల ఎదురుగా దారుణాలు జరుగుతున్నా మనకెందుకులే అనే ఉదాసీనత ఎందుకొచ్చింది?**

కూడు, గుడ్డ, గుడిసె వుంటే చాలు, మన జన్మ చరితార్థం అనే నినాదం ఒంట బట్టడం వల్ల.

⌘ **వేదాలు, ఉపనిషత్తులు వీటివల్ల లాభమేమిటి?**

ఏది తెలుసుకుంటే మరొకటి తెలుసుకోవలసినది ఉండదో అది వేదం. ఏది తెలిస్తే ప్రాపంచిక బంధాల నుంచి ముక్తి పొందగలమో అది ఉపనిషత్తు.

ఈ రెండూ కూడా వర్తమాన మానవుడు ఆశించేవీ కావు, సాధించగలిగినవీ కావు కనక ఏమీ లాభం లేదు.

**⌘ కారణజన్ముడంటే?**

లోక కల్యాణార్థం ఒక మహత్కార్య సాధనమే కారణంగా ప్రభవించేవారు.

**⌘ ప్రతిఫలాపేక్ష లేకుండా పనిచేసే రోజులు రావా?**

ఆ రోజులు రావడానికే పిల్లకాయలకు భగవద్గీత బోధించి ఒంట బట్టించాలి. 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' అని లీలామానుష విగ్రహుడు చేసిన ప్రబోధం, నిరంతరం చెవికెక్కించాలి.

**⌘ మిమిక్రీ పేరిట తమ వంటి వారిని అనుకరిస్తూ అశ్లీలాలు కూస్తారేం?**

ఆ కూతలు వారి గొంతుతో కూస్తే మీరు సహించరని.

**⌘ అన్ని మతాల వారికీ ఒకడే దేవుడు. మనకిందరెందుకు?**

అన్ని మతాలవారికి ఒకొక్కడే ప్రవక్త. ఆయనకు ఒక్కడే దేవుడు. మనకు మతమూ లేదు. ప్రవక్తా లేడు. వేదధర్మం మనకు ఆధారం, దాన్ని ప్రచారం చెయ్యడానికి ఎప్పటికప్పుడు ఆచార్యులు పుడుతుంటారు. వీరి ప్రబోధం వల్ల ప్రభావితులైన భక్తులు ఏ నామంతో, ఏ రూపంతో భగవంతుని ప్రార్థిస్తే ఆ నామంతో, రూపంతో దేవుడు దిగుతాడు.

**⌘ దశావతారాలలో బలరాముడు లేడా?**

రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిమేవచ అని ఒక పాఠం. పరశురాముడు, రాముడు, బలరాముడు, కృష్ణుడు, కల్కి అని దీని అర్థం.

**⌘ రామాయణం నాటి రాక్షసులు భారతంలో లేరా?**

రామాయణం నాడు అడవులలో దాక్కున్న రాక్షసులు భారతం నాడు రాజసభలో దుశ్శాసన, కీచకులయారు. ఈనాడు వాడవాడలా ఈ రాక్షస సంతానం నాట్యమాడుతూనే వుంది.

**⌘ రథసప్తమి నాడు జిల్లేడు ఆకులు పెట్టుకుని స్నానం చేస్తే..?**

ఋతువును బట్టి ప్రకృతిలోని జీవకోటిలో ఎన్నో మార్పులు వస్తాయి. ముఖ్యంగా చెట్లు, లతలు ఈ పరిణామాన్ని బాగా చూపిస్తాయి. అందుకే

కార్తీకంలో ఉసిరిచెట్టు కింద వండుకు తినడం, రథసప్తమికి జిల్లేడు ఆకులు, చిక్కుడుకాయలు, పువ్వులు, రేగుపండ్లు వీటివల్ల శరీరం ఆరోగ్యకరంగా వుంటుంది. తులసి ఆకు, తులసి మీద నుంచి వచ్చే గాలి ఏ కాలంలో అయినా మంచిదే. అలాగే రుద్రాక్షలు గుండెకు తగులుతూంటే, వాటి మీద నుంచి స్నానం చేసిన నీరు జారినా ఆరోగ్యమే. ఈ విధమైన ఆయుర్వేదం వృద్ధిలో వున్న రోజులలో యిన్ని రోగాలుండేవి కావు.

**⌘ ప్రహ్లాదునికి గర్భంలోనే హరిభక్తి అలవడిందా?**

హిరణ్యకశిపుడు తపస్సుకి వెళ్లినపుడు ఆయన భార్య గర్భవతిగా వుండగా నారదమహర్షి భక్తి సూత్రాలు బోధించాడనీ, ఆ సమయంలో గర్భంలో వున్న ప్రహ్లాదుడు ఆ భక్తిని అందుకున్నాడనీ భాగవతం చెప్పింది.

ఈనాటి శాస్త్రవేత్తలు కూడా గర్భవతి అయిన స్త్రీ ఆహార విహారాలు మనస్సు శిశువు మీద పనిచేస్తాయంటున్నారు.

**⌘ శివరాత్రి జాగారం పరమశివుని స్మరణకా? సినిమాలు చూడడానికా?**

ఆదిలో ఆ జాగారం పరమేశ్వర ధ్యానానికే. తరువాత అసభ్య, అశ్లీల చిత్రాలు ఒకే టికెట్టుపై రెండు చూడడానికి. ఇప్పుడు తెలుగు దూరదర్శన్ వారి ధర్మమా అని శివస్మరణ అవసరం లేకుండా వారి అధ్వాన ప్రదర్శనలు చూస్తే పుణ్యం వస్తుందని చెప్పుకుంటున్నారు.

**⌘ ప్రజాసేవ చేస్తామనే పాలకులే కులాల సభలు పెడుతున్నారే?**

వాళ్ళ పదవికి పునాది అది. అది కూలద్రోసుకుంటారా?

**⌘ దేవుడు అమాయకులనే శిక్షిస్తాడేం?**

అమాయకులు బాధలు పడుతున్నప్పుడే పూర్వజన్మ కర్మ వున్నదని నమ్మవలసి వస్తున్నది.

**⌘ పౌరాణిక చిత్రాలు ఈనాడు తీయరేం?**

పురాణం పేరు తెలిసినవారు పరిశ్రమలో లేరు. పైగా టీవీ నిండా పురాణం యిస్తున్నారుగా.

⌘ **గీత చదివితే పాపం నశిస్తుందా?**

గీత బోధిస్తూ అది కూడా వ్యాపారం చేసుకునే స్వాముల యుగంలో వున్నాం మనం. ఇక మన పాపాలు పోయే గీత ఎక్కడిది మనకు.

⌘ **పాదాభివందనాలు సమర్థనీయాలా?**

ఏ పాదాల విషయం మీరడుగుతున్నారు. సర్వం త్యాగం చేసే వారి పాదరజం కూడా శిరసున ధరించాలి.

⌘ **అన్ని మతాల సారం ఒకటే అయినా మహామహులే మతాలు వేరు వేరు ఎందుకు చేశారు?**

రకరకాల రుచులు, ఊహలు వున్న మనిషికి ఎప్పటికప్పుడు కొత్తకొత్త రుచులు అవసరం. ఆ రుచిభేదం వల్లనే దేవుడు కూడా కొత్తవాడు కావాలి. అందుకే ఇన్ని కల్లోలాలు.

⌘ **ఆత్మ అనగానేమి?**

శబ్దాలతో చెప్పలేనిది, మనసుకు అందనిది అని ఉపనిషత్కారులు ఘోషించారు. ఆత్మను తెలుసుకుందామని కళ్లు మూసుకుని, ముక్కు మూసుకుని హిమాలయాల మీద చేరి ఎందరో మునులయ్యారు. వారు మాట్లాడలేదు. మాట్లాడి వుంటే మనకు తెలిసేది అంటే ఆత్మజ్ఞానం ఎవరికి వారు కలిగించుకోవాలే గాని పరులు చెప్పిన సిద్ధించదు.

⌘ **విభీషణ, ప్రహ్లాదులు రాక్షసుల్లో పుట్టారు ఆనాడు, ఈనాడు రాజకీయ రాక్షసులలో ఆ అవకాశం వున్నదా?**

ఆనాడు రాక్షస రావణ హిరణ్యకశిపులకు సోదర ప్రేమ, పుత్ర ప్రేమ ఉన్నాయి. ఈనాడు పదవీ ప్రేమ, ధన వాత్సల్యం ఉన్న రాక్షసులు..!

⌘ **ఎవరికీ హాని చెయ్యకుండా వున్నవారు దేవుని ఆరాధించకపోయినా మోక్షం రాదా?**

అంతకంటే ఉత్తమమైన మోక్షమార్గం లేదు.

⌘ **పాండవులు, కర్ణుడు, శకుంతల వీరంతా అక్రమసంతానం అయినా చరిత్ర**

**సృష్టించారు. ఈనాడు అక్రమానికి గురి అయినవారు..?**

మానవునికి ధీశక్తులున్న కాలంలో ఏది ఎందుకు జరిగిందో, జరుగుతుందో తెలిసిన యుగంలో ఉదారగుణం వుండేది. ఈనాడు దుర్బలురు, నీరసులు పెరుగుతున్నారు. అందుకే సమాజ పరిణామం, మానవజాతి ఔన్నత్యం ప్రదర్శించే మహాభారతం వంటి ఇతిహాసాలు పుట్టడం లేదు. మఖలో మాడడానికి పుబ్బలో పుట్టే మనుషులు, పుస్తకాలు పెరుగుతున్నాయి.

⌘ **మతం హింసను ప్రోత్సహిస్తుందా?**

మతాన్ని అడ్డుపెట్టుకుని మహారాజభోగాలు కోరే ఉన్మాదులు హింసను రెచ్చగొట్టి బ్రతుకుతున్నారు. వారిని ఏరిపారేసే యువకులు కావాలి.

⌘ **కావలసినన్ని దుర్మార్గాలు చేసి ఒక్కసారి నారాయణా అంటే అన్నీ నశిస్తాయా?**

నారాయణా అంటూ మనస్సును నారాయణుని యందు లగ్నం చేస్తే నశిస్తాయి.

⌘ **ప్రపంచంలో దుఃఖాన్ని పోగొట్టుకోగలవాడెవడు?**

మనసు వెంటపడకుండా మనసును వెంట త్రిప్పుకోగలవాడు.

⌘ **మరణం తప్పదని, వెంట ఏమీ రాదని కూడా తెలిసినా ఎందుకీ తాపత్రయం?**

మాట్లాడినంత సులభం కాదు ఆ తత్వం ఒంటబట్టడం నిత్యం. ఈ సత్యం బోధించే స్వామీజీలు ఎంతెంత మూట కడుతున్నారో చూశారా! వీరి కోసమే పంచతంత్రంలో ఆషాఢభూతులు పుట్టారు.

⌘ **జన్మరాహిత్యానికి సగుణమా? నిర్గుణారాధనయా?**

చాలా దూరం వెళ్లారే! రెండూ జన్మ రాహిత్య పథాలే

⌘ **దయాధర్మాలున్న నాస్తికుడు దేవుని పూజించాలా?**

ఆ రెండూ వున్నవాడే దేవుడు.

⌘ **విశ్వామిత్రుని కన్నా వసిష్ఠుడు గొప్పవాడైతే సృష్టికి ప్రతిసృష్టి చేయలేదేం?**

విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావడానికి ముందు చేసిన మహేంద్రజాలాలు ఆ తరువాయి చెయ్యలేదు. ఇటువంటి రాజసకృత్యాలలో లోకం ముందు తన ఘనత చూపాలనే అహంకారం చావని వాడు విశ్వామిత్రుడు ఈ ఘన

కార్యాలన్నీ లోకవంచనకే అని గ్రహించిన బ్రహ్మర్షి వసిష్ఠుడు.

⌘ **శీలం ఆడదానికే కాని పురుషునికి...?**

శీలహీనుడికంటె నీచుడు లేడు. కాని ఈనాడు నీచ కీచకులే అందలా లెక్కుతున్నారు. ఈ భోగం భీమసేనుడు నిద్ర లేచేవరకే.

⌘ **న్యాయధర్మాలకు జీవితం అంకితం చేసిన శ్రీరాముడు వాగ్దానాలతో రకరకాల వేషాలు వేశాడా?**

కంబళీలో తింటూ వెంట్రుకలేరుకునే దరిద్రకాలంలో పుట్టాం, కనక రామాయణ రామభద్రుని చరిత్ర చదువుకుంటూ కలియుగ రాములకు దూరంగా నడవండి.

⌘ **అన్నం బ్రహ్మ స్వరూపం కదా, కోపం వచ్చినవారు భోజనం మానుతారేం?**

మీరు అదృష్టవంతులు. కోపం వచ్చినప్పుడు మా మిత్రుడు పసివాళ్లకు మెతుకు మిగలకుండా గిన్నెలు ఖాళీ చేస్తాడు. కోపం అనారోగ్య కారణం. దానికి చికిత్స ఉపవాసం.

⌘ **ద్వాపర యుగాంతంలో పుట్టిన వ్యాసుడు ద్వాపరంలో జరిగిన భారతం రాశాడని నమ్మమంటారా?**

భారతం చదివితే ఈ శంక రాదు. భారత పాత్రలన్నిటి ముందు పుట్టినవాడు వ్యాసుడు. ఆ తరువాయి భీష్ముడు, ఇప్పుడైనా చదవండి.

⌘ **బాధలలోనే భగవంతుడు గుర్తుకు వస్తాడా?**

బాధలు ఆయన కలిగిస్తాడనీ సిరిసంపదలు మనం సంపాదించుకోగలమనీ అనుకునే అవివేకం వల్ల ఈ భావం కలుగుతున్నది.

⌘ **బ్రాహ్మణత్వం కులం చేతనా, గుణం చేతనా?**

గుణకర్మలను బట్టి వర్ణం ఏర్పడుతుందని గీతాచార్యుడు ఘోషించాడు. కాని ఈ దుష్టయుగంలో గుణకర్మల కంటే జన్మ చేతనే అని మూర్ఖత్వం పెరిగింది.

⌘ **ఏ అధికారమూ లేని దుర్యోధనుడు కర్ణునికి అంగరాజ్యం పట్టం కడితే పెద్దలందరూ నోరుమూసుకున్నారా?**

నేటి బడానాయకుల కుమారులు, బంధువులు చేసే అత్యాచారాలను చూస్తూ ఏం చేస్తున్నారు పెద్దలు. అందుకే భారతం ఈనాడు జరుగుతున్న దంటున్నారు మా గురువులు.

⌘ **పశ్చాత్తాపం మానవుని ప్రక్షాళన చేయునా?**

అందుకు సందేహమా! సర్వ పాపాలకూ పశ్చాత్తాపమే ప్రక్షాళణాగ్ని.

⌘ **తల్లి కంటే గొప్పదేది?**

ఈనాటి వరకూ దొరకలేదు.

⌘ **ప్రతి పశువు మానవునికి ఏదో ఉపకారం చేస్తూనే ఉంది. మనిషి మాత్రం గోతులు తవ్వుతూ గొంతు కోస్తున్నా మానవజన్మ ఉత్తమం అంటారేం?**

పశువు కంటే ఉత్తమ పథంలో నడిచి నరజన్మ యెత్తి కూడా పిశాచ బుద్ధితో వుండే ప్రాణి పశువు కంటే హీనం!

⌘ **రామాయణ భారతాలు విదేశాలవారు చదువుతారా?**

రష్యావారు భారతాన్ని, చైనావారు భగవద్గీత చదివిస్తున్నారు. లండన్, ఫ్రాన్స్, అమెరికాలలో రామాయణం నృత్య రూపకంగా ప్రదర్శిస్తున్నారు.

పరమ రహస్యం ఏమంటే ప్రపంచ సాహిత్యం అంతా రామాయణ భారతాలే అంటే కొందరికి కోపం రావచ్చు. కాని పదిమంది చదివే కథ చూడండి. అది రామాయణ- భారతాల మీద ఆధారపడినదే.

పరస్త్రీ కోసం ఆశపడడం రామాయణం కథ!

పరధనానికి ఏ కథకయినా ఈ సమస్యలే మూలాధారం. మానవజాతి ఉన్నంతకాలం కాంతాకనకాల కోసం కాట్ల కుక్కల వలె కొట్టుకోక తప్పదని గ్రహించి వాల్మీకి, వ్యాసులు మానవజాతికంతటికీ అనుగ్రహించిన వరాలు రామాయణ- భారతాలు.

మన జీవితం చాలదు ఆ రెండు గ్రంధాల సారం గ్రహించడానికి. అయినా చదవాలి, చదువుతున్నాం, చదువుతాం.

⌘ **పుట్టినవాడు గిట్టక తప్పదంటూనే శ్రీశైల శిఖరం చూస్తే పునర్జన్మ లేదంటారే?**

పుట్టిన ప్రాణి గిట్టక తప్పదు ఇది సామాన్యాంశం. దీనికి అపవాదు

లేకపోలేదు. అందులో శ్రీశైల శిఖరం ఒకటి. ఇంకా యింకా వున్నాయి.

⌘ **త్రికరణశుద్ధి మనసుకా, శరీరానికా?**

మనస్సు, వాక్కు, కాయం ఈ మూడూ త్రికరణాలు.

⌘ **జయవిజయులు ద్వాపరంలో ఎవరు?**

శిశుపాలుడు- దంతవక్త్రుడు అని భాగవతం చదివితే తెలుస్తుంది.

⌘ **రామాయణ భారతాలు ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు మార్చుతగునా?**

ఇష్టం వచ్చినట్లు, కష్టం కలిగేటట్లు.... ఎటైనా భారత రామాయణాలనే స్మరిస్తున్నారు కాని మరే పుస్తకాన్నీ మళ్ళీ చదివేవారు లేరు. అందుకే అవి ఉత్తమ గ్రంధాలు.

⌘ **ఈ కాలంలో తపస్సు సాధ్యమా?**

హిమాలయాల మీద బదరీ దాటి వెడితే మంచుగుహలలో దిగంబరులు కనిపిస్తారు. వారిని అడగండి.

⌘ **శ్రీరాముడు సీతాదేవిని రాత్రివేళ రహస్యంగా అడవికి పంపెనా?**

ఈ రహస్యం రామానంద రామాయణంలో ప్రదర్శించారా? రాముడు ఏ పనీ అర్ధరాత్రి పూట హఠాత్తుగా చేసినవాడు కాడని వాల్మీకి రామాయణం ఘోషిస్తోంది. టీవీలో వచ్చే రామాయణ, భారతాలు చూస్తూ వ్యాస వాల్మీకులు రచించిన భారత రామాయణాలు వచన గ్రంథాలు కంఠపాఠం చేసి మనసు నిర్మలం చేసుకోండి.

⌘ **ధర్మేచ, అర్థేచ, కామేచ అనే ప్రమాణం అర్థం?**

ధర్మార్థకామాలు పురుషార్థాలు. ఈ మూడూ మనం ఉభయులం కలిసి సక్రమంగా నిర్వహిద్దాం. ఒకరికి తెలియకుండా ఒకరం ప్రవర్తించబోము అని పీటల మీద శపథం.

⌘ **విశ్వామిత్రుడు, దుర్యోధనుడు మీకు శత్రువులా?**

అసూయ, అహంకారం మూర్తీభవించిన వారెవరూ మనకు పడరు.

⌘ **పాండవులను లక్క యింటి నుండి శ్రీకృష్ణుడు రక్షించెనా?**

లేదు, విదురుని మంత్రాంగం వల్ల బయటపడ్డారు.

**⌘ ఏసు జననం సామవేదంలో వున్నదా?**

సామవేదంలో ఉండకపోతే నిజం కాదనుకునే అవివేకి ఎవడో ఈ ప్రచారం చేసి పొట్ట పోసుకుంటున్నాడు. కానివ్వండి. ఏసుకి కూడా వేద ప్రమాణం చెబుతున్నారంటే చాలదూ!

**⌘ అందరికీ రెండే మంగళసూత్రాలు, భద్రాచలంలో సీతాదేవికి మూడు సూత్రాలున్నాయే?**

సీతా కళ్యాణం నాటికి మంగళసూత్రాలు లేవు. ద్రౌపదీ స్వయంవరంలోనూ ఈ మూడు ముళ్ళు లేవు. జీలకర్ర, బెల్లం పెట్టి ప్రమాణం చేయడమే వివాహం!

**⌘ దుర్యోధనుడికి ఉన్న అభిమానం ఎవరికైనా వున్నదా?**

అభిమానం అందరికీ వుంది. దుర్యోధనుడికి వున్నది దురభిమానం. అందుకే సర్వనాశనం కాక తప్పలేదు ఆ దుష్టుడు.

**⌘ గుడి చుట్టూ మూడు, పదకొండు, నూట ఎనిమిది ఇలా రకరకాలుగా ప్రదక్షిణలు ఎందుకు చేస్తారు?**

ప్రదక్షిణల సంఖ్య వారి దేహదారుఢ్యాన్ని బట్టి వుంటుంది అని చెబుతానను కోకండి. ఏకాగ్రత, ఆరోగ్యం మొదలైన ప్రయోజనాలెన్నో ప్రదక్షిణల్లో వున్నాయి. ఏ దేవుడికి ఎన్ని ప్రదక్షిణలు చెయ్యాలో వివరంగా చెప్పే వుంది. మీ ఊళ్లోని శాస్త్రులుగారినడగండి.

**⌘ క్రీస్తు మహమ్మదు ఎప్పుడు పుట్టినదీ ఆధారాలున్నాయి, కాని రామకృష్ణులకు కాలం చెప్పలేదేం?**

తారీకులు దస్తావేజులు చరిత్రకు అవసరం అనుకునే ప్రముఖులుకాక భావితరాలకు ఆదర్శమైన సన్నివేశాలే అవసరం అని భావించిన కవుల చేతిలో సంవత్సరాలు తారీఖులు నలిగినా రామకృష్ణులు లోకారాధ్యులవుతున్నారు.

**⌘ పూర్వకాలపు రాక్షసులను బొమ్మలలో చూశాం, ఈ కాలంలో రాక్షసులు లేరా?**

ఇదివరకు రాక్షసులు లంకలో, అడవులలో వుండేవారు. ఇప్పుడు మహానగరాలలో చక్కని వేషాలతో తడిగుడ్డలతో గొంతులు కోస్తున్నారు. వారికి వేరు బొమ్మలెందుకు.

⌘ **తల్లి గర్భం నుండి శిశువు భూమిపై పడగానే ఎందుకు ఏడుస్తుంది?**

జనన మరణ చక్రంలో మరొక చుట్టు తిరక్క తప్పదని.

⌘ **మనుషుల మనసుల్లో దేవుడుంటాడుగా...! మరి దేవాలయాలకు ఎందుకు వెళ్ళాలి?**

మనుషుల మనస్సుల్లో దేవుణ్ణి చూడగలిగే జ్ఞానం స్థిరపడేవరకే దేవాలయాలకు వెళ్లాలి.

⌘ **క్రైస్తవ, ఇస్లాం మతాల అభివృద్ధికి కారణం వాటిల్లో కులాలూ, ఉపకులాలూ లేకపోవడమేనంటారా?**

వారిలో కులాలు లేకపోయినా మనకు మించిన శాఖలున్నాయి. క్రైస్తవ, ఇస్లాం సోదరులని అడిగి తెలుసుకోండి.

⌘ **దుర్మార్గుడైన దుర్యోధనుడు విలాసజీవితాన్ని అనుభవించాడు. ధర్మజ్ఞుడైన ధర్మరాజు కష్టాలను అనుభవించాడు. ఏమిటి చిత్రం?**

అధర్మం ముందు సుఖాన్ని, తరువాత దుఃఖాన్ని ఇస్తుంది. ధర్మం మొదట దుఃఖకరంగా ఉన్నా అనంతరం అనంతరమైన సుఖాన్నీ, కీర్తిని ఇస్తుంది.

⌘ **మానవుని కోరికల వెల్లువ ఎలా ఆగగలదు?**

నేలంతా తోలు పరచలేం. కాళ్లకు చెప్పులు వేసుకుంటే చాలు. సంతృప్తి అవసరం.

⌘ **ధాన్యమాలి ఎవరు?**

ధాన్యమాలి రావణుని ప్రియురాలు. అతికాయుని తల్లి. ఇంకా తెలియాలంటే సుందరకాండ చదవండి.

⌘ **బ్రహ్మకీ, పరబ్రహ్మకీ ఏమిటి భేదం?**

నాలుగు తలకాయలున్న వాడు బ్రహ్మ. అవాఙ్మానసం గోచరం పరబ్రహ్మం.

⌘ **పూర్వం బ్రాహ్మణులు మాంసం తినేవారట. ఇప్పుడు నిషిద్ధం. ఈ మార్పు ఎందుకు వచ్చింది?**

ఇప్పుడూ తినేవారున్నారు. మాంసాహారం నిషిద్ధమని వైద్యశాస్త్రజ్ఞులు పరిశోధించి ఘోషిస్తున్నారు.

✻ **శివాలయం ముందు నంది ఎందుకు వుంటుంది?**

మన ఇంటి ముందు మన స్కూటరో, కారో ఉన్నట్లే.

✻ **దేవుడు మనిషిని సుఖపడనివ్వకుండా ఎప్పుడూ కష్టాన్ని ఎందుకు కలుగజేస్తాడు?**

తనని మరచిపోకుండా ఉండటానికి.

✻ **కాలాన్ని క్రీస్తుపూర్వము, క్రీస్తు శకమూ అని విడగొట్టడంలోని ప్రాముఖ్యం ఏమిటి?**

అది ప్రపంచానికి ఇంగ్లీషు వాడు ప్రసాదించిన కాలజ్ఞానం. మన పరిగణనలో కల్పాలూ, మన్వంతరాలూ, యుగాలూ, మహాయుగాలూ వున్నాయి. ఇవి కాక ఎన్నెన్నో శకాలున్నాయి. క్రీస్తు పుట్టి ఇంకా రెండువేల ఏళ్ళు కూడా కాలేదు.

✻ **మాంగల్యం తంతునా మంత్రం ఏ వేదంలోనిది?**

అది మంత్రం కాదు. శ్లోకం. దీనికి వేదంతో సంబంధం లేదు. మంగళ సూత్రం, తలంబ్రాలు, అప్పగింతలూ ఆదిగాగలవి దేశీయాచారాలు.

✻ **తిరుమల వెంకన్నను దర్శించిన వారిలో ప్రహ్లాదుడు ఒకడని ఒక రచయిత వ్రాశారు. శ్రీనివాసుడు ఏ యుగం వాడు? ప్రహ్లాదుడు ఏ యుగం వాడు?**

కృతయుగంలో ప్రహ్లాదుడు చూచిన నరసింహస్వామే నేడు మనం చూస్తున్న శ్రీనివాసుడు.

✻ **సద్గుణాలు కలిగి ఉన్నవారంతా భగవత్సమానులేనా?**

సమానులు కాదు. భగవత్స్వరూపులే.

✻ **ఆత్మహత్య వ్యక్తిగతం కదా! అది పాపం ఎందుకవుతుంది. చట్టవిరుద్ధం ఎలా అవుతుంది?**

చట్టాల సంగతి తెలీదు కాని మన సంప్రదాయం ప్రకారం ప్రాణం తీసుకోవడం, పోసుకోవడం మనచేతిలోని పనులు కావు.

✻ **విగ్రహారాధన నిరసించే బుద్ధునికి విగ్రహాలు చేయిస్తున్నారు ఎందుకనో?**

మేరీ మాత విగ్రహమును ఆలయములలో ప్రతిష్ఠించుచున్నారు. మార్క్స్ లెనిన్ విగ్రహములను నడిరోడ్డుపై స్థాపించుచున్నారు. మానవ జాతిలో భక్తి

భిన్న రూపములలో వికసించుచునే యున్నది, యుండునేమో.

**⌘ వరకట్నాలు పురాణాలలో ఉన్నాయా?**

చదువు కొనుక్కోవడం ప్రారంభమయ్యాక ఆ పెట్టుబడిని చక్రవడ్డీలతో రాబట్టే అధ్వానపు దశ ఏర్పడింది. పురాణ కాలం నుంచి రెండు మూడు దశాబ్దాల క్రితం వరకు వరుడు వధువుని అన్వేషించుకుంటూ పోయేవాడే కాని ఆడపిల్లను కన్నతండ్రి వరుడి కోసం చెప్పులరిగేలా తిరిగి వేలం పాడే రోజులు లేవు.

వివాహ మంత్రాలు పరిశీలిస్తే నేటికీ కన్యావరణం విన్పిస్తూనే ఉంటుంది. కన్యాదాత అనే మాట శుభలేఖల్లో కనిపిస్తూ ఉంటుంది. చెయ్యి జాపి యాచించేవాడు వరుడు. ఇప్పుడాలోచించండి. ఈనాటి విద్య మనకెన్ని దుష్ట సంప్రదాయాలు నేర్పి సమాజ వ్యవస్థను ధ్వంసం చేస్తున్నదో. ముందు తరాల యువకులైనా ఈ వేలం పాటల నుండి విముక్తులౌతారని ఆశిద్దాం.

**⌘ అర్జునుడు పాశుపతాస్త్రం సాధించాడు కదా! దానిని ఎందుకు ప్రయోగించలేదు?**

పరమశివుడు పాశుపతాస్త్రం ఇస్తూ దీనిని మానవ యుద్ధాలలో ప్రయోగించ రాదనీ, దేవాసుర యుద్ధాలలోనే వినియోగించాలనీ ఆదేశించాడు. అయితే సైంధవ వధ సమయంలో గాలిలో ఎగురుతున్న ఆ శిరస్సును సైంధవుని తండ్రి చేతులలో పెట్టినది పాశుపతమే. ఈ కథ ద్రోణపర్వం చదివి వివరంగా తెలుసుకోండి.

**⌘ రాజస్వామ్యంలో ప్రజాభిప్రాయానికి విలువ ఉండేదా?**

మనకు తెలిసినంతవరకు ఆదికావ్యమైన రామాయణంలో రామ పట్టాభిషేకం నిర్ణయించే ముందు దశరథుడు తన దేశంలోని పౌర జానపదులందరినీ రావించి వారి అభిప్రాయం ప్రకారమే రాముని యువరాజుగా నిర్ణయించాడు.

వేనుడు తానే దైవాన్నని ప్రకటించడంతో ప్రజలందరూ తిరగబడి వానిని సంహరించారు. ప్రజాభిప్రాయాన్ని మన్నించి సగర చక్రవర్తి తన కుమారుడైన అసమంజుణ్ణి దేశం నుండి బహిష్కరించాడు. ప్రజలను కాదన్న వాడెవడూ ఎంతోకాలం సింహాసనం మీద బ్రతకలేడు.

పదవి లభించగానే తమకాపదవి కట్టబెట్టిన ఓటర్లను విస్మరించి తమ ఖజానాలు నింపుకొనే ప్రజాస్వామ్యవేత్తల కంటే ధర్మభీతి, సత్యనిరతి ఉన్ననాటి రాజులే నయమనిపిస్తున్నారు.

**⌘ ఆంజనేయుడు 'చూసి రమ్మంటే కాల్చి వచ్చాడు' గురువు మాట మీరినట్లేకదా!**

రాముడు ఆంజనేయుడికి గురువని చెప్పిన లవణాసురుడెవరు?

**⌘ శకుంతల దుష్యంతుని దగ్గరకు గర్భవతిగా వెళ్ళెనా?**

వ్యాసభారతంలో శకుంతల పన్నెండేళ్ల కొడుకుతో రాజసభకు వెళ్లింది. దుష్యంతుడు ఆమెను గుర్తుపట్టనట్లు నటించగా నిండుకొలువులో ఉన్న రాజుకు ధర్మ ప్రబోధం చేసి, తన స్థానాన్ని తాను సాధించుకొన్న ఆత్మస్థైర్యం గల యువతి శకుంతల.

మీరు చూసిన శకుంతల కాళిదాస మహాకవి మృదు హృదయం నుంచి బయటపడిన పిల్ల. భారతంలో శకుంతల చేసిన దాంపత్య ధర్మ ప్రసంగం మరీ కటువుగా ఉందని కాళిదాసు భయపడి రసహృదయులైన ప్రేక్షకుల కోసం, మహిళాదరణ కోసం గర్భవతిగానే దుష్యంతుని దగ్గరకు పంపాడు (వందల సంవత్సరాల క్రితమే దూరదర్శనమున్నవాడు కాళిదాసు)

**⌘ అశోక వృక్షం క్రింద ఉన్న సీత విభూతి ధరించిందని మొల్ల రామాయణంలో ఉంది. వాస్తవమేనా?**

త్రేతాయుగం నాటికి అడ్డబొట్లు, నిలువుబొట్లు, చుక్కబొట్లు కలవారు తలలు బ్రద్దలు గొట్టుకున్నట్లు కనిపించదు. ఇవన్నీ దేశంలో ఉన్మాదం ప్రబలి పైశాచిక ప్రకృతి విలయతాండవం చేసిన రోజులలో పుట్టినవి.

కాగా మనకిష్టమైన రీతిలో మన దైవాన్ని అలంకరించడం, ప్రసాదాలు ఆరగింపు పెట్టడం భక్తికి చిహ్నాలు. శివదీక్షలో ఉన్న మొల్ల సీతాదేవికి కూడా భస్మం పెట్టి తన భక్తిని ప్రకటించుకొన్నదే కాని ఇది వాల్మీకం కాదు.

**⌘ గుళ్ళూ గోపురాలూ తిరిగి, తీర్థయాత్రలు చేస్తే పిల్లలు పుడతారా?**

గుళ్లల్లో తిరగడం వల్ల మనస్సు ప్రశాంతమై, శరీరంలో వుండే కొన్ని దోషాలు నశిస్తాయి. తీర్థయాత్రల వల్ల ఆ ప్రాంతాల గాలి, నీరు అందుకుని శరీరంలోని

మాలిన్యాలు కొన్నిపోయి గర్భధారణావకాశాలు వస్తాయి

కొన్ని శారీరక దోషాలు తొలగడానికే యివి. అంతకు మించిన దోషాలుంటే ప్రదక్షిణలు, యాత్రలు నిష్ప్రయోజనం.

**⌘ బండెడు తిండి తిన్న భీముని బరువెంత?**

ఆ భీముని బరువెంతో కాని ఇప్పటికి బ్రతికున్న అమెరికన్ భీముని బరువు మూడు వందల నాలుగు కిలోలు. అంటే సుమారుగా నాలుగు బస్తాల మినుములు తూగుతాయి. ఆ మధ్య వీనియన్న మరియొకడున్నట్లు మీరు విని యుండవచ్చును.

అయితే నాటి భీమునికి తినిన దానిని జీర్ణించుకొను శక్తియు, దానిని బలముగా మార్చి హిడింబాసుర బకాసురాది బలవంతులను పిడిగ్రుద్దులతో మాంసపు ముద్దలుగా చేయు లాఘవము ఉండెడిది. నేటి వారికది పూజ్యము.

**⌘ విశ్వామిత్రుడు వసిష్ఠుని గోవును దొంగిలించెనా?**

విశ్వామిత్రుడు మహారాజు, రాజులు దొంగతనం చెయ్యరు. తమకు కావలసిన దానిని సైన్యం సహాయంతో పట్టపగలే పట్టుకుపోతారు. అడ్డు వస్తే తల తరుగుతారు. అదీ విశ్వామిత్రుడు చేసిన పని.

వశిష్ఠుడు బ్రహ్మర్షి కనక చంపలేక ఆయన బిడ్డలను నరికివేశాడు విశ్వామిత్ర చక్రవర్తి.

**⌘ ప్రజల ఓట్లు తమ పార్టీకి పడడానికి ప్రవేశపెట్టే పథకాలు భారతంలో వున్నాయా?**

ఎంతమాట, పాండవులను అభిమానించే ప్రజలను తమ పక్షానికి త్రిప్పుకోడానికి దుర్యోధనుడు ప్రారంభించిన ఎత్తుగడలివి. ఆయన శిష్యులు మన పాలకులు.

**⌘ విద్యావ్యాపారము రామాయణ భారతములో కూడా కలదా?**

అన్న విక్రయము, విద్యా విక్రయము, ఔషధ విక్రయముల కన్నా మహాపాపం లేదని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఈ శాస్త్రాలు ఎవడిక్కావాలి? అని ఉద్ఘోషించగలిగినవారు పాలకులైన కాలంలో వారి నాయకత్వానికి విరాళిలిచ్చే ఈ వ్యాపారాన్ని ఎందుకు నిషేధిస్తారు?

దమ్మిడీ పెట్టుబడి అవసరం లేని ఇంత చక్కని వ్యాపారం నీతి గల ఇంగ్లీషువాడు కూడా చేయలేకపోయాడు. అన్నవస్త్రాలిచ్చి చదువు చెప్పిన దేశం ఇది. తిరగనివ్వండి కాలచక్రాన్ని. రాకపోవు మంచిరోజులు.

⌘ **అర్థం తెలియని మంత్రాలతో వివాహం కంటె వాడుక భాషలో వివాహం ఉత్తమం కదా?**

వాడుక భాషలో చేసే వాగ్దానాలు విని ఓట్లు వేసి నెత్తి మీదికెక్కించుకున్న నాయకుల పాలనలో స్వార్థం, బంధు ప్రీతి, ఆశ్రిత పక్షపాతం చూసి కూడా ఈ మాట అంటున్నారా, మంత్రమైనా తెలుగు తాత్పర్యమైనా తాళికట్టేవాని మనసు ప్రధానం. అయితే మంత్రానికి శక్తి ఉన్నదని శబ్ద శాస్త్రం ఘోషించింది.

అయితే మంత్రం ఉచ్చరించే శక్తి కూడా ఉండాలి, వారు నిర్మలమూ, నిస్వార్థమూ అయిన జీవితం సాగిస్తేనే మంత్రం బలంగా ఉంటుంది. వారు కూడా వ్యాపార దృష్టికి దిగితే మంత్ర తంత్రాలు లేని రిజిష్టరు పెళ్లి చేసుకుని కాంట్రాక్టు కాపురం చేయడం మేలు.

⌘ **తలంబ్రాలకు బియ్యమే వాడాలంటే అవి దొరకని చోట?**

బియ్యం దొరికే ప్రాంతంలోనే తలంబ్రాల ఆచారం వచ్చింది. దేశం అంతటా తలంబ్రాలు పొయ్యరు.

⌘ **రావిచెట్టును ఎందుకు పూజిస్తారు?**

రావిచెట్టుకి గాలిలోని కాలుష్యాన్ని హరించే శక్తి వున్నదని నేడు శాస్త్రజ్ఞులు ఘోషిస్తున్నారు. కలుషరహితమైన గాలి దొరికేచోట కొంతసేపు తిరిగితే ఆరోగ్యం వస్తుందిగా. దానికి భక్తి జోడిస్తే పరమార్థం కూడా వస్తుంది.

⌘ **హిందూ మతస్థులే పసుపు రాసి, కుంకుమ బొట్లు పెట్టుకుంటున్నారే?**

హిందూమతం అనే శబ్దం పుట్టని కాలంలో ఈ దేశంలోని గాలి, నీరు వాతావరణానికి శరీరం తట్టుకుని ఆరోగ్యంగా వుండడానికి అవసరమైన అలవాట్లు మహర్షులు అనుగ్రహించారు.

బొట్టు, కాటుక, ఉంగరాలు, మట్టెలు అన్నీ ఆరోగ్య సంబంధమైనవే కాని మతానికీ, ఆచారానికీ సంబంధించినవి కావు.

**⌘ పెళ్లిలో నెత్తి మీద జీలకర్ర బెల్లం ఎందుకు పెడతారు?**

చిన్నప్పుడు మాడు మీద పసుపు ముద్ద పెట్టేవారు మా అమ్మగారు, అమ్మమ్మగారు. బహుశా మీకా ఇబ్బంది లేదు. మాడు మీద జీలకర్ర, బెల్లం వుంచితే చల్లగా ఉంటుంది. పెళ్ళి వేళ వధూవరుల దేహాలు పరస్పర స్పర్శతో పులకించి వేడెక్కుతాయి. ఆ వేడిని తగ్గించి సామాన్యస్థితికి తేవడానికి జీలకర్ర, బెల్లం ఔషధులుగా పనిచేస్తాయి.

**⌘ ఆషాఢభూతి అంటే...?**

ప్రజలందరికీ వైరాగ్యం బోధించి, బూడిద పంచిపెడుతూ కాసులు మూటకట్టే సన్యాసికి బూడిద పూసే శిష్యుడు.

**⌘ స్వర్గం నరకం మీరు చూశారా?**

నరకంలోనే మనం ఉన్నాం. దీపాలార్పేవారు, నకిలీమందులమ్మేవారు, కొంపలు కూల్చేవారు, వాగ్దానాలతో నెత్తిని చేతులెట్టేవారు. ఇలా ఎందరెందరో యమకింకరులు నిత్యం మన చుట్టూ గోతికాడ గుంటనక్కల్లా కనిపించడం లేదూ.

స్వర్గం అంటారా! ఇటువంటి కింకరులు లేని సమాజం బ్రతికే కాలం వస్తే అదే స్వర్గం.

**⌘ ఆత్మకూ, పరమాత్మకూ భేదం ఏమిటి?**

ఆత్మయే పరమాత్మ అంటారు కొందరు. ఆత్మ జీవుడనీ దీనిని శాసించేదీ, నడిపించేదీ, నడుస్తూంటే సాక్షిగా చూసేదీ పరమాత్మ అంటారు. ఇంకా విశదం కావాలంటే భగవద్గీత పదిమారులు చదివి సద్గురువును ఆశ్రయించండి.

**⌘ దొంగతనాలు, ఖూనీలు, మోసాలు, ఆడువారిపై అత్యాచారాలు చూపించే సినిమాను కళాపోషణ కోసం తీస్తున్నారా?**

తీసేవారి ఉదరపోషణ ముఖ్యం. వేషాలు వేసే వారి విలాస విహార పోషణ అంతకంటే ముఖ్యం అని తెలిసి పోషిస్తున్న ప్రేక్షకుల కళారాధనకు నమస్కారం.

**⌘ మోక్షప్రాప్తికి విగ్రహారాధనమా? హృదయారాధనమా?**

హృదయాంతర్వర్తియైన పరబ్రహ్మను ఆరాధించే ఏకాగ్రత సిద్ధించే

వరకూ విగ్రహారాధన సాగించాలి.

⌘ **చేసేదీ చేయించేదీ నేనే అన్న కృష్ణుడు కర్మఫలం మనకెందుకు రుద్దుతాడు?**

చేసినదీ చేయించినదీ మన చేతులతో, కాళ్ళతోనే కనక కర్మ కూడా మననే వరింపజేస్తారు.

⌘ **హుండీలో డబ్బు వేసి పుణ్యం కొనుక్కుంటారా?**

కాదండీ, చేసిన పాపఫలం పదిమందికి పంచిపెట్టడం.

⌘ **వెన్నెలయినా చీకటయినా నీతోనే జీవితం అని సంసారం చేసేవారున్నారా?**

అలా పాడుతూ మిమ్ము భ్రమింపచేయడానికి నాయకులు 15 లక్షలు, నాయిక 2 లక్షలు పుచ్చుకుంటారు. ఆ వెన్నెల చీకటి రెండు మూడు గంటలే. మళ్ళీ మధ్యాహ్నం మరో నాయకుడితో అన్యోన్యం అభినయిస్తుంది. అయినా మనం అటువంటి దాంపత్యం దొరుకుతుందా అని ఎండమావులు చూస్తాం.

⌘ **రామాయణ, భారతాలు చదివినా ఏకపత్నీవ్రతం, ధర్మపాలనదీక్ష రావడం లేదు?**

పులుసులో తెడ్డు తిరుగుతున్నా దాని రుచి తెలుసుకోగలదా? ఈ తెడ్డు మనస్సులను రామాయణ భారతాలు మార్చలేవు.

⌘ **పెళ్ళి కాగానే తల్లిదండ్రులకి దూరంగా ఉండాలని ఎందుకనిపిస్తుంది?**

తల్లిదండ్రుల వాత్సల్యం కంటే దాంపత్యంలో అనురాగం కొత్తగా రుచిగా అనిపిస్తుంది. అది ఎంతో కాలం వుండదు. కాని ధర్మం వున్నదే దానికి కట్టుబడి జీవితాలు సాగుతాయి. అదే ధర్మం తల్లిదండ్రుల యందు కూడా నిలపాలి, కాని కలి ప్రభావం ధర్మాన్ని దూరం చేయడమే!

⌘ **కంసుడు రాక్షసుడు కదా మరి దేవకీ?**

రాక్షసులంటే వేరే ఎవరూ కాదండీ... కన్నతల్లికి తిండి పెట్టనివాడు, తండ్రి గొంతు నులిమి ఆస్తులు దోచేవాడు, తోడబుట్టిన దాని పసుపు కుంకుమలు తుడిచేవాడు, గురువును చితకబాదేవాడు ఇలా దుర్మార్గాలు చేసేవారందరూ రాక్షసులే. రాక్షసత్వం మన నడవడి మీద వుంది. అలానే దైవత్వమున్నూ.

**⌘ పురాణాలు, ఉపనిషత్తులు, గీత విన్నా దేవుడున్నాడనే నమ్మకం కలగదే?**

విన్నంతలో మారిపోతే మనస్సు గొప్పతనం ఎక్కడుంది. అది ఎంతటిదంటే ఎన్నిమార్లు తోమినా నల్లబడు రాగి చెంబు వంటిది. అలా తోముతూతోముతూ ఉంటే ఎప్పటికో నిర్మలమవుతుంది.

**⌘ అత్తింటి కిరసనాయిలు చావులు తప్పడం లేదు కదా, ఇంక ముహూర్తాలు ఎందుకు?**

ముహూర్తం వివాహానికే కాని కట్నం తేలేదని కాల్చి చంపే అత్తమామల, కట్టుకున్న పట్టభద్రుడి తలకాయ మార్చడానికి కాదు. ఒకరకంగా ముహూర్తాలతో పాటు పెళ్ళిళ్ళు కూడా మానివేయడమే ధర్మమేమో అనిపిస్తుంది. కాని ఆడపిల్లను ఇంట్లో పెట్టుకు ఎన్నాళ్ళు కూర్చుంటారు.... అని నిత్యం పొడిచే ఆడకాకుల బాధపడడం కూడా కష్టమే. ఆ కాకుల నోరు నొక్కితే.

**⌘ ఏ మతం గొప్పది?**

అన్నిమతాలు సత్యం, ధర్మం, అహింస మానవత్వ లక్షణాలన్నీ... దేవుడొక్కడే అని అంటున్నాయి. మరి ఏ మతం గొప్పదంటాం?

**⌘ బ్రహ్మచర్యం - అస్థలిత బ్రహ్మచర్యం నిష్ప్రయోజనమా?**

బ్రహ్మచర్యం శరీరాన్ని దృఢంగా వుంచుతుందని ఆరోగ్యం కోసం పుట్టిన ఆయుర్వేదం చెపుతున్నది. ఆరోగ్యవంతులు ఎక్కువైతే తమ పెట్టుబడులకు ప్రతిఫలం ముట్టదని భావించే ఔషధాల కంపెనీవారు అనుగ్రహం కోరే ప్రముఖులు బ్రహ్మచర్యం ఎందుకూ పనికిరానిదనీ, పక్షులవలె క్షణక్షణ సంయోగం మంచిదనీ దుష్ప్రచారం చేస్తున్నారు. పశువులూ, పక్షులూ కూడా ఋతుకాలంలోనే కలుస్తాయి. మనిషికొక్కడికే ఋతువు లేని దుర్దశ పట్టింది.

**⌘ 'ఆనందో బ్రహ్మ' అంటారే కాని శివ, విష్ణు అనరాదా?**

ఈ బ్రహ్మ శబ్దం బ్రహ్మ, విష్ణు మహేశ్వరులలోది కాదు.

పరబ్రహ్మమని ఒకటున్నది. అదే ఈ త్రిమూర్తులను, లోకాలను సృష్టించి లయం చేస్తూ క్రీడిస్తున్నది. ఆ క్రీడకు త్రిమూర్తులు నిమిత్త మాత్రులు.

ఆనందం అటువంటి బ్రహ్మమే కాని చతుర్ముఖ బ్రహ్మ కాదు.

**⌘ అందమే ఆనందం అయితే అది లేనివారికి?**

అందం అంటే శరీరం మీది చర్మం నారింజపండు రంగులో ఉండడం కాదు. మనస్సులో ఏ వికారాలూ లేకపోవడం, హృదయం సుందరభావాలతో నిర్మలంగా ఉండడం.

**⌘ విశ్వామిత్ర దుర్వాసాది మునులకే కోపం తగ్గలేదే?**

మునులను కూడా లొంగదీస్తాయి నాయనా కామక్రోధాలు అని సామాన్యుడికి జ్ఞానం కలిగించాలి. చూశారుగా, తీవ్ర తపస్సు చేసే విశ్వామిత్రుడు మేనకను చూస్తూనే మోహంలో పడిపోయాడు.

ఆ తరువాయి రంభ వస్తే క్రోధానికి లొంగిపోయాడు. అలా మహామహులు పడిపోయే దుర్గుణాలను దూరం చేసుకోవాలి.

**⌘ శరీరం సుఖంగా వుంటే మనస్సు ఆనందంగా వుంటుందా?**

మనస్సు నిర్మలంగా ఉంటే శరీరం సుఖంగా ఉంటుంది.

**⌘ మామిడాకుల తోరణాలు అలంకారానికేనా, అయితే ప్లాస్టిక్ తోరణాలయితే చాలాసార్లు పనికొస్తాయిగా?**

పచ్చని ఆకులు బొగ్గుపులుసు వాయువుని పీల్చి ప్రాణవాయువును వదులుతాయి. వందలమంది గుమిగూడే పందిరిలో చుట్టూ ఈ తోరణాలు కడితే గాలిలోని కల్మషాన్ని అవి హరిస్తాయి. ప్లాస్టిక్ తోరణాలు, కాగితం పువ్వులు రంగుకి పనికివస్తాయి. వ్యాపారులకు లాభిస్తాయి. మన ఆరోగ్యాన్ని హరిస్తాయి.

**⌘ సృష్టికి మూలకారణం భగవంతుడా?**

భగవంతుడే అని కొన్ని వందల కోట్లమంది భావిస్తున్నారు. కోట్ల సంవత్సరాలుగా, భగవంతుడూ లేడు భగవతీ లేదు. ప్రకృతిలో ఇవన్నీ పుడుతున్నాయని కొందరు అంటున్నారు. ప్రకృతికి ఆ శక్తి ఎక్కడిదని అడిగితే ఈ ప్రశ్నకు సమాధానం యివ్వలేకపోతున్నారు. ప్రకృతిలో భగవంతుడు ప్రవేశించడం వల్ల సృష్టి జరుగుతున్నదని మధ్యే మార్గం.

**⌘ మనస్సు - బుద్ధి ఏది గొప్పది?**

పరుగులు తీసే మనస్సుకు కళ్ళెం వేసి నడిపే బుద్ధి గొప్పది.

⌘ **మహాత్ముడనిపించుకున్న గాంధీజీకి అవార్డులూ, బహుమతులూ లేవే?**

వాల్మీకికీ, వ్యాసునికీ, నన్నయకూ, తిక్కన్నకూ బిరుదులు లేవు. అలానే గాంధీజీ! వీరందరూ అవార్డులకూ, బహుమతులకూ అతీతులు. వేదం వెంట్రాయశాస్త్రి గారికి ఆంధ్ర విశ్వ విద్యాలయంలో కళాప్రపూర్ణ బిరుదం ఇస్తామని వారి శిష్యుడు రామలింగారెడ్డి గారు కబురు చేస్తే నాకెందుకీ బిరుదు? అనగా రెడ్డిగారు-

ఆ బిరుదును మీకిచ్చిన గౌరవం మాకు దక్కడానికి అన్నారు. ఆ తరాల వరకూ అంత ఆత్మ ప్రత్యయం ఉండేది. ఈనాడు చూస్తున్నారుగా బిరుదుల కోసం పడే పాట్లు.

⌘ **ద్రౌపది పతివ్రతయా?**

మూడు లక్షలు తీసుకుని ముగ్గురు హీరోలతో మూడు ముళ్ళు తొమ్మిది నిమిషాలు పతివ్రతగా నటించే తారల చిత్రాలను దేవతా మందిరాలలో పెట్టి పూజించే యువతరం, వారి వెంట నడిచే నాయకులు పెరిగిన కాలంలో పాతివ్రత్యాన్ని గురించి ఆలోచన దేనికి? ఈ జాతికి యుగధర్మాన్ని అందించిన మహాభారతం పంచమవేదం అని నమ్మితే ద్రౌపది పతివ్రత, ఆ నమ్మకం లేకపోతే భారతాన్ని విసిరి పారేయండి.

⌘ **కృష్ణుడు రాక్షస వివాహం చేసుకున్నాడా?**

భాగవతం ఆ మాట చెపుతున్నది. అయితే రాక్షసం అంటే ఈనాటి రాక్షసార్థం కాదు. వివాహాలు ఎనిమిది విధాలు, అందులో రాక్షసం ఒకటి. వివరాలకు భారతం చదవండి.

⌘ **ఏకాదశినాడు పిండితో చేసిన వంటకాలెందుకు భుజిస్తారు?**

ఈ దేశంలో పండుగలు, ఆచారాలు ఆయా ఋతువులలో గాలిలో, నీటిలో వచ్చే మార్పులను మన శరీరం తట్టుకుని ఆరోగ్యంగా వుంచడానికే. ఈ శాస్త్రీయ దృక్పథం అంతా మూఢాచారం అనుకుని శరీరాన్ని రోగగ్రస్తం చేసే పదార్థాలు నిత్యం ఆరగించి కల్తీ మందులు మింగడం నాగరికత అయింది.

⌘ **మోక్షం - పుణ్యం ఏమిటి తేడా?**

పుణ్యం చేస్తే మోక్షం అని పురాణాలు చెబుతున్నాయి.

**⌘ ధృతరాష్ట్ర కౌగిలి అనగానేమి?**

ఎన్నికల సమయంలో రాజకీయ పక్షాలు ప్రదర్శించే ప్రజాభిమానం, పేదలకు కురిపించే వరాల వానలు, ఇవన్నీ ధృతరాష్ట్ర రాజనీతి నుంచి అందినవే. కడుపులో ద్వేషం మండుతుంటే మాటలో మధురరసాలు కురిపిస్తూ దగ్గరగా కౌగిలించుకుని పీకలు నులమడం.

**⌘ శాస్త్రోక్తంగా జరిపే వివాహాలు వదిలి రిజిష్టర్ మ్యారేజీలు వచ్చాయేం?**

దాంపత్యంలో ఉండవలసిన అనురాగం క్రమక్రమంగా నశిస్తోంది. అటువంటప్పుడు శాస్త్రం కంటె రిజిస్ట్రేషన్, అంతకంటే కాంట్రాక్టు పెళ్ళిళ్ళు నయం. పెళ్ళికి ప్రధానం భార్యాభర్తల బంధం. అది పోయి డబ్బు సంచులు, అవి చాల్లేదని కిర్సనాయిల్ డబ్బాలు పెరిగిన నాగరికత విజ్ఞాన యుగంలో శాస్త్రం దేనికి. అసలు వివాహాలే మాని స్వేచ్ఛగా తిరిగే రోజులు రాబోతున్నాయి.

**⌘ ప్రాచీన కాలపు గాంధర్వ రాక్షస వివాహాలకూ నేటి ప్రేమ వివాహాలకు పోలిక?**

గాంధర్వ వివాహంలో వధూవరులు తొలిచూపులోనే ఆకర్షణకు లోనై ఇతరుల ప్రమేయం లేకుండా పాణిగ్రహణం చేసుకొని సంసార యాత్రకు ఉపక్రమిస్తారు. రాక్షస వివాహ సమయంలో ఒకరిని గురించి ఒకరు విని ఆ గుణగణాలకు ఆకర్షితులై బంధువుల అభిమతానికి విరుద్ధంగా వరుడు వధువును అపహరించుకెళ్లి వివాహం చేసుకుంటాడు.

గాంధర్వానికి శకుంతల, రాక్షసానికి రుక్మిణి మనకు బాగా తెలిసినవారు గాంధర్వానికి యిష్టపడిన శకుంతల ఎన్నిపాట్లు పడినా తన భర్తను నిలబెట్టి తన పత్నిత్వాన్ని భద్రం చేసుకోగలిగింది. రుక్మిణీ కృష్ణుల విషయం లోకవిదితమే. అయితే ఈనాటి ప్రేమ వివాహాలు గాంధర్వం వంటివే కాని అవి ఎంతవరకూ ఫలప్రదాలవుతున్నాయో చూడాలిగా.

**⌘ పెళ్ళిళ్ళు అయిదు రోజులు చేసేవారంటే హడలు పుడుతోంది?**

అయిదు రోజులకే హడలుతున్నారా! పదహారు రోజుల పండుగ వరకూ చేసిన వారున్నారు. అమ్మాయి గర్భవతి అయ్యేవరకూ అల్లుడిని తమ యింట ఉంచుకున్న వారుండేవారు.

దేశం సుభిక్షంగా ఉండి తెల్లవారింది మొదలు రాత్రి పడుకునే వరకూ జానెడు పొట్టకోసం కోటీశ్వరుల కొడుకులు కూడా ఉద్యోగాల పేరుతో తలలు వంచని కాలంలో, ఇరుగుపొరుగుల కష్టసుఖాలలో భాగం పంచుకునే రోజులలో, మనకు సరిపోగా మిగిలింది బీదవారికి ధర్మం చేసే రోజులలో ఏర్పడినవి అయిదు రోజుల పెళ్ళిళ్ళు, పన్నెండు రోజుల కర్మకాండలూ.

ఇప్పటి పరిస్థితులలో అయిదు నిమిషాల పెళ్ళిళ్ళు చేసుకోవడమే ధర్మం. పత్రికలో అరపేజీ సంస్మరణ ప్రకటనలివ్వడమే చక్కని కర్మ.

⌘ **వధువును వరునికి దానం చేసినట్లే వరుణ్ణి దానం చెయ్యరాదా?**

చెయ్యవచ్చు. కాని మన సంప్రదాయం ప్రకారం కన్య అత్తవారింటికి వెళ్ళి ఆ వంశాభివృద్ధి చెయ్యాలి. తన వంశాన్ని ఉద్ధరించడానికి యోగ్యమైన కన్యను ఉత్తమ కుటుంబం నుంచి యాచించి వరుడు తెచ్చుకోవాలి.

అంటే వరుడు దానం పట్టేవాడే కాని దానంగా పోయేవాడు కాదు. కాని ఈనాడు తన చదువునూ, అంతస్థునూ విక్రయించుకుని దానికి కట్నం అని పేరు పెట్టి సంతలో గిత్తలా నిలబడుతున్నాడు సిగ్గుపడకుండా.

⌘ **భారత రామాయణాలలో భారత ఉపఖండ ప్రస్తావనే వున్నది, మిగలిన ఖండాలు?**

భారత, రామాయణాల నాడు భూగోళం ఎలా ఉండేదో రెండు గ్రంథాలూ చదివితే తెలుస్తుంది. కిష్కింధకాండలో సుగ్రీవుడు, భీష్మపర్వంలో సంజయుడు భూగోళానికి నాటి గోళానికీ వున్న తేడా గమనిస్తే ఖండాలు దూరమవు తున్నాయని నేడు శాస్త్రజ్ఞుడు చెప్పేమాట అర్థమవుతుంది.

⌘ **మంగళసూత్రాలూ, తలంబ్రాలూ అవసరమని మీరు బోధించారా?**

బోధించడానికి నేను ప్రవక్తనూ కాను. పీఠాధిపతిని కాను, ప్రజానాయకుడనే ముద్రనూ ధరించలేదు. కాని సూత్రాలూ, తలంబ్రాలు దేశమంతా ఉన్న ఆచారం కాదు, వేదప్రతిపాదితమూ కాదు.

ఆయా ప్రాంతాల వారు హాయిగా జీవించే రోజులలో సంతోషంగా ఏర్పరచుకున్న వేడుకలవి. దురదృష్టవశాత్తూ వేడుకలు తప్పనిసరి చేసుకున్న

అమాయకులు పెరుగుతున్నారు.

⌘ **తెల్లవారకుండా స్నానం చేసి, మడి గట్టుకుని దైవం ముందు కూర్చున్నది మొదలు పిల్లల్ని తిడుతూ, కూతుళ్లనూ, కోడళ్లనూ నసుగుతూ నోములూ, వ్రతాలు చేస్తే ఫలిస్తాయా?**

స్నానాలూ, పట్టుబట్టలూ బాహ్యశుద్ధికి అవసరమే కాని పూజా సమయం లోనే కాదు నిరంతరం మనస్సును నిర్మలంగా ఉంచుకుని, వాక్కును మంచిగా వుంచుకోకపోతే ఏ ఫలమూ ఉండదు.

తిట్లూ, శాపనార్థాలూ పెట్టే నోటితో ఎన్ని స్తోత్రాలు చదివినా ఫలించవు. ఓరిమి లేని నాడు నోములెన్ని నోచినా పిండివంటలు తినడానికే తప్ప ప్రయోజనం వేరే లభించదు.

⌘ **విశ్వామిత్రుడి గొప్పతనం ఏమిటి?**

తనకంటే వశిష్ఠుడు గొప్పవాడని తెలిశాక తను కూడా అంతవాడు కావడానికి అవసరమైన దీక్ష వహించి, కామ, క్రోధాలు విడిచి, అసూయను దూరం చేసుకుని ఆత్మసాక్షాత్కారానికి ప్రయత్నించడం.

⌘ **రావణుడు సీతాదేవి నిలబడిన భూమి పెళ్లగించి తీసుకెళ్ళాడని హరిదాసుగారూ, నీడను పట్టి లాక్కుపోయాడని పురాణం శాస్త్రిగారూ మా గ్రామంలో చెప్పారు, ఏది సత్యం?**

రెండూ అసత్యమే! హరిదాసు, పురాణం శాస్త్రిగారులు వాల్మీకి రామాయణం కంటే తమ సొంత ఊహలే నిజమనే భ్రమలో వున్నారు. భూమిని పెళ్ళగించడం, నీడను లాగడం రావణుడు చేసే పని కాదు. పతివ్రత శరీరం సోకితే రావణుడు బూడిద అయిపోతాడని వారి భ్రమ.

వాల్మీకికి ఆ భ్రమ లేదు. సీతాదేవి పాతివ్రత్యం ఎంత గొప్పదో, రావణుని తపస్సు కూడా అంత గొప్పదనీ అందువల్లనే ఆమెను రెండు చేతుల్తో పట్టి తెచ్చినా వాడు బూడిద కాలేదనీ సుందరకాండలో చెప్పాడు. సీతాపహరణం జరిగిన అరణ్యకాండలో-

**వామేన సీతాం పద్మాక్షీం**

**మూర్ధజేషు కరేశ్రీ నః**

**ఊరోస్తు దక్షిణేనైవ**

**పరిజగ్రాహి పాణినా॥**

అని 49వ సర్గలో 17వ శ్లోకం వారిని చదువుకోమనండి.

ఎడమ చేత్తో శిరస్సును, కుడిచేత్తో పిరుదులను పట్టి-

తొడమీద కూర్చోబెట్టుకుని రథం మీద ప్రయాణం చేశాడు. ఇది వాల్మీకి రామాయణంలో వున్న విషయం. వారికి వివరించండి. చెప్పే ముందు వచన రామాయణమైనా చదువుకోమనండి.

**⌘ ఆలయానికి దైవదర్శనానికి వెడితే చెప్పులు వదిలే చోట టికెట్, దర్శనానికి టికెట్, హారతికి టికెట్, చివరకు హుండీ యిన్నిరకాలుగా డబ్బులిచ్చినా ఆ దేవుని ముందు నిలబడి నిమిషం కూడా చూడనివ్వకుండా రెక్కపుచ్చుకు లాగే మనుషులు.... ఎలా యింక దేవుని చూడడం?**

ఒకనాడు దేశంలో ధర్మబుద్ధి, దైవభక్తి కలవారు ఆలయాలు నిర్మించి స్వామి సేవకు, అర్చకుల భుక్తికి ఎకరాల భూమి దానం చేశారు. ప్రభుత్వం అన్ని వ్యాపారాల కంటె ఈ వ్యాపారం మంచిదని కొందరు నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి యిన్ని రకాలుగా దోపిడీలు చేస్తున్నారు. ఏం చేస్తాం, ఆలయాలకు వెళ్ళడం మాని హాయిగా మీ గ్రామంలోని గుడిలో ఓవార కళ్ళు మూసుకు కూర్చుని ఆ పరమేశ్వరుని ధ్యానించండి.

**⌘ గీత కృష్ణుడి కంటే భారతంలో విదురుడే చాలా విషయాలు చెప్పాడా?**

విదురుడు బోధించిన విషయాలతో మనస్సు పరిపక్వం అయిన వారికి భగవద్గీత అర్థమవుతుంది.

**⌘ ఆశీర్వాదాలు ఫలిస్తాయా?**

అబద్ధం ఆడనివారి నోట ఏ మాట వచ్చినా ఫలిస్తుంది.

**⌘ విశ్వామిత్రుని కథ పూర్తిగా రాయండి?**

విశ్వామిత్రునిలో నాయకత్వ లక్షణాలే లేవు, ఎదుటివారి సంపదలు హరించాలనే బుద్ధి, తన కంటె గొప్పవారిని చూసి అసూయతో కుళ్ళిపోయే

తత్వం గలవానికి నాయకత్వం సిద్ధించదు.

※ **మయసభలో శకుని జూదం ఆడినట్టు మీ భారతంలో లేదే?**

భారతం నాది కాదు. వ్యాసుల వారు ప్రథమంగా భారతం ఇచ్చారు. దానిని సినిమాలవారు కొంత మార్చారు. దూరదర్శన్ వారు కొంత మారుస్తున్నారు.

అయితే ముందు ఓడిపోయినట్టు నటిస్తే తరువాయి కొంపలు ముంచ వచ్చునని శకుని బుద్ధి కల రచయిత ఈ సన్నివేశం సృష్టించారు. వ్యాస మహర్షికి కౌంటీ మాచెస్ అలవాటు లేదు, సరాసరి టెస్ట్‌లోనే దింపుతాడు.

※ **పెళ్లికొడుకులను గిత్తలతో పోల్చుట న్యాయమా?**

చాలా అన్యాయం, ఎందుకంటే సంతలో డబ్బుపెట్టి కొనుక్కున్న గిత్త మన ఇంటికి వచ్చి బండి లాగుతుంది. చేను దున్నుతుంది, సున్నపు గానుగ లాగుతుంది. అంతసేవ చేసే గిత్తతో పెళ్ళికొడుకును పోల్చడం న్యాయం కాదు.

※ **ఆత్మస్థైర్యం కావాలంటే భుజబలం కావాలా?**

భుజబలం ఉన్నంతలో ఆత్మస్థైర్యం రాదు. కాని ఆత్మస్థైర్యం కావాలంటే శరీరం కూడా ఆరోగ్యంగా వుండాలి. శరీరాన్ని ఆరోగ్యవంతంగా ఉంచుతూ మనస్సును ఏకాగ్రం చేసుకోగల వారికి స్థైర్యం లభిస్తుంది.

※ **రాముడు యుద్ధ ముహూర్తం రావణుని చేత పెట్టించెనా?**

యుద్ధ ముహూర్తాన్ని రాముడు కిష్కంధలో నిర్ణయించాడు, రావణుడు ముహూర్తాలు పెట్టే సిద్ధాంతి కాదు.

※ **అక్ష హృదయం అంటే?**

జూదంలో మన యిష్టం వచ్చినట్టు పాచికలు నడపడం. ఇందులో నలుడు ఆరితేరినవాడే, శకునిది అందెవేసిన చెయ్యి.

※ **భీష్ముడు కర్ణుని అర్ధరథుడనడం న్యాయామా?**

న్యాయం, ధర్మం తెలిసినవాడు భీష్ముడు. ఎందుకు అర్ధరథుడన్నాడో భారతంలో ఆయనే చెప్పాడు, చదివించండి.

※ **భగవంతుడు మనిషిగా పుడతాడు, మనిషి భగవంతుడు కాడా?**

భగవంతుడు మనిషిగా అవతరించడం లీల, మనిషి భగవంతుడు కావాలంటే తనలోని ఆత్మను సాక్షాత్కరింపజేసుకుంటే చాలు.

⌘ **తీర్థయాత్రలూ, గంగాస్నానాలూ పాపాలు పోగొడతాయా?**

యాత్రలూ, స్నానాలూ చేస్తూ పాపకర్మల నుండి మనస్సును సత్కార్యాల వైపు నడిపితే పోతాయి.

⌘ **శ్రీరామచంద్రుడు నేర్చుకున్న గుణపాఠం ఏమిటి?**

ఒక భార్యతో హాయిగా సంసారం చేయడం, అలా వుండలేకపోతే తన తండ్రిలా ప్రాణాలు పోగొట్టుకుంటారనీ, రావణుని వలె సర్వనాశనం అవుతారనీ నేర్పాడు లోకానికి.

⌘ **ఇంట్లో పూజలకు మడి అవసరమా?**

ఇంట్లో అయినా గుడిలో అయినా మనస్సు మడి (పవిత్రం)గా ఉండడం అవసరం. అది లేనప్పుడు బాహ్యాచారాలు ఎన్ని అవలంబించినా వ్యర్థమే. ముందు మనస్సు నిర్మలమయితే మడి, దడీ ఆలోచన రాదు. అయితే పరిశుభ్రత కోసం మడి ప్రవేశించింది.

⌘ **ఏడు వారాల నగలంటే-**

సంస్కృతంలో వారం అంటే ఏడురోజులు. ఏడురోజులూ ఏడు రకాల ఆభరణాలు ధరించడం రాజవంశాలలో ఉండేది.

⌘ **మయసభలో దుర్యోధనుడు పరాభవం పొందినప్పుడు ద్రౌపది అంధుని పుత్రుడూ అంధుడే అన్నదా?**

అనిపించారు దూరదర్శన్ వారు, పాత్ర స్వభావం అర్థం కాక.

⌘ **పాలకులకు విద్యాగంధం లేనప్పుడు వారి దగ్గర పనిచేసే వారికి మాత్రం చదువెందుకు?**

ఇద్దరూ గుడ్డివారు కాకూడదుగా.

⌘ **సన్యాసానికి త్యాగానికీ తేడా ఏమిటి?**

సర్వమూ త్యాగం చేసినవాడు సన్యాసి, ఈ త్యాగం మన భార్యాబిడ్డలకు ధారపోయడం కాదు.

⌘ **హే సీతా, లక్ష్మణా! అని అరిచిన మారీచుని అరుపు వినబడినంత దూరం రాముడు కూడా అరిచి రావద్దనవచ్చుగా?**

రాక్షసులకున్న గొంతు మానవులకుండదు. పైగా మారీచుడు రాముని గొంతుకతోనే అరిచాడు. ఆ అరుపు విని రాముడు కూడా ఆశ్చర్యపోయాడు. అంటే మారీచుడు గొప్ప మిమిక్రీ కళాకార పితామహుడు.

⌘ **మతం లేకుండా మనిషి బ్రతకలేడా?**

మతం అంటే వారానికోమారు కళ్ళుమూసుకుని నా పాపాలు నీవు స్వీకరించు, నేను మళ్ళీ ఆరంభిస్తాను అనడం కాదు. మా దేవుడే దేవుడు. మీ దేవుడు నకిలీ అని దుమ్మెత్తి పోయడం కాదు.

సర్వభూతాలనూ పరమేశ్వర రూపంగా భావించి, అహింసావ్రతంతో సత్య వాక్పాలనంతో, పరోపకారదృష్టితో, పవిత్రంగా జీవితం గడపడం. ఏ మతానికైనా యివే పరమధర్మాలు.

⌘ **పుణ్యకార్యాలు చేస్తే పాపాలు నశిస్తాయా?**

నశించవు. ఈ విషయాన్ని రామాయణంలో హనుమంతులవారు స్పష్టం చేశారు. రావణా! ఇంతవరకూ నీ పుణ్యకర్మల ఫలం అనుభవించావు. ఇంక పాప ఫలం నీ నెత్తిమీదకు వస్తుంది అని. దేని దారి దానిదే.

⌘ **పెళ్లికీ, చావుకీ కూడా మంత్రాలు చదువుతారు, వాటి విలువ ఏమిటి?**

అక్కడా, యిక్కడా ఒకే మంత్రం కాదండి!

⌘ **రామాయణాన్ని సృష్టించిన వాల్మీకి కంటె రామానందసాగర్ గొప్పవాడు కదా!**

రామానందసాగర్‌ని గొప్ప ధనవంతుని చెయ్యడానికి రామాయణం వ్రాసినవాడు వాల్మీకి.

⌘ **పర్వదినాలలో ఆలయాల దగ్గర అశ్లీలపు సినిమాలూ, సినిమా పాటలు, నాట్యాలూనా?**

ఇలా ప్రశ్నించే బదులు పదిమంది కలిసి ఆ అత్యాచారాల మీద దాడిచేసే ప్రయత్నం చేయండి.

⌘ **రఘువంశం అంటారు కానీ రామవంశం అనరేం?**

అసలు సూర్యవంశం, తరువాయి ఇక్ష్వాకు వంశం, అనంతరం రఘు వంశం. ఈ వంశంలో రాముని మించినవారే వీరంతా, కాని వారి చరిత్ర వ్రాసే వాల్మీకి దొరకనందున మనకు రాముడు గొప్పవాడయ్యాడు. ఒక భక్తి మార్గాన చెప్పాలంటే మానవవంశాలకు అవతారాలు కర్తృత్వం వహించ మంటారు సంప్రదాయజ్ఞులు.

**⌘ రాజసూయ యాగ సమయంలో భీమాదులు జనకునీ, విభీషణునీ ఓడించారా?**

సాధారణంగా తాత పేరు మనవడికి పెడతారు. అలానే ఆ వంశాల ప్రపితా మహుల పేర్లు కల పాలకులుంటారు కదా.

**⌘ రామాయణ హనుమంతుడే భారతంలోనూ వున్నాడా?**

ఉన్నాడని అంటున్నారు, ఆయన చిరంజీవి కనక.

**⌘ దేవునికి అందరూ సమానులే అయినప్పుడు శేషవస్త్రాలూ, పూర్ణకుంభాలూ కొందరికేనా?**

మేము మీ సేవకులం అని మన కాళ్ళు పట్టి ఎన్నికలలో నెగ్గిన నాయకులు న్యాయస్థానంలో దోషులుగా నిరూపితులైనా శిక్షపడదూ. తెలుసుగా! న్యాయం అందరికీ సమానం. రాజ్యాంగంలో దేశ పౌరులందరికీ అన్ని సమానావకాశాలు అనుగ్రహించినా రిజర్వేషన్లు తప్పలేదు. అటువంటి ఏలుబడిలో పూర్ణకుంభాల గురించి బాధ దేనికి.

**⌘ తాళిబొట్టు అమ్మాయిలకే ఎందుకు కట్టాలి?**

అబ్బాయిలకు కట్టడం మొదలుపెడితే అమ్మాయిలకు కట్టకూడదా అని అడగకుండా ఉండగలరా!

**⌘ పసుపు, కుంకుమ శుభకార్యాలలోనే వాడుతారేం?**

నిత్యం కాలికి, ముఖానికి పసుపు రాసుకుని, కుంకుమ తిలకం దిద్దుకునే రోజులలో యిన్ని చర్మవ్యాధులుండేవి కావు. అంత ఆరోగ్యం అవసరం లేదనుకుని యిప్పుడు శుభకార్యాలకు పరిమితం చేశారు.

**⌘ విశ్వామిత్రుడు మేనక కోసమే తపస్సు చేశాడా? నాగాభరణాలు ధరించాడా?**

మేనక కనిపించేసరికి మనసు మదనవ శీభూతమైపోయింది. మనసు ఏకాగ్రం

కాలేదు. అంతేకాదు, ఆ తరువాయి రంభ వస్తే మళ్లీ చెదిరింది. మనస్సు వశం తప్పడం తన దోషం అని గ్రహించక క్రోధంతో రంభను శపించాడు. కామ క్రోధాలు చావనివాడి తపస్సు నిష్ప్రయోజనం అని అప్పటికి తెలుసుకున్నాడు. ఈ దురవస్థలు లేకుండానే బ్రహ్మర్షియైన వాడు వశిష్ఠుడు. నాగాభరణాలూ, వెల్వెట్ బట్టలూ విశ్వామిత్రుడెరుగడు. సినీమాయాజాలం అది.

**⌘ దుర్యోధనుడు సైనికుడితో కత్తియుద్ధం చేస్తాడా?**

అటువంటి దురభిమాని ఎంతకయినా దిగజారుతాడని చోప్రాగారి భారత కర్త భావించాడు. వ్యాసమునీంద్రుడు అంత చౌకగా దింపలేదు దుర్యోధన పాత్రను.

**⌘ పాండవులు ఒకే వస్త్రంతో వనవాసం చేశారా?**

వనవాసం చేసేవారు నారచీరలు ధరిస్తారు, అవి అరణ్యాలలో ఉండే మునీశ్వరులందరూ ధరించేవి. అక్కడే దొరుకుతాయి. అప్పటికి వస్త్ర వ్యాపారం లేదు. వస్తు వినిమయమే వుండేది.

**⌘ పువ్వులమ్మిన చోట కట్టెలమ్ముకోవడం?**

పువ్వులమ్మే వారికున్న గౌరవం, కట్టెలమ్మే వారు పొందని రోజులలో పువ్వులు శుభప్రదమైనవనీ, కట్టెలు వల్లకాటికనీ భావించే రోజులలో ఈ సామెత పుట్టిందనుకుంటా.

**⌘ సుందరకాండ వచనం పారాయణం చేయవచ్చునా?**

పారాయణం చేసేవారు శ్లోకాలలో బీజాక్షరాలున్నాయని విశ్వసించి చేస్తున్నారు. అలాకాక మానవ జీవితానికి సుందరకాండలో లభించే సందేశం తెలుసుకోవాలనుకున్నవారు వచనం చదువుకోవచ్చు.

దేనికైనా మనస్సు ప్రధానం.

**⌘ అందరికీ దేవుని చూడాలని ఉంటుంది. మరి దుర్మార్గులకెలా సాధ్యం?**

చూడాలని ఉన్నంతలో దైవం సాక్షాత్కరించదు. దుర్మార్గులైన తమ పాపకార్యాలు, అన్యాయాలు విడిచి మనసు నిర్మలం చేసుకుని సత్కార్యాలు చేస్తే సులభంగా దర్శనమవుతాడు.

⌘ **తల నీలాలిస్తే కోరికలు తీరుతాయా?**

ప్రధాని పదవివస్తే తలనీలాలివ్వడానికి మొక్కుకునేవారు మూడు వేల మంది వుంటారు. కాని ఒక్కడికే పదవి వస్తుంది, మిగిలినవారు తమ గ్రామంలోనే గుండు కొట్టించుకుంటారు. అంటే వెంట్రుకలు లంచం పట్టి పదవులివ్వడం పరమేశ్వరుడి పని కాదు.

⌘ **విశ్వామిత్రునికి వివాహమైనదా?**

రామాయణ భారతాలకు సంబంధించినంతవరకూ వివాహం కానివారు ముగ్గురే ముగ్గురు. అందులో మొదటివాడు రామదూత హనుమంతుడు, భారతంలో బ్రహ్మచర్య దీక్ష వహించినవాడు భీష్మ పితామహుడు, మూడవవాడు స్త్రీ పురుష భేదం తెలియని శ్రీ శుకయోగీంద్రుడు. మిగిలిన వారందరూ సంసార తాపత్రయంలో తలలు మునిగినవారే.

ఆ మిగిలిన అశేషజనంలో వాడు విశ్వామిత్రుడు. తపోదీక్షలో వుండగా కూడా సంసారం చేసి సంతానాన్ని కన్నవాడు విశ్వామిత్రుడు. అయితే రామాయణంలో విశ్వామిత్రునికి హరిశ్చంద్రుని కథతో సంబంధంలేదు. భారతంలోనూ హరిశ్చంద్రుడు లేడు. నిశితంగా చూస్తే విశ్వామిత్రుడనే పేరుతో చాలామంది వున్నారనిపిస్తుంది.

⌘ **వేదాలు నాలుగే కదా, భారతం పంచమవేదం ఎలా అయింది?**

నాలుగు వేదాలలోని ధర్మ విషయాలను సామాన్యులకు అందించినది కనుక దానిని అయిదవ వేదంగా మనం అందుకున్నాం.

⌘ **శకుని హస్తినాపురంలోనే ఎందుకుండిపోయాడు?**

దుర్యోధనుని వంటి మేనల్లుడు, ధృతరాష్ట్రుని వంటి బావమరదులు ఉన్న కొంపల్లో చేరే మేనమామలందరికి ఉపాధి కల్పించి వారిని సర్వనాశనం చేసే విద్య నేర్పడానికి వుండిపోయాడు. ఈ రహస్యం తెలుసుకున్నవారు అటువంటి మేనమామలను తరిమికొట్టాలి.

⌘ **నన్నయ్య తిక్కనలకు బిరుదులు లేవన్నారు, కాని ఆదికవి, ఉభయకవి మిత్రుడు బిరుదులు కావా?**

తెలుగు సాహిత్యానికి శ్రీకారం చుట్టినవాడు కనక ఆదికవి, సంస్కృత ఆంధ్రభాషల కవులకు సన్నిహితుడు కనక ఉభయ కవి మిత్రుడు. ఇవి బిరుదులు కావు. వాస్తవ విషయాలు.

**❋ శివప్రసాదం తినకూడదా?**

ప్రసాదాలూ, వ్రతాలూ అన్నీ ఇటీవల వచ్చిన ఆచారాలు, శివకేశవులను ఏకరూపంగా భావించి స్మరించి మనసు నిర్మలం చేసుకోవాలని మహనీయులు బోధిస్తున్నా ప్రసాదాల మీద భక్తి తగ్గడం లేదు. అందుకే తిరుపతి లడ్డూ ధర పెరుగుతున్నది.

**❋ పెద్దల పట్ల గౌరవం చూపని యువతరం పట్ల ఏవగింపు కలగదా?**

తల్లిదండ్రులనూ, గురువునూ ఆదర గౌరవాలతో చూడవలసిన విధానాన్ని ఏ విద్యాలయమైనా నేర్పుతున్నదా, కనీసం పిల్లల పెంపకంలో పెద్దలు ఏమాత్రం బాధ్యత తీసుకుంటున్నారు. మూడేళ్ళు రాకుండానే వాళ్ళను కాన్వెంటులో పారేసి హాస్టళ్ళలో పెట్టి వాళ్ళకు తల్లి, తండ్రీ చూపవలసిన ప్రేమ, వాత్సల్యం చూపుతున్నారా!

మనకే ఆ బాధ్యత లేనినాడు కిరాయి పుచ్చుకునే ఉద్యోగులు మన పిల్లలకు నీతి, శీలం నేర్పుతారనుకోవడం భ్రమ.

**❋ పెళ్ళి చూపులలో ఒకరినొకరు చూసుకున్నాక పెళ్ళి సమయంలో తెర ఎందుకు?**

పెళ్ళిచూపులు లేని రోజులలో, సాంప్రదాయబద్ధంగా కన్యాదానం చేసే రోజులలో వధూవరుల స్పర్శ, దర్శనం శుభసమయంలో జరిపే ఆచారం వుండేది. కన్యాదానం కాక వరవిక్రయం వచ్చి, గుణశీలాల కంటె వేలం పాట రేటు పెరిగినా ఆ ఆచారం సాగుతూండడం అనవసరం.

**❋ అల్లా, ఏసు వలె మనకున్నవారెవరు?**

అల్లా మహమ్మదీయ మతప్రవక్త. ఏసు క్రైస్తవులకు దేవుని బిడ్డ. మనకు అసలు మతం లేదు కనక ప్రవక్త లేడు. మన సిద్ధాంతానుసారం దేవుడు దిగి రావాలి కాని ఆయన కుమారుడో, మరో దూతయో వస్తే అంగీకరించే సాంప్రదాయం లేదు.

అందుచేత మనకలా ఒక్కరితో కుదరలేదు. అవతారాలు కాక బ్రహ్మ,

శివుడు, అయ్యప్ప, కాళిక, కనకదుర్గ, అంతేకాక శంకరుడు, రామానుజులు, మధ్వాచార్యులు, విద్యారణ్యులు, వివేకానందులు ఇలా ఎందరెందరో ఎప్పటికప్పుడు అవతరించి మనలో అధర్మం పెరగకుండా, దానవత్వం, పిశాచబుద్ధి ప్రకోపించకుండా వేదధర్మం ప్రబోధిస్తుంటారు.

**⌘ నిరాకారుడు, నిర్గుణుడు అయిన దేవునికి రూపాలెవరు కల్పించారు?**

నిర్గుణ పరబ్రహ్మాని ఉపాసించే స్థితి మనస్సుకు కలిగేవరకూ సాకారుడు సగుణుడు అవసరం అని భావించిన భక్తులు చేసిన ఉపకారం అది.

**⌘ రామకోటి రాస్తారే కాని శివకోటి, విష్ణుకోటి వ్రాయరేం?**

శివకోటి వ్రాస్తున్నారని వింటున్నా, ఏ కోటి రాసినా రాసే సమయంలో అయినా మనస్సును ఆ పరమాత్మయందు లగ్నం చేయడం ప్రధానం.

**⌘ అర్చనలు, మ్రొక్కుబడులు ముక్తినివ్వనప్పుడు జీవాత్మ పరమాత్మలో లీనమయే మార్గం ఏది?**

తెల్లవారి లేచింది మొదలు అర్ధరాత్రి వరకూ సాంసారిక తాపత్రయాలతో సతమతమవుతూ, తరతరాల వరకూ డబ్బు కూడబెట్టడానికే జీవితాన్ని వ్యర్థం చేయకుండా కొంత సమయాన్ని పరమేశ్వరుని యందు లగ్నం చెయ్యడానికి అర్చనలూ, మ్రొక్కుబడులూ ఏర్పడ్డాయి.

అర్చన చేసేటప్పుడు, మ్రొక్కుబడులు తీర్చడానికి వెళ్లేటప్పుడు కూడా మన మనస్సు కోరికల మాలిన్యాలతో ఉంటే ఫలితం లేదు. అర్చన పేరిట ఉదయం, సాయంత్రం మనస్సును ఏకాగ్రం చేయడం అలవాటు చేస్తే ఆత్మకూ పరమాత్మకూ భేదం రాదు.

అర్చనలతో మ్రొక్కుబడులతో నిమిత్తం లేని యోగాభ్యాసం వున్నది సమాధిస్థితి వున్నది.

ఇవన్నీ రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి సాధించినవి.

**⌘ అన్ని క్లేశాలు పడిన సీతారాములనే ఆదర్శంగా తీసుకోవాలా?**

క్లేశాలలోనే ఒకరికొకరు తోడుగా వుండాలి. సిరిసంపదలు మూలుగుతూ వున్నప్పుడు మన చుట్టూ చాలామంది చేరుతారు, చెరువు నిండా నీరుంటే

కప్పలు కుప్పలు కుప్పలుగా చేరినట్లు.

⌘ **ప్రశాంత చిత్తంతో రోగులకు సేవ చేసే లేడీడాక్టర్లను ఇంటికి రాగానే మడీ, ఆచారం నాశనం చేస్తున్నారనడం?**

మడీ, ఆచారం పట్టుకు ప్రాకులాడేవారు అసలు ఆడపిల్లను చదివించకుండా మడిగా పెంచితే సరిపోయేదిగా. మడి, ఆచారం అనేది బాహ్యాడంబరం. ప్రధానమైనది మానవసేవలో మనసు నిర్మలంగా ఉంచుకోవడం. అది లేనినాడు అంతా వ్యర్థం.

⌘ **దేవునికి నమస్కరిస్తూ కన్నులు మూస్తారేం?**

పైకి కనిపించే ఆ పరబ్రహ్మను మనసులో నిలుపుకోవడానికి.

⌘ **అన్ని మతాల సారం ఒకటే అయినప్పుడు మతాలు యిన్ని ఎందుకు పెట్టారు?**

మనిషి మనసు అతి విచిత్రమైనది. ఒక్కో మనసు ఒక్కో నామాన్ని, ఒక్కో రూపాన్ని, ఒక్కో విధానాన్ని యిష్టపడుతుంది. అందుకు అణుగుణంగా అన్నీ పుట్టాయి.

⌘ **కలియుగంలో తపస్సు సాధ్యమా?**

చేసే దృష్టి కలవారికి ఏ యుగంలో అయినా సాధ్యమే, అది లేనివారి కోసమే భక్తిమార్గం అనుగ్రహించారు. కనీసం రోజూ పదినిమిషాలు మనస్సు ఏకాగ్రం చేసి దైవాన్ని స్మరిస్తే చాలు తపస్సు చేసిన ఫలితం వస్తుందని పెద్దలు ఘోషిస్తున్నారు.

⌘ **దేవుని పేర జరిగే ఉత్సవాలలో అశ్లీలపు పాటలూ, దోపిడీ సినిమాలూ, నగ్ననాట్యాలూ?**

ఇలా తయారయ్యింది మన సంస్కారం. ఏవన్నా అంటే హరికథలకూ, పురాణాలకూ జనం రారు అంటున్నారు. అంటే దేవుని ఉత్సవాలకు జనం రారు కనక బూతుపాటలూ, ప్రదర్శనలూ పెడుతున్నామంటున్నారు.

ఈ అసభ్యాలన్నీ దేవుని పేర దేనికి? వారి వారి అభిమాన నటుల, నటీమణుల ఉత్సవాలు జరుపుకుంటే ఒదిలిపోతుందిగా.

**⌘ ఆలయాలలో ఉన్న రాతిబొమ్మలు దేవుళ్ళు కారనీ, అసలు దేవుని చూపితే కాని నమ్మమనీ....**

ఆలయాలలో వున్నవి రాతిబొమ్మలే, అయితే ఆ రాయిలో దైవత్వాన్ని చూసే మనస్సు మనలో వుండాలి. ఇంకా మన మనస్సు పెరిగే అదృష్టం వుంటే మనలోనే పరమాత్మ ఉన్నాడు. అందుచేతనే దైవాన్ని ఎవరూ దూషించ లేరు.

కన్నులు మూసి, మనసు ఏకాగ్రం చేస్తే ఆత్మ రూపంలో ఉన్న పరమాత్మ సాక్షాత్కరిస్తుంది. ఆ సాక్షాత్కారమార్గాన్ని గురువులు చూపిస్తారు. మార్గం చూపుతారే కాని దైవాన్ని చూపగలవారుండరు.

**⌘ భీష్ముడు నేలకూలకపోతే పాండవులకు విజయం దొరకునా?**

అయితే గియితే గురించి తలలు పాడుచేసుకోకండి. దుర్యోధనుడి వంటి దుర్మార్గులు నెగ్గరాదని భీష్ముడే అస్త్రసన్యాసం చేశాడని భారతం చదివితే తెలుస్తుంది.

**⌘ దేవుని ఆభరణాలు, హుండీలో సొమ్ము అపహరిస్తుంటే దేవుడేం చేస్తున్నాడు?**

దైవానికి ఆభరణాలు, ముడుపులు అవసరం లేదు. ఆయన కావాలను కుంటే మొత్తం గనులనే కైంకర్యం చేసుకుంటాడు.

**⌘ కొందరిని దహనం చేస్తారు, కొందరికి ఖననం..?**

అవన్నీ ఆయా సంఘాలు పెట్టుకున్న ఆచారాలు. ఈనాడు ఖననాలు పూర్తిగా ఆగకపోతే ఉన్న జనాభాను పాతిపెట్టడానికి భూగోళం చాలదు.

**⌘ పెళ్ళికి తాలిబొట్టు అవసరమా?**

జీలకర్ర, బెల్లం పెట్టి ప్రమాణం చేసి, సప్తపది జరిపితే చాలు పెళ్ళి అయినట్లే. అయితే తాళిబొట్టు, తలంబ్రాలు, ఊరేగింపులూ యివన్నీ ఆయా ప్రాంతాలవారు తీరుబడిగా సుఖంగా వున్న రోజులలో ఏర్పాటు చేసుకున్న వేడుకలు అంతే.

**⌘ ఉపపాండవులు ఎప్పుడు పుట్టారు?**

వనవాసానికి ముందు ఇంద్రప్రస్థంలో వుండగానే ఉపపాండవులు పుట్టారు. అంతకుముందే అభిమన్యుడు ప్రభవించాడు. అడవికి వెళ్ళేటప్పుడు ఉపపాండవులు వారి తాతగారింటికి వెళ్లారు. అభిమన్యుడు సుభద్రతో ద్వారక వెళ్లాడు.

**⌘ రామాయణ కాలంలో విమానాలున్నాయా?**

ఉన్నాయి. అంటే వీడెంత అవివేకి అనేవారు రామాయణంలో రావణ సంహారనంతరం రాముడు విమానం మీద వెడుతూ సీతాదేవికి చూపించిన సన్నివేశాలు పరిశీలిస్తే విమానం ఎక్కనివాడు ఆ విధంగా వర్ణించలేడని వివేకం కల మేధావులకు తెలుస్తుంది. అయినా నమ్మలేని వారుంటే తాము పట్టుకున్న కుందేలుకి మూడే కాళ్లు అనుకునే ధీమంతులు, వారికి రెండు చేతులూ జోడించి దూరంగా వుండండి.

**⌘ రామాయణం కంటే భారతం విశిష్టమైనదెందుచేత?**

భారతం విశిష్టమైనదని మనం అనుకుంటున్నాం. నిజానికి రామాయణమే మహోదాత్తమైనది. అయితే భారతం మన దుర్గుణాలకు దగ్గరగా వున్న వ్యక్తులతో నిండి వుంది. సమాజంలో దుర్యోధనులున్నారు. ఆడది ఒంటరిగా కంటపడితే కీచక సైంధవుల వలె వెంటబడే వారున్నారు. శాసనసభలో వస్త్రాపహరణం చేసే దుశ్శాసనులున్నారు. భారతంలో పాత్రలన్నీ మన అన్నగార్ల వలె వుంటాయి కనక దానికంత గొప్పతనం వచ్చింది.

పితృవాక్పాలనకు రాముని వలె రాజ్యం వదిలేవాడేడి! అడవుల పాలైన భర్త వెంట వచ్చే సీతాదేవి ఎక్కడుంది. అన్ని భోగాలు వదిలి అన్నగారిని సేవించే లక్ష్మణ స్వాములున్నారా?

రామాయణంలో మానవుడు ఎలా వుండాలో చూపించారు. ఎలా వుంటాయో భారతం ప్రదర్శించింది.

**⌘ ధైర్యే సాహసే లక్ష్మీ అని ఎందుకంటారు?**

పిరికివాడు ఎందుకూ కొరగానివాడు.

ఏ పనీ చెయ్యని సోమరిని లక్ష్మి వరించదు.

⌘ **దేవుని ధ్యానించకుండా పూజించకుండా వుంటే దేవుడు కరుణించడా?**

ధ్యానం, పూజ లేనప్పుడు దేవుడున్నాడనే భావమే వాడికుండదు. ఇంకా ఆ దేవుడి కరుణ దేనికి?

⌘ **భార్యాభర్తలను చిలకా గోరింకలంటారేం?**

చిలకలూ, గోరింకలూ ఒక్కసారి జోడు కడితే వీడిపోవు.

⌘ **ఈ కాలంలో ఎవరూ ఆరోగ్యంగా బ్రతకలేయవ?**

హత్యలూ, అత్యాచారాలు, నిందలూ, అపనిందలూ, ప్రమాదాలూ, మరణాలూ నిండిన పత్రికలు చదవకుండా, సినిమాలు చూడకుండా, రేడియో వినకుండా ఉంటే నూరేళ్ళు ఆరోగ్యంగా బ్రతకవచ్చునని అలా వుండగలిగిన వారంటున్నారు.

ఓ వారం ప్రయత్నించండి. ఎందుకంటే అనేక రోగాలకు కారణం మనస్సు దుర్బలం కావడమే అని వైద్యులు అంటున్నారు.

⌘ **వశిష్ఠుని గోవును అపహరించడానికి విశ్వామిత్రుడు సైన్యాన్ని పంపించాడా?**

రామాయణంలో విశ్వామిత్రుడే ఆ పనిచేశాడు. విశ్వామిత్రుని అహంకారం దురభిమానం తెలియనివారు ఆ కథను మార్చి మీకు చూపిస్తున్నారు. అందుకే రామాయణం, భారతం వచన గ్రంథాలైనా కొని దగ్గర ఉంచుకుని దూరదర్శన్ తమాషాలూ చూస్తూండండి. కాళిదాసు కవిత్వానికి వీరి పైత్యం ఎంత జోడిస్తున్నారో తెలుస్తుంది.

⌘ **భారతం చూస్తుంటే దీనికి శకుని నాయకుడులా ఉన్నాడే?**

నేటి రాజకీయరంగం అంతా శకుని సంతానమే కనుక మీరు చూసే భారతం శకుని నడుపుతున్నాడు. అది కాల ప్రభావం.

⌘ **ఎన్నికలలో గూండాలకు, హంతకులకు స్థానం లేని రోజు రాదా?**

ఆ మాట గట్టిగా అనకండి. మన చుట్టూ వారే ఉన్నారు. ధనలోభులు, హంతకులు పాలకులవుతారని వ్యాసులవారు మహాభారతంలో చెప్పారు. అంతేకాదు, పన్నులు పిండేవారే తప్ప ప్రజల క్షేమం చూసే వారు ఉండరనీ

చెప్పారు.

**⌘ వరకట్నం కాక వియ్యంకుల కట్నాలున్నాయా?**

వియ్యపురాలికి, ఆడపడుచులకి లాంఛనాల పేరిట దోచుకునే వారూ ఉన్నారు. ఈ కాలంలో వస్తువు మీద ఉండే మోహం మనుషుల మీద లేదు. ఇదంతా కూడగట్టుకుపోగలమని వారి ఊహ. కాని ఎలా పుట్టామో అలాగే వెళ్ళిపోతామని తెలుసుకోలేని మూర్ఖులు పెట్టిన లాంఛనాలకు బలి అవుతున్నారు సంసారులు.

**⌘ కర్ణుడు వల్ల ఎవరికీ లాభం నష్టం జరగలేదు కదా మరి ఈ పాత్ర దేనికి?**

మీరు భారతం చదివారా, విన్నారా, చూశారా! కర్ణుడు లేకపోతే భారతమే లేదని చదివినవారు, చూసినవారు చెబుతున్నారు. చదవండవి.

**⌘ మనుషులంతా ఒక్కటే అయినప్పుడు భగవంతుడు తన సృష్టిలో భాష కూడా ఒకటే పెట్టరాదా!**

మనుషులంతా ఒక్కటే అనే భావం చాలా మంచిదే! కాని ఈ సృష్టిలో ఆ భావం సాధ్యమా. జాతులు, మతాలు, కులాలు వర్గాలు ఎన్ని తేడాలు. ఒక తల్లి కడుపున పుట్టిన పిల్లల్లోనే ఆకారాలలో, గుణగణాలలో ఎన్ని రకాలు.

ఈ రహస్యం తెలియక గాలికి కులమేది, నీటికి కులమేది అని పాడుచుకునే వారి అమాయకత్వం చూసి జాలిపడాలి.

కొండగాలి, పడమరగాలి, సముద్రపుగాలి, ఎడారిగాలి, అడవిగాలి అలానే గోదావరి నీరు, కృష్ణ నీరు, గంగ నీరు, కావేరి నీరు ఒకటి కావు.

శాస్త్రవేత్తలంతా ఒప్పుకున్న సత్యం యిది. కొన్ని రోగాలకు గాలి మార్పు కావాలంటే అర్థమేమిటి? అంతటా ఉన్న గాలి ఒక్కటి కాదు. ఇంక భాష ఎలా ఏకమవుతుంది.

**⌘ దేవుడు పాపులను రక్షిస్తాడా?**

దుష్టశిక్షణ చేస్తానంటాడు దేవుడు భగవద్గీతలో. అది తెలిసినవారు పాపకార్యాలకు దూరంగా వుంటారు. పాపులను రక్షించును అనే నమ్మకం

పెరిగితే పాపాచారాలు పెరుగుతున్నాయి చూశారుగా.

**⌘ శకుని పాచికల రహస్యమేమి?**

ఇంద్రజాలం చేసేవారు పేకముక్కలు కలపడంలో చేసే మోసమే శకుని పాచికలు గలగలలాడించి విసరడంలో నేర్చుకున్నాడు. వాని చేతిలో పాచికలు వాడికి కావలసినట్లు పలుకుతాయి. అంతే.

**⌘ వీర్య నష్టం వల్ల అనారోగ్యం రాదంటారేం?**

అయినప్పుడు శుక్లనష్టానికి వైద్యం ఎందుకు చేస్తున్నారో.

**⌘ పాపపుణ్యాలు భగవంతుడే చేయిస్తే శిక్ష మనమెందుకు అనుభవించాలి?**

భగవంతుడు చేయించేది మనచేత కనక అనుభవం కూడా మనకే యిస్తాడు. అయితే చేయించేది చేసేదీ అనుభవించేదీ భగవంతుడే అనే జ్ఞానం మనస్సులో స్థిరపడితే ఏ బాధా ఉండదు. అది స్థిరపడడానికి నిర్మల హృదయంతో మనసును ఏకాగ్రం చెయ్యాలంటారు.

**⌘ సినిమాలకూ, తీర్థయాత్రలకూ బోలెడు ఖర్చు చేస్తారు కాని పేద ముష్టివాడికి పైసా...?**

సినిమాలు తీసి ఆడించేవారు, తీర్థక్షేత్రాలలో భక్తుల మీద ఆశలు పెంచుకునేవారు పెద్దముష్టివాళ్ళు. వారినీ పోషించేవారుండాలి.

**⌘ అహల్యను రాయిని కమ్మని శపించలేదా?**

శపించలేదని వాల్మీకి రామాయణం. కాని తరువాయి కాలాలలో వచ్చే సినిమా ప్రేక్షకుల కోసం రాయిని చేసి దాన్ని మళ్ళీ మనిషిని చేశారు.

**⌘ రామాయణ భారతాలలో ఏది మార్గదర్శకం?**

ఏ మార్గాన నడిస్తే మనిషి దేవుడవుతాడో రామాయణం చెపుతోంది. ఏ దారిని నడిస్తే భీష్మ, ద్రోణ, కర్ణాది రథికులూ, 11 అక్షౌహిణీల బలం వున్నా సర్వనాశనం అవుతామో భారతంలో దుర్యోధనుడు చెపుతాడు.

అంటే అధర్మపరులను ఎలా నాశనం చెయ్యాలో భారత కృష్ణుడు నేర్పుతాడు. వెరసి మానవుడెలా వుండాలో రామాయణం చెపితే, ఎలా వుంటాడో భారతం

చెపుతుంది. ఈ దృష్టితో రెండూ చదవండి. మీరే చెపుతారు రెండూ ఎందుకు మార్గదర్శకాలయాయో, అవుతున్నాయో, అవుతాయో...

⌘ **వశిష్ఠుడంతవాడు పట్టాభిషేకానికి ముహూర్తం పెడితే అది వనవాసానికి దారి తీసిందా?**

చిన్న రహస్యం, పట్టాభిషేక ముహూర్తం కులగురువు పెట్టలేదు. దశరథుడే స్వయంగా పెట్టుకొచ్చి సభలో ప్రకటించాడని వాల్మీకి రామాయణం. చదివారా మీరు.

⌘ **అర్జునుని చంపవద్దని కుంతి కర్ణుని కోరిందా..?**

ఏ భారతంలో చదివారు ఈ వరం. ధర్మజ, భీమ, నకుల, సహదేవులను చంపమని కర్ణుడే కుంతికి వరమిచ్చి, అర్జునుడు దొరికితే చంపి తీరుతాను, లేదా వాని చేతిలో నేలకూలుతాను. దీనికి తిరుగులేదు... అన్నాడని వ్యాస భారతం ఉద్యోగపర్వం చివర కనిపిస్తుంది.

⌘ **లక్షలు ఖర్చు చేసి తీర్థయాత్రలు చేసే కంటే ఆ లక్షలతో పేదవారి ఉద్ధరణ చేయరాదా?**

అలా చెయ్యలేనివారు మీ తిరుపతి వెంకన్న పేర అర్పించే లక్షలతో ఎన్ని వేలమందికి ఉద్యోగాలిస్తున్నారు. ఎన్ని లక్షల మందికి ఈ అన్నదానం చేస్తున్నారో చూస్తున్నారా? అంతకంటే పాయిఖానాల, వంతెనల, భవనాల ప్రారంభోత్సవాలకు, శంకుస్థాపనలకు లక్షలు తగలేయకుండా ఆ సొమ్ము పేదవారి సేవకు వినియోగించే ప్రభుత్వం రావాలని ప్రార్థించండి.

⌘ **రామకృష్ణ పరమహంస, వివేకానంద, గాంధీ, బుద్ధుడు మానవులా? దైవాంశ సంభూతులా?**

మానవులుగా పుట్టి తమ జీవిత నిర్వహణ ద్వారా దైవాంశ సంభూతులని పిలుచుకుంటున్నారు.

⌘ **బౌద్ధాన్ని అణగద్రొక్కడానికి ఆర్యులు రామాయణ కావ్యం సృష్టించారంటే?**

కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకూ ప్రజలను ఆకర్షించిన బుద్ధుని మతం ఒక్క కథతో అణగిపోయిందంటారా. నిజంగా అంతశక్తి ఆ కథలో వుంటే

మనమంతా రామాయణాన్ని పారాయణం చేయవలసిందే.

అదే నిజమయితే మరి మళ్ళీ అలాంటి కథ కట్టగల మరో బుద్ధుడు పుట్టి రామాయణాన్ని పాతిపెట్టి ఉండడంటారా. ఈ ప్రచారాలన్నీ ఇంగ్లీషువాడి తలక్రిందులు బుద్ధి నుండి వచ్చిన కట్టుకథలు. వాడు పోయినా వాడు నాటిన విషబీజాలు యింకా మన బుర్రల నుండి పోవడం లేదు.

**⌘ శ్రీ అంటే లక్ష్మి కదా, మరి పురుషుల పేర్ల ముందుంచుతారేం ఆ శబ్దం?**

పురుషుల పేర్లకే కాదండి, శ్రీమహాకాళీ, శ్రీ మహాలక్ష్మీ, శ్రీ సరస్వతీ అని పూజిస్తారండీ. ఇంగ్లీషు వాసన సోకి శ్రీని శ్రీమతిగా పెంచుకుంటూ వస్తున్నాం. శ్రీ అంటే లక్ష్మి అనేది ఒక అర్థం. శుభానికి, సంపదకు, గౌరవానికి శ్రీని వాడడం మన ఆచారం.

**⌘ బైరాగులు గంజాయి పీల్చేవారట, ఇప్పుడు కాలేజీ పిల్లలు డ్రింకుకి అలవాటు పడుతున్నారే?**

డిగ్రీ పుచ్చుకుని బైరాగుల్లో కలవాలిగా? ఈనాటి చదువుల పర్యవసానం అంతే అని.

**⌘ జ్ఞానపీఠం బహుమతికి నియమాలు చెప్పండి?**

అది తెలిస్తే తెలుగువారు పుష్కరం తపస్సు చేసేవారా? మరో రెండు పుష్కరాలు కృషి చేయండి.

**⌘ హస్తినాపురం ఇంద్రప్రస్థం కాదా?**

కాదు, పాండవులు వేరే నిర్మించుకున్న రాజధానీ నగరం ఇంద్రప్రస్థం. అక్కడే మయసభ కూడా ఉండేది.

**⌘ ఆస్తికవాదం భౌతికవాదాన్ని ఒప్పించగలదా?**

వాదాలు ఒప్పించడానికి కాదు, వాదించేవారి శక్తిని ప్రదర్శించడానికే. ఆస్తికులు పుట్టిననాడే భౌతికవాదులూ పుట్టారు. ఈనాడు గతితార్కిక భౌతికవాదం శిరోధార్యం అని ప్రచారం చేసిన సోవియట్ రష్యా మేధావులు ఆస్తికవాదాన్ని స్వీకరించడం వినిన తరువాత అయినా ఈ దేశ భౌతికవాదులు ఈ భూతకోటికి అతీతమైనదని ఉన్నదని అంగీకరించడానికి మరో దశాబ్దం

పట్టవచ్చు.

**⌘ ద్రౌపది కర్ణుని ప్రేమించెనా?**

ఈ ప్రేమ వ్యవహారం వ్యాసుల వారెరుగరు, ఈ దశాబ్దపు పైత్యాలివి.

**⌘ స్త్రీ వ్యామోహం పనికిరాదని బోధించిన కృష్ణునికి పదహారు వేల గోపికలా?**

పదహారువేల గోపికలని చెప్పిన వాడెవడు? అంతమంది రాచకన్యలను నరకుడు చెరపట్టగా వారిని విడిపించి, వారి కోరిక మీద వివాహమాడాడు. సుఖ సంసారం వారికి అనుగ్రహించాడు.

అయితే పదహారువేల మందికి దాంపత్యజీవిత సుఖం ఎలా ప్రసాదించాడో భాగవతం చదివితే బోధపడుతుంది. వ్యామోహం ఆయనకున్నదో, వింటున్న వారికున్నదో గ్రహించాలని నారదుడు పరిశోధించి మనందరికీ తెలియజేశాడు.

ఈ ఘట్టం పోతనగారి భాగవతంలో రమణీయంగా చూపించారు. మీకర్థమయ్యే పద్యాలని చదవండి.

**⌘ ద్రౌపది కూడా భర్తలకు భోజనం పెడుతూ సణిగి సణిగి కంచాలలో అన్నం వదిలి పెట్టించిందా?**

ఈ సణుగుడు రోగం రచయిత యింట్లో వుంది కాబోలు, అలాగే ధృతరాష్ట్రుని స్వప్నం కూడా దూరదర్శనం వారి హ్రస్వదృష్టికి నిదర్శనం.

**⌘ వాల్మీకి వ్యాసులు రాయకపోతే రామాయణ, భారతగాథలు మనకు తెలిసేనా?**

వారు కాక మరెవరు వ్రాసినా తెలిసేవి కావు. అందుచేతనే రామాయణ భారతాల అనంతరం ఎందరెందరో ఎన్నెన్నో కథలూ, కావ్యాలూ వ్రాసినా మనకు తెలియడం లేదు. వారిని ఆరాధించి రామాయణ, భారతాలలోని కొన్ని ఘట్టాలు తీసుకుని వ్రాసిన కాళిదాసు, భవభూతి ఇన్నాళ్లు బ్రతికారు. తులసీదాసునీ, కవిత్రయాన్నీ ఈ నాటికి చదువుతున్నాం.

ఇప్పుడొచ్చే కథలు చూస్తున్నారుగా చదివిన మరునాడు జ్ఞాపకం ఉండడం లేదు. దానికి కారణం - మానవ మనస్తత్వాన్ని, సుగుణాలను, దుర్గుణాలను వాల్మీకి, వ్యాసులు చిత్రించినంత బలంగా మరెవరికీ సాధ్యం కాలేదు.

**⌘ శాస్త్రవిరుద్ధంగా వినిపించే సంగీతం, వాద్యాలు అమంగళకరాలయితే ఈ నాటి సినిమా సంగీతం అమంగళం కలిగిస్తున్నదా?**

అందుకు సందేహమా, ఈ సంగీతం వినడం వల్ల నరాలు బలహీనమై గుండెదడ, రక్తపు పోటు వంటి రోగాలు వస్తున్నాయని అమెరికా శాస్త్రవేత్తలు గోల పెడుతున్నారు.

**⌘ రాముడు దేవుడు కాదంటారా?**

ఎంతమాట సెలవిచ్చారు, భద్రాద్రిలో రాముడు దేవుడు. ఊరూరా ఆలయాలలో పూజలందుకుంటున్న రాముడు దేవుడు. మీ గుండెలో, నా గుండె గూటిలో వున్న రాముడు దేవుడు. కాని రామాయణంలో వున్న రాముడు రాజుగారి పెద్దబ్బాయి అని మరిచిపోవడం న్యాయం కాదంటాడు మహర్షి వాల్మీకి.

"ఆత్మానం మానుషం మన్యే
రామం దశరథాత్మజం"

ఈ మాట వాల్మీకి రామాయణంలోనే వున్నదని గ్రహించకపోతే మీకో నమస్కారం.

**⌘ అక్కగారి ఇంట్లో చేరి మేనల్లుళ్ళ నాశనానికి పరోక్షంగా కారణభూతుడైన శకుని ఆంతర్యం ఏమిటి?**

శకుని హృదయం ఈనాటి వారికి వింతగా కనిపించి పరోక్షంగా కురువంశ నాశనం చేశాడని భావిస్తున్నారు. ఇది చాలక తన సోదరికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం అనే ప్రబుద్ధులు కూడా పుట్టారు. కాని భారతం చదివిన వారికెవరికి ఈ ఊహరాదు. అదే నిజమైతే ద్యూత క్రీడలోనే పాండవులను గెలిపించి కౌరవులను నాశనం చేసేవాడు. తన సోదరి సంతానానికి సామ్రాజ్యం కట్ట బెట్టడానికే యిన్ని కుతంత్రాలు, జూదాలు సాగించాడని భారతం స్పష్టం చేసింది.

**⌘ అత్యాచారాలకూ, అన్యాయాలకూ మద్యపానం కారణం అని ఎరిగిన**

**నాయకులు దానిని నిషేధించరేం?**

నిషేధిస్తే తమ అన్యాయాలనూ, అత్యాచారాలనూ సమర్థించేవారి సంఖ్య తగ్గి తమ సింహాసనం విరిగి ముక్కలవుతుందని.

※ **చతుర్విధ పురుషార్థాలు పొందలేనివాడు మోక్షం పొందలేడా?**

ధర్మ అర్థ కామ మోక్షాలు- చతుర్విధ పురుషార్థాలు. మోక్షం ఇందులోనే ఉంది. ధర్మబద్ధంగా అర్థం సంపాదించి, ఆ అర్థాన్ని ధర్మ మార్గాన వినియోగిస్తూ కామభోగం అనుభవించేవాడు మోక్షపదం చేరుతాడు.

※ **ప్రజల కోసం ప్రాణాలు వదిలిన రాజులుండేవారా?**

రాజుల దాకా దేనికి, ఈ దేశప్రజలను దాస్యవిముక్తులను చెయ్యడానికి లక్షల ఆస్తి ధారపోసి, ప్రాణాలు విడిచిన దేశభక్తులుండేవారు. ఈనాడు ఉద్యోగాలు అమ్ముకునే పాలకులున్నారు. అంతగా ధనదాసులయ్యారు పాలకులు.

※ **వివాహాలు శాస్త్రోక్తంగా జరిగినా సంసారాలు ఛిన్నాభిన్నం అవుతున్నాయేం?**

శాస్త్రం సాంసారిక జీవిత విధానాన్ని బోధిస్తుంది. దాన్ని అనుసరించిన నాడు ఛిన్నాభిన్నం కావు. శాస్త్రం కంటే డబ్బు మన బుద్ధిని నడుపుతున్ననాడు సక్రమంగా సాగవు.

※ **దేవుడు మనం పెట్టే నైవేద్యం ఆరగిస్తాడా?**

మనం పెట్టే ప్రసాదం దేవుడు తినడం మొదలుపెడితే తిరుపతి లడ్డూలు, అన్నవరం ప్రసాదం అమ్మకానికి మిగలవు. ఏ దేవుడు మనకవి యిచ్చాడో అవి వారికి నివేదన చూపి మన కృతజ్ఞత తెలుపుకోవడానికే నివేదనలు.

※ **రావణునికి కోరలు, వికారముఖం లేవా?**

ఎంతమాట! రావణుడు చాలా అందగాడు. రావణుని చూసి హనుమంతుడు-

అహో రూపం - అహో ధైర్యం...

ఏమి సౌందర్యం, ఏమి ధీరత్వం అని ఆశ్చర్యపోయాడు.

అంత అందగాడాయన!

**⌘ ఉపవాసాల వల్ల పుణ్యం వచ్చునా?**

నిస్సందేహంగా వస్తుందని భక్తుల విశ్వాసం. పుణ్యం మీద నమ్మకం లేని వారికి శరీర ఆరోగ్యం బాగుపడుతుంది. మన జీర్ణకోశం కూడా ఒక యంత్రం. దానికి కూడా విశ్రాంతి యిస్తే అది మరికొంత కాలం పనిచేస్తుంది.

ఉపవాసంతో పాటు మనస్సును ఏకాగ్రం చేసి నిర్మలంగా ఉంచుకుంటే చక్కని ఆలోచనలు వచ్చి సన్మార్గాన నడవగలుగుతాం.

**⌘ కార్తీక స్నానాలకు కుళాయి నీరు పనికిరాదా?**

పనికి రాదంటే మహానగరాలలో వుండే వారి గతి ఏమవుతుంది. అయితే కార్తీకమాసంలో తెలతెలవారుతుండగా లేచి నదీ తీరానికో, కాలువ దగ్గరకో నడిచి ప్రవాహోదకంలో స్నానం చేస్తే ఆరోగ్యం. మన ఆచారాలన్నిటిలోనూ ఆరోగ్యం ప్రధానంగా ఉంటుంది.

కార్తీకంలో సోమవారం ఉపవాసాలూ, ఏకభుక్తం కూడా ఆరోగ్యానికే అయితే దేన్నయినా భక్తికి మేళవించి చేసే దశలో ఆరోగ్యం వెనుకబడింది. మరొక్కమాట. మీరు కుళాయి దగ్గర చేసినా, నూతి నీరు చేసినా మంచిదే.

మనస్సును ఏకాగ్రం చేసి మీ యిష్టదైవాన్ని స్మరిస్తూ చేయండి. ప్రవాహం దొరికితే చాలా శ్రేష్టం.

**⌘ చరిత్రహీనులు గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కరా?**

ఆ బుక్‌లో ఎక్కేవారికి చరిత్ర ఏమున్నది బాబూ, పదహారడుగుల వెంట్రుకలు పెంచడం, ఏడు వందల గంటలు ఏకధాటిగా నడవడం, ముప్పై మూడు గంటలు ముద్దులు పెట్టడం, మూడు మైళ్ళు ముగ్గులు వేయడం యివన్నీ చరిత్రలో ఎక్కేనా.

**⌘ కీచక వధ సమయంలో బృహన్నల మృదంగం వాయిస్తాడా?**

చిత్రం చూశారా, బృహన్నల నాట్యాచార్యుడే కాని మృదంగం, హార్మనీ వాయించేవాడు కాడు. మృదంగం వాయించేది నాట్యాచార్యుల పని కాదు. కాని మన దర్శకుల వివేకం అలా ఉన్నది. నర్తనశాలలో ఆ రాత్రి కీచకుని

కంటె ముందు భీముడు, ద్రౌపదీ చేరారు. మరో ప్రాణి లేదు. ఇలానే భీముడు కత్తితో పొడిచాడా- అని అడిగేవారికి కూడా భీమ-కీచకులు మల్లయుద్ధ నిపుణులు.

ఆయుధహీనుడైన వానిని ఆయుధంతో చంపే బలహీనుడు కాదు భీముడు. కాని ఈ కాల ప్రభావం ఎటువంటిదంటే కీచక, దుర్యోధన భక్తి పెరిగి, వారి మధ్య అభిమానంతో జరిపే అత్యాచారాలివి. అందుకే భారతం దగ్గర ఉంచుకుని సినిమాలు చూస్తూంటే యిటువంటి విపరీత కల్పనలను మీరే అసహ్యించుకుంటారు.

**⌘ త్రిశంకువు స్వర్గం చేరి ఇంద్రునితో మాట్లాడాడా?**

దురదృష్టం ఎక్కడుందంటే విశ్వామిత్రుని నాయకునిగా చేసి కొన్ని వారాలు కథ నడిపించి డబ్బు చేసుకోవాలి. అందుకోసం త్రిశంకువు ఆత్మ త్యాగానికి సిద్ధపడడం, గాయత్రీదేవి ప్రత్యక్షం కావడం వంటి సన్నివేశాలు కల్పించుకుంటూ పెంచుకుపోతే అన్ని వారాలు విశ్వామిత్రుడు బ్రతకడు. త్రిశంకువు కథ కోసం రామాయణం చదవండి.

**⌘ కోట్లాది భక్తులకు ఒక్కడే దేవుడా?**

ఎంతమాట, ఇతర మతాలవారికి ఒక్కడే దేవుడా. మనకు ప్రాణికోటి అంతా దైవస్వరూపమే. భక్తి ఉంటే భక్తి దశ దాటిన జ్ఞానులకు అహం బ్రహ్మాస్మి, వారికి వారే దైవస్వరూపులు.

**⌘ చనిపోయే ముందు తులసితీర్థం పోస్తే...?**

తులసి చక్కని ఔషధం. అది ఎన్నో రోగాలను కుదురుస్తుంది. ప్రధానంగా శరీరంలో శ్లేష్మం పెరిగి శ్వాస ఆడక ప్రాణం పోతుంటే తులసి తీర్థం తగిలితే శ్లేష్మం విరిగి మనిషి బ్రతుకుతాడు.

**⌘ విశ్వామిత్రుని గూర్చి ఇంతమంది చలనచిత్రాలు తీస్తుంటే మీరు చాలా తక్కువ అంచనా వేస్తున్నారు?**

విశ్వామిత్రుని గురించి రామాయణ, భారతాలలో వున్న కథలు చదివితే ఇంకా ఎంత అల్పుడో మీరు గ్రహిస్తారు. పతితలను పవిత్రత వేషాలలో చూసి

ఆనందించి ఆరాధించే యుగంలో బ్రతుకుతున్న మనకు అహంకారం, క్రోధం మూర్తీభవించిన మూర్ఖులే మహానుభావులు కావడం ఆశ్చర్యం కాదు.

**✠ దేవుడొక్కడే అయితే రామ, కృష్ణ, శివ, అల్లా, క్రీస్తు యిందరూ ఎవరు?**

ఏ పేరు పెట్టినా అది దైవానికే చెందుతుంది. భక్తులు ఎవరికి తోచిన నామాన్ని వారు జపించుకుంటారు. ఏ నామంతో జపించినా మనస్సు ఏకాగ్రం అయితే దైవం సాక్షాత్కరిస్తాడు.

**✠ ఆడదానికో నీతి, మగవాడికో నీతి... ఉండడం న్యాయమా?**

చాలా అన్యాయం, కాని నీతి అందరికీ సమానంగా ఉంటుంది. న్యాయం వలె. అయితే సింహాసనాల మీద వున్న వారికో న్యాయం, సామాన్యుడికో న్యాయం అమలుజరిగే కాలాన్ని చూస్తూ ఆడా, మగా నీతి గురించి బాధ పడతారేం.

**✠ అన్నదమ్ములను రామలక్ష్మణులతోనే పోలుస్తారేం?**

రాముడు వనవాసం చెయ్యాలని కైక కోరింది. లక్ష్మణుని విషయం లేదు. అయినా అన్నగారి మీది అభిమానంతో రాజభోగాలూ, దాంపత్య సుఖమూ విడిచి స్వయంగా అడవులకు వచ్చిన వాడు లక్ష్మణుడు. అదీ అన్నదమ్ముల అనుబంధం. ఈ విషయానికి యింకా వివరాలు కావాలంటే రామాయణం చదవండి.

**✠ దేవతలు తప్పు చేస్తే మానవజన్మ ఎత్తమని శపిస్తారు? మానవజన్మ అంత దుర్భరమా?**

ఈ అత్యాచార ప్రభువుల, అన్యాయబుద్ధుల ఏలుబడిలో బ్రతుకుతూ ఈ జన్మ సుఖంగా వుందనుకుంటే మీరు మహాయోగులు!

**✠ ఎరుపు ప్రమాద చిహ్నం కదా, దేవతలకు ఎరుపు ఇష్టమా?**

ఎరుపును ప్రమాదానికీ, నలుపుని విషాదానికీ, పసుపు శుభానికీ యిలా ఇంగ్లీషువారు నిశ్చయించారు. ఏదో ఒక గుర్తు కావాలి. కనుక పారాణి, కాషాయం, రక్తవర్ణం పవిత్రమైనవని శ్వేతజాతులు ఆటవిక దశలో వున్ననాడే

నిశ్చయించారు మన పెద్దలు.

❋ **అందరి కంటే గొప్పది ఆదిశక్తి కదా, మరి శివకేశవుల పూజలెందుకు?**

శివకేశవులు ఆ శక్తి అంశలు. ఎవరిని పూజించినా ఆ ఆదిశక్తికే చెందుతుంది. పేర్లు వేరు కానీ ఉన్న శక్తి ఒక్కటే.

❋ **భర్త పాదసేవయే స్త్రీకి ధర్మం, అది ఈ కాలంలో కూడానా?**

పాదసేవ ఒక్కటే కాదు, చాలా వున్నాయి నారీధర్మాలు. ఈ ఒక్కముక్కనూ పట్టుకుని ప్రాకులాడకండి. భారతంలో ద్రౌపదీదేవి సత్యభామకు బోధించిన విషయాలు చూడండి. అన్నింటినీ మించినది అన్యోన్యానురాగం. కష్టసుఖాలు కలిసి పంచుకోవడం. అది లేనప్పుడు పాదసేవ వ్యర్థం.

❋ **అర్థరాత్రి ఆడది ఒంటరిగా తిరగగలిగితే నిజమైన ప్రజాస్వామ్యమని గాంధీజీ అన్నారా?**

అన్నారు ఆయన అమాయకులు కనక, ఆయన చదివిన రామాయణంలో ఓ మాట ఉన్నది. దశరథ మహారాజు మరణించాక ప్రజలందరూ వశిష్ఠులవారిని చేరి- ఆర్యా! ధర్మపరుడైన పాలకుడు లేకపోతే రైతు విత్తనాలు జల్లడు, వ్యాపారులు వర్తకం సాగించరు, ప్రజలు సుఖంగా బ్రతకరు, రాత్రిపూట తలుపులు తీసుకుని పడుకోలేని దురవస్థ ఏర్పడుతుంది. ఇలా చాలా చెప్పారు.

తలుపులు తెరచుకుని నిద్రపోయేకాలం రాముని ఏలుబడిలో వుండేదని గ్రహించాలి. రాత్రులదాకా ఎందుకు పట్టపగలు ఇనుప తలుపులు పగలగొట్టి బ్యాంకులు దోచుకునే ప్రబుద్ధులు, నడివీధిలో మానభంగాలు చేసే దుర్మార్గులు హాయిగా రొమ్ము విరుచుకు తిరుగుతున్న కాలం యిది. మహాత్ముడు బ్రతికి వుంటే ఆత్మహత్య చేసుకునే ప్రజాస్వామ్యం మనకు లభించింది.

❋ **వీధి దీపాల దగ్గర చదివి మహామహులు కాగలిగినవారున్నారు కదా, ఇప్పుడు కాంతి తక్కువగా వుంటే చదవరాదా?**

అప్పటికీ మన కన్ను ఇంత విద్యుత్తుకు అలవాటు పడలేదు. అప్పటి వారికి కలుషితమైన నీరు, గాలి, ఆహారం లేవు కనక వారి దృష్టి బలంగా

వుండేది.

**⌘ భీమార్జునుల వలె మిగిలిన ముగ్గురికీ వేరే భార్యలున్నారా? ద్రౌపదికి సంతానం కలిగిందా?**

అయిదుగురికి వేరే భార్యలున్నారు. ద్రౌపదికి అయిదుగురు కొడుకులున్నారు.

**⌘ కార్తీకమాసంలో తెల్లవారుఝామున చలిలో స్నానం, ఉపవాసాలు పుణ్యం కోసమా?**

నిస్సందేహంగా పుణ్యం కోసం అంటారు పురాణాలు చెప్పేవారు. అంతకంటే ఆరోగ్యానికి ఈ స్నానాలూ, ఉపవాసాలూ అవసరం. శరీరాన్ని దాని యిష్టం వచ్చినట్టు విడవకుండా మన ఆధీనంలో ఉంచగలిగితే రోగాలకు దూరంగా సుఖజీవితం సాగించగలం.

**⌘ శనివారాలు మత్స్యమాంసాలు మానుతారేం?**

అందరూ మానరండీ, కానీ అలా వారానికొకసారి మానితే కొంత రజోగుణం తగ్గుతుంది.

**⌘ తులసిని ఎందుకు పూజిస్తారు?**

తులసిలో కావలసినంత ఔషధశక్తి వుంది. దాని మీద నుంచి వచ్చే గాలి, ఆ ఆకులు పిండి తీసిన రసం చాలా వ్యాధులను తగ్గిస్తాయని వేల సంవత్సరాల క్రితం ఆయుర్వేదం చెప్పిన దానిని ఈనాడు విదేశీ వైద్యులు ఘోషిస్తున్నారు.

**⌘ విశ్వామిత్రుని శిష్యుని పేరు నక్షత్రకుడా?**

హరిశ్చంద్ర నాటకంలో పుట్టినవాడు నక్షత్రకుడు. రామాయణంలో భారతంలో హరిశ్చంద్రుడే లేడు. విశ్వామిత్ర, హరిశ్చంద్రుల కంటె ఈ నక్షత్రకుడే మనవారికి బాగా దగ్గరవాడయాడు. సత్పురుషులను హింసించే బుద్ధి మనలో పెరగడం వల్ల.

**⌘ విద్య నేర్పవలసిన గురువులే తప్పుదారులు త్రొక్కితే..?**

లంచగొండితనాన్ని, అవినీతిని పాతిపెడతాం అని గొంతు చించుకు అరిచి

గద్దెలెక్కిన పెద్దలే లంచాలకూ, అవినీతికి దాసోహం అనే కాలంలో గురువు, విద్య అనే శబ్దాలకు అర్థం మారలేదా? పాలకుల బుద్ధులు పాలితులకు అంటుతాయి.

⌘ **సర్వాంతర్యామిని నేనే అని గీతలో పలికిన మహాత్ముడు అందరిలోనూ మంచిని ఎందుకు ఉంచడు?**

ఆయన సర్వాంతర్యామి అనే విషయం తెలుసుకున్న వానికి మంచి చెడు వుండవు. అంటే అది కూడా ఆయన లీలా విలాసం.

⌘ **కర్మ నీ వంతు, కాపాడటం నా వంతు అన్నాడు కదా కృష్ణపరమాత్మ..?**

కర్మ చేయడం నీ విధి, దాని ఫలితంతో ప్రమేయం ఉండరాదు అన్నాడా యన. ఫలాన్ని ఆపేక్షించకుండా మన కర్తవ్యాన్ని మనం నిర్వర్తించుకుంటూ సాగితే ఫలాఫలాలు ఆయన అనుగ్రహిస్తాడు.

⌘ **ఉపవాసాల పేరుతో పిండివంటలు చేసుకు తింటే ప్రయోజనం?**

ఉపవాసం అనేది జీర్ణకోశానికి విశ్రాంతినిచ్చి శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచి, మనస్సును భగవంతుని మీద నిలపడానికి ఏర్పడింది. ఆ రహస్యం మరిచి ఉపవాసం రోజున లేచింది మొదలు సాయంత్రం వరకూ పిండివంటల మీద మనసు నిలిపేవారు.

⌘ **రాజకీయవాదులు పరస్పరం నిందించుకుంటారే తప్ప ప్రజాసమస్యలు పట్టించుకోరేం?**

ప్రజల సమస్యల కోసం జీవితాలు అంకితం చేసిన మహాత్మాగాంధీ, ఆంధ్రకేసరి ప్రకాశం వంటివారు ఎన్ని బాధలు పడ్డారో చూసిన వారికి తమ బ్రతుకులు ప్రజాసేవకు వినియోగిస్తే తమ కుటుంబ సభ్యులేమవుతారో అని భయంతో ఎదుటివారి కొంపలు కూల్చి, ప్రజలను జలగల వలె పీల్చుకు తింటూ, ఆరు నెలలు అధికారంలో వుండి ఆరు తరాలకు సరిపడే సంపద కూడబెట్టు కుంటున్నారు. ఇది కాలప్రభావం. కాలమే వారి కడుపులు కాలుస్తుంది.

**⌘ కర్ణుడంతటి మంచి వ్యక్తి ద్రౌపదిని పతిత అని అంటాడా?**

అన్నాడని వ్యాసులవారు భారతంలో వక్కాణించారు. దుష్టులతో స్నేహం మంచివారిని ఎంత వంచిస్తుందో చూపిస్తుంది భారతంలో కర్ణ పాత్ర.

**⌘ రామాయణ భారతాలకు చారిత్రక ఆధారములున్నాయా?**

మన చరిత్ర - ఇంగ్లీషు వారి ధర్మమా అని - క్రీస్తు పూర్వం రెండు వేల సంవత్సరాల దగ్గర ప్రారంభమైంది. భారత యుద్ధం క్రీ.పూ. మూడు వేల సంవత్సరాల క్రితం జరిగిందని గ్రహగతులు తెలిపిన గణిత శాస్త్రవేత్తలు తెల్పుతున్నారు. అంతక్రితం విషయం రామాయణం, భారత యుద్ధానంతరం సముద్రంలో మునిగిన ద్వారక ఇవాళ బయటపడుతున్నదని మీ అభిమాన దినపత్రికలు ఘోషిస్తున్నాయి. అంతకుమించిన చరిత్ర నాకు తెలియదు.

**⌘ అహింసావాదియైన గాంధీజీకి హింసను బోధించే భగవద్గీత అభిమాన గ్రంథమా?**

విప్లవవాదులైన వారికి, కర్మయోగులైన బాలగంగాధర్ తిలక్ గారికి కూడా గీత ఆరాధ్యమే. గీత హింసను బోధించిందా? అహింసను బోధించిందా అనేది ద్వైతమా, అద్వైతమా, విశిష్టాద్వైతమా?

గీత దేనికి ప్రమాణం అని ఆలోచించకండి. దాన్ని ఆరాధించే మనిషి యొక్క మనస్తత్వాన్ని బట్టి వారిని నడపగల శక్తి ఒక్క భగవద్గీతకే వున్నది. భగవద్గీత సర్వజీవ రసాయనం.

**⌘ ధర్మం మారదు కదా, మరి యుగధర్మం ఏమిటి?**

ధర్మం మురికిగుంట కాదు, కాలం వలె ప్రవాహశీలం కలది. అందుచేత ధర్మశాస్త్రాలు ఎప్పటికప్పుడు మార్చి వ్రాసుకున్నారు.

దురదృష్టవశాత్తూ పది దశాబ్దాల నుంచి మన ధర్మ శాస్త్రాన్ని సవరించగల వారు పుట్టకపోవడం కాలానుగుణంగా మారలేక ఆ ఆచారాలనే పట్టుకుని సంసారులు నాశనమవుతున్నారు.

ధర్మశాస్త్రాలను తిరగ రాయవలసిన బాధ్యతను పీఠాధిపతులు

విస్మరించారు. మరో శంకరాచార్యులు పుడితే తప్ప మనకు ముక్తి లేదు.

**⌘ దుర్యోధనుడు దుర్మార్గుడని తెలిసినా కర్ణుడు వానితో ఎందుకు స్నేహం చేశాడు?**

దుర్మార్గులు సంపన్నులు కూడా అయితే కర్ణుని వంటి వారిని చేరదీసి తమతో వారిని కూడా సర్వనాశనం చేస్తారు. నాశనం అవుతున్నామని తెలిసినా బయటపడలేని విషవలయంలో కర్ణులు చిక్కుకుపోతారని గ్రహించడానికి మహాభారతం నుంచి నీతి స్వీకరించాలి. స్వీకరించి దుర్యోధనులకు దూరంగా వుండాలి.

**⌘ రామాయణం, భారతం, గీత భక్తితో పఠించేవారికి కూడా మనస్తాపం ఉంటున్నదే?**

భక్తితో పఠిస్తున్నట్టు అనుకుంటున్నారు, లేదా కొందరు అభినయిస్తున్నారు. భక్తి అంటే స్నానం చేసి దేవుని ముందు అగరువత్తులు వెలిగించి కూర్చోవడం కాదు కోతిలా గంతులు వేసే మనసును పరమేశ్వరుని యందు లగ్నం చేయడం. అది చేయగలిగితే ఏ తాపం ఉండదు.

**⌘ విశ్వామిత్రుడు తపస్సు చేస్తూనే ఇంద్రుడు మేనకను పంపుతున్నట్టు గ్రహిస్తాడా?**

కలియుగ విశ్వామిత్రుడు పురాణాలు చదివినవాడు కదా! అందుచేత కన్నులు మూస్తూనే అప్సరసల కోసం చూస్తాడు. అసలు విశ్వామిత్రుడు దీక్షతో తపస్సు చేశాడు. ఆయన మనస్సు బ్రహ్మం మీదనే వుంటుంది కాని అటూ యిటూ దొంగచూపులు చూడడు.

**⌘ మతాలు మనిషి మంచి కోసమే కదా, మరి చెడు చేస్తున్నాయేం?**

చెడు చేస్తున్నది మతం కాదు, మతాన్ని అనుసరిస్తున్నామనుకునే ఉన్మత్తులు చేసే పనులివి. ఆ ఉన్మాదాన్ని ఉమ్మూలించి వివేకనేత్రాన్ని ఉన్మీలనం చేసే మహనీయులు పుట్టాలి.

**⌘ సూర్యుడు దైవమంటారు, మండే గోళమంటారు?**

రెండూ సత్యమే! సూర్యుడే కాదు చంద్రుడు తప్ప మిగిలిన గ్రహాలు,

నక్షత్రాలు మండుతున్న గోళాలే. అయితే అగ్ని లేనిదే మానవుడికి మనుగడ లేదు. అదే శక్తి స్వరూపం.

మానవుడు ప్రథమంగా గ్రహించింది, సూర్యుని వెలుతురు. ఆ వెలుగునిచ్చే అగ్నివల్ల తనకు అన్నీ లభిస్తున్నాయని గ్రహించి ఆ గోళాన్ని దైవంగా ఆరాధించాడు. ఇప్పటికీ మనకు ఉచితంగా దొరుకుతున్నది సౌరశక్తియే.

**⌘ విశ్వామిత్రుడు మేనకను పెండ్లియాడెనా?**

రామాయణంలో విశ్వామిత్రుడు భారతంలో లేడు. రామాయణ, భారతాలలో వున్న విశ్వామిత్రుడు ఈనాడు మీరు చూసే విశ్వామిత్రుడు కాడు. ఇదో త్రిశంకు సృష్టి. కలియుగంలో విశ్వామిత్రుడు ఎడం చేత్తో ఆచమనం చేస్తాడు, మేనకను పెళ్ళాడతాడు. మేనక దేవేంద్రుని ఎదిరిస్తుంది.

ఇంకా కొన్ని రోజులు పోతే సీతాదేవి విడాకులడుగుతుంది. లక్ష్మణుడు శూర్పణఖను ప్రేమిస్తాడు. కీచకుడు హస్తినాపురం పాలిస్తాడు. ఇదంతా కలియుగ విశ్వామిత్ర సృష్టి అని సంతోషించాలి. అందుకే భారత, రామాయణాలు మూల గ్రంథాల అనువాదాలు చదవండి. ఈ కలియుగ కవుల పైత్యాలు మీకు బాధ కలిగించకుండా.

**⌘ మానవాతీత శక్తులు లేకపోతే పురాణపురుషులు దైవస్వరూపులవుతారా?**

కోట్లాది మానవులకు సాధ్యం కాని సత్యవాక్పాలన, ధర్మాచరణం, యోగ నిష్ఠ, రాగద్వేష రాహిత్యం సాధించగల మానవుడు దైవమే.

**⌘ దేవతలు, రాక్షసులు ఒకే తండ్రి బిడ్డలా?**

రావణుడు, విభీషణుడూ కూడా ఒకే తండ్రికి ఒక్క తల్లి వల్ల కలిగినవారే. అటువంటి పిల్లలు చాలా గృహాలలో కనిపిస్తారు.

**⌘ పెండ్లి వేడుకలు పదహారు రోజులు జరిగేవట, ఇప్పుడు గంటలోనే..?**

గంట కూడా అవసరంలేదు. పావు గంట చాలు అసలు వివాహానికి, కాని, సమాజానికి కావలసినంత విశ్రాంతి ఉండి నలుగురూ ఒకరికొకరు కష్టసుఖాలలో చేదోడువాదోడుగా ఉండే కాలంలో వేడుకలు పదహారు రోజులు

జరుగుతూండేవి. ఎవరింట శుభకార్యం జరుగుతున్నా అందరూ ఆదుకునే రోజులవి. ఈనాడు తోటకూర దగ్గరనుంచి కొనుక్కోవలసిన దుర్దశలో వున్నాం. అటువంటప్పుడు పావు గంట పెళ్ళిచేసినా దివాలా తీయవలసిందే.

**⌘ సీత మండోదరి కన్న కూతురని మలేషియా ప్రజలు చెప్పారు?**

మలేషియాలో కూతుర్ని చెరిచే రావణులున్నారని అనడానికి సాహసించ లేను.

**⌘ మంత్రం అనగానేమి?**

మననాత్ త్రాయతే ఇతి మంత్రః మననం చేస్తే రక్షించేది మంత్రం. అంటే మీ ఇష్టదైవం పేరును మనసులో స్మరిస్తూంటే అదే మిమ్ము రక్షిస్తుంది అంటారు పెద్దలు.

**⌘ భారతం జరిగిందంటారా?**

జరిగిందా? అంటే జరిగింది.

జరగలేదు అనుకునేవారికి జరగలేదు. ఇంతకూ భారతం ద్వాపర యుగం లో జరిగిందని లోకకళ్యాణ కాంక్షలో జీవితం నడిపిన వ్యాసమహర్షి చెప్పాడు. వేదాలలో ఉండే ధర్మం సామాన్యులకు బోధించడానికి భారత కథను ఆధారం చేసుకుని పంచమవేదంగా అందించాడు.

నిజానికి మనమంతా హరికథలో, పురాణాలలో వింటూ, నాటికలలో, సినిమాలలో చూస్తున్నదే భారతం కాదు.

అదంతా భారతంలో శతాంశం. భారతాన్ని వ్యాసుల వారు వైశంపాయను లకు చెప్పారు. ఆయన జనమేజయునికి చెప్పారు.

నైమిశారణ్యంలో సాధువులు, సజ్జనులు, మునీశ్వరులూ ప్రార్థించగా సూత మహర్షి చెప్పాడు. తరువాయి అది మహాభారతంగా పెరిగి పెరిగి మనకందింది. ఈ మధ్యకాలంలో ఎన్నెన్నో కథలూ, గాథలూ అందులో చేరాయి, చేరినవి ఏవి? అసలున్నవి ఏవి? అనే విషయంలో ఏకాభిప్రాయం లేదు. అందుచేత వివేకం కలవారు ఆ పేచీల జోలికి పోక భారతం చదువుకుని మనశ్శాంతిని

పొందుతున్నారు. బుద్ధికి పదును పెట్టుకుంటున్నారు.

ఇంతకూ భారతం జరిగిందా, లేదా? అనేదానికి మీకు సమాధానం దొరకలేదు.

⌘ **ఆడవాళ్ళు పసుపు రాసుకుని కుంకుమ దిద్దుకోవడం హిందూ మతంలో ఆచారమేనా?**

ముఖానికి పసుపు రాసుకుని నీళ్ళు పోసుకోవడం, కంటికి కాటుక, నుదుట కుంకుమ పెట్టుకోవడం మతానికి సంబంధించినవి కావు.

మీకింకో రహస్యం చెప్పాలి, అస్సలు హిందువులకు మతం లేదు. ఆదిలో హిందూ శబ్దమే లేదు. సింధునదిని చేరిన గ్రీకులు దానిని 'హిందూ' అని పలికేవారు, హిందూ దేశమనీ యిక్కడి వారు హిందువులనీ పిలవడం మొదలెట్టారు.

అంతకు ముందు ఈ దేశం భారత వర్షం. ఈ భారత దేశంలో చరిత్రకందని కాలంనాడే వేదాలు మనిషిని మనిషిగా నిలబెట్టడానికి ధర్మం బోధించాయి.

ఆ ధర్మాన్ని అనుసరించేవారు భారతీయులు. అంతే తప్ప ఒక క్రీస్తు, ఒక మహమ్మదు వంటి దేవుని కుమారులూ, ప్రవక్తలూ యిక్కడ తమ పేరమతం నెలకొల్పలేదు. క్రైస్తవులు, మహమ్మదీయుల ప్రభావం వల్ల హిందువులు కూడా తమకు మతం లేకపోతే బావుండదనుకుని 'హిందూమతం' అన్నారు. అందుచేత ఈ జాతికి ధర్మం వున్నదే కాని మతం లేదు.

ఈ ధర్మం మనిషి నేలమీద పడి గుక్క తిరగకుండా ఏడ్చిన నాటి నుంచి కాటి మీద చేరేవరకూ ప్రతిక్షణం ఎలావుండాలో బోధిస్తుంది. అదీ హిందువుల సిద్ధాంతం.

ఇక బొట్టు, కాటుక- వీటికి మతంతో సంబంధం లేదు. ఇవి పూర్తిగా ఆరోగ్యానికి సంబంధించినవి. ఈ గాలిలో, ఈ నీటిలో, ఈ వాతావరణంలో పుట్టే క్రిమి కీటకాల వల్ల సుకుమార దేహాలకు అనారోగ్యం రాకుండా వుండడానికే పసుపు, కుంకుమ స్త్రీలు వాడతారు.

ఈ రెంటిలో వున్న ఔషధశక్తిని ఇంగ్లీషువైద్యులు ఈనాడు వేనోళ్ళ చాటుతున్నారు.

అలానే గోమయంతో చేసిన పిడకలు కాల్చిన భస్మం కూడా క్రిమిసంహారకమే. ఆరోగ్య సాధనకే తప్ప యివేమీ మతచిహ్నాలు కావు.

ఈ దేశంలో దేవుణ్ణి ఎంతగా నమ్మారో అంతగానూ మానవకృషినీ, ప్రయత్నాన్నీ సాగించారు. గాలిలో దీపంపెట్టి దైవం మీద భారం వేసిన అవివేకులిక్కడ తక్కువే.

**⌘ శకుని తండ్రిని దుర్యోధనుడు చంపించాడనీ, ఆ తండ్రి ఎముకలే పాచికలుగా యిచ్చి, దుర్యోధనాదుల మీద కసి తీర్చుకున్నారనీ విన్నాం? ఎంతవరకు నిజం?**

మహాభారతం ముమ్మారు తిరగవేసినా ఈ విషయం దానిలో లేదు. తన సోదరి గాంధారిని వెంటబెట్టుకు వచ్చిన శకుని హస్తినాపురంలో తిష్ఠ వేశాడు. మళ్ళీ వాడు గాంధారదేశం వెళ్ళినట్టు వ్యాసులవారు ఎరుగరు.

భారతాన్ని ప్రప్రథమంగా అందించిన వ్యాసమహర్షికే తెలియని పరమ రహస్యం ఎవరి తలలోంచి బైటపడిందో పరిశోధకులు తేలిస్తే వారికో డాక్టరేటు యివ్వవచ్చు.

**⌘ కంటికి పెట్టుకునే కాటుక కూడా ఆరోగ్యానికేనా?**

బొట్టు, కాటుక, పసుపు యివే కాదండీ, గాజులూ, కడియాలూ, మట్టెలు కూడా ఆరోగ్యం కోసమేనండి! మన ఇళ్ళలో చేసుకునే కాటుక ఆవునేతితో కలిపి కంటికి పెడితే అందంగానేకాదు, కంటిలోని దోషాలను పోగొట్టి కళ్ళజోళ్ల అవసరం లేకుండా చక్కని చూపుతో బ్రతకవచ్చు.

దురదృష్టవశాత్తూ ఈనాడు బొట్టు, కాటుక అన్నీ కూడా కర్మాగారాల నుంచి తయారయి వస్తున్నాయి. ఆ పదార్థాలు వాడడం వల్ల చర్మవ్యాధులూ, కంటిదోషాలు వస్తున్నాయని వైద్యులే చెబుతున్నారు.

చమత్కారం ఎక్కడుందంటే ఇలా చెపుతున్న డాక్టర్ల ఇళ్లల్లోనే ఇవి ఎక్కువ వాడుతున్నారు? ఇంతకూ పసుపు, కుంకుమ, కాటుకా అన్నీ ఆచారాలే

అనేవారికి ఏం చెబుతాం.

⌘ **మా మిత్రులు కొందరు రాగి ఉంగరాలూ, కడియాలూ వేస్తున్నారు, దానివల్ల ప్రయోజనం వుందంటారా?**

తప్పకుండా, ఈనాటికీ పల్లెటూళ్ళలో మొలత్రాడుకి రాగి అర్ధణా కాసులు కట్టి పిల్లలకు పెడతారు. కొందరు రాగితో ఆంజనేయస్వామి బిళ్ళ చేయించి మెడలో వేసుకుంటారు. వారికి దాని పరమార్థం తెలియదు. ఏదో ఆచారం చేస్తున్నాం అంటారు.

అది ఆచారం కాదు. ఆరోగ్య సూత్రం తెలిసిన ఆయుర్వేదం చెప్పిన చిట్కా వైద్యం. శరీరంలో వేడిని తగ్గించి, క్రమబద్ధం చెయ్యడానికి రాగిని మించిన లోహం లేదు. అందుకే మనకు విద్యుత్ సరఫరాకు కూడా రాగితీగలే వాడతారు. వేడిని త్వరగా గ్రహించే శక్తి రాగికి వున్నందువల్లనే మొలబిళ్ళలూ, కడియాలూ రాగితో చేస్తారు. వేడివల్ల నరాల పీకుడుతో బాధపడేవారు, రాగి ఉంగరం కాని కడియం కాని వాడితే చాలావరకూ ఉపశమనం కలుగుతుంది.

⌘ **శంకరాచార్యులు, కారల్‌మార్క్స్, ఐన్‌స్టీన్ వీరిలో ఎవరు గొప్పవారు?**

ముగ్గురూ ముగ్గురే! భౌతిక, ఆధ్యాత్మిక తత్త్వాల్ని సమ్మేళన పరిచిన దార్శనికుడు శంకరాచార్యులు. కేవలం భౌతికవాదంతో మానవజాతికి ఆర్థిక స్వాతంత్ర్యం ప్రసాదించాలని "దాస్ కాపిటల్" ఇచ్చినవాడు మార్క్స్. భౌతిక శాస్త్ర గమనాన్ని మలుపుతిప్పి సాపేక్ష సిద్ధాంతంతో భౌతిక తత్వాన్ని అందించిన ద్రష్ట ఐన్‌స్టీన్, ఆయన అంటాడు "మతాభినివేశం లేని సైన్సు గుడ్డిది. సైన్సు దృష్టి లేని మతం కుంటిది" అని.

⌘ **మామిడితోరణాలు కట్టడం, మారేడు పత్రి పూజలు చేయడం మూర్ఖత్వం కాదా?**

మామిడి ఆకులకి, మారేడు ఆకులకి ఒక విలక్షణ లక్షణం వుంది. ఇవి రెండూ చాలాకాలం సజీవంగా వుంటాయి. వాతావరణంలోని బొగ్గుపులుసు గాలిని ఇవి పీల్చి ప్రాణవాయువును విడిచి మన ప్రాణాలకు హాయినిస్తాయి.

అందుకే పదిమందీ చేరేచోట విధిగా మామిడితోరణం కట్టమన్నారు.

ఇంక మారేడు పత్రి సంగతి.

మనం మారేడు చెట్లని దేవాలయాలలో ఎక్కువగా చూస్తాం. ఒకనాడు మనదేశంలో దేవాలయాలే సార్వత్రిక సమావేశ స్థలాలు, విద్యాలయాలు కూడా. అందుకు జన సమ్మర్దం వల్ల గాలిలో చేరిన బొగ్గుపులుసు గాలిని త్వరగా పీల్చి ఆక్సిజన్‌ని ఇచ్చే చెట్టు ఏమిటా అని ఆనాటి ఋషి ఆలోచించాడు. మారేడు చెట్టుకు ఈ లక్షణం వుందని గుర్తించాడు. అదీ సంగతి. మరి ఇది మూర్ఖత్వం ఎలా అవుతుంది! వృక్ష విజ్ఞానం తెలుసుకోవాలి.

**⌘ శుక్రవారం పురుషులు స్నానం చేయకూడదా?**

ఆరోగ్యంగా వుండాలనుకున్నవారు నిత్యం స్నానం చెయ్యాలనీ, వీలయినంతవరకూ సూర్యోదయానికి ముందు చల్లని నీటితో స్నానం చేయడం అవసరమనీ, వారానికొకసారి శరీరమంతా నువ్వులనూనె మర్దన చేసుకుని, కుంకుడు కాయ పులుసుతో తలంటుకోవాలని వైద్యశాస్త్రం చెపుతున్నది.

**⌘ శివధనస్సు ఎత్తలేని రావణుడు ఆ ధనస్సును ఎత్తిన సీతాదేవిని ఎలా ఎత్తుకుపోగలిగాడు?**

రావణుడు సీతా స్వయంవరానికి రావడం, ధనస్సు ఎత్తలేకపోవడం వాల్మీకి మహర్షికి తెలియదు. ఈ సన్నివేశాన్ని కల్పించిన మహాత్ములెవరో! అందుచేత రావణుని సీతాపహరణానికీ, ధనస్సుకూ సంబంధం లేదు.

**⌘ రావణుని తండ్రి పేరేమి?**

రావణుని తాత పులస్త్య ప్రజాపతి, ఈయన కొడుకు విశ్రవసుడు.

**⌘ ఎంత గొప్పవాడైనా ప్రాణం పోగానే బైట పెడతారేం?**

తృప్తిగా నోట్లో పెట్టుకు నమిలిన చెరుకుముక్క రసం అయిపోగానే పెంట కుప్ప మీద పారెయ్యడం లేదా.

**⌘ అభిమన్యునికెందరు భార్యలు?**

భారతంలో అభిమన్యునికి ఒక్క భార్యయే. సినిమా భారతంలో నాటకాల

భారతంలో శశిరేఖ అనే అమ్మాయి దిగింది. ఈ పిల్ల పుట్టుపూర్వోత్తరాలు వ్యాసులవారెరుగరు.

⌘ **ఆత్మ అనేది వున్నదంటారా?**

ఉన్నదనే అనుకోవాలి. అది లేదనే వారికి కూడా వున్నది. ఎందుకంటే ఆ అద్భుతమైన ఆత్మ మన శరీరానికి దూరమైన క్షణం నుంచి మన ఇంద్రియాలు నిస్తేజాలవుతున్నాయి.

⌘ **రాగద్వేషాలు నాకు లేవనే కృష్ణుడే గీతలో ఎవరు నాకు భక్తితో పత్రం, పుష్పం, ఫలం, తోయం అర్పిస్తారో వారిని అనుగ్రహిస్తానంటాడేమిటండీ?**

భగవద్గీత వున్నదే అది ఏ సమయంలో బోధించాడో ముందు మనస్సులో వుంచుకోవాలి, వీరు నా తాతగారు, వారు గురువుగారు, వాళ్ళు సోదరులు అనే రాగబంధం బాధించి, జారిపోయిన గుండెలతో కర్తవ్యం మరచిన అర్జునునికి ధైర్యం కలిగించాలి. హృదయ దౌర్బల్యాన్ని తొలగించి మనస్సును నిబ్బరం చేసి రణరంగంలో పరాక్రమం ప్రదర్శించే రీతిలో నిలబెట్టాలి.

ఇక గీత ప్రబోధించింది - మూడు మార్గాలు

అందులో మొదటిది కర్మయోగం, రెండవది భక్తియోగం, మూడవది జ్ఞానయోగం.

ప్రపంచంలో ఏ మూల పుట్టినా, ఏ మతాన్ని సేవించినా, ఏ దైవాన్ని కొలిచినా మానవత్వం నిలబడాలనుకునే అందరికీ గీత అద్భుత జీవరసాయనం.

ఈ రసాయనం ప్రథమంగా కర్మమార్గాన నడుపుతుంది. శరీరం దృఢంగా వుండి కండరాలు బిగువు చెడకుండా రక్తంలో ధాతువులు క్షీణించనంతకాలం ఎవడైనా ఏదో ఒక పని చేస్తూనే వుండాలి తప్ప సోమరులై ఇతరుల దయా ధర్మాల మీద ఏడవకూడదు, అని కర్మమార్గం బోధిస్తుంది.

ఆ తరువాయి జవసత్వాలు సన్నిగిల్లే వేళకు ఈ లోకం మీద మమకారాన్ని విడిచి, ధనాశకు నీళ్ళు వదిలి, కామవాంఛలను విసర్జించి జన్మకు సార్థకం రావడానికి భక్తిమార్గం. ఈ భక్తితో మీరు ఏ దేవతను స్మరించినా ఇబ్బంది

లేదు. కృష్ణ, అల్లా, ఏసు, ఈశ- ఏదయినా నామ భేదమే కాని ఉన్న సత్పదార్థం ఒకటే. అయితే మనస్సును నిగ్రహించి ధ్యానించడం ప్రధానం.

మూడవది జ్ఞానం. ఇది అంతంతలో అందేది కాదు. లక్షలమంది సాధకులలో ఒకరో ఇద్దరో జ్ఞానులుంటారు. పర్యవసానంగా భక్తిమార్గం బోధిస్తూ పత్రం, పుష్పం అనే మాట చెప్పాడు. భగవద్గీత అంతా బోధించి, 18 అక్షౌహిణీల సేనను నేలమట్టం చేయించాడు శ్రీకృష్ణుడు.

అదే గీతను అధ్యయనం చేసి అహింసామార్గాన రక్తపాతం లేకుండా భారతదేశానికి స్వతంత్రం సంపాదింపజేశాడు మహాత్మాగాంధీ.

అటు విప్లవవాదులూ, ఇటు అహింసాపరులూ ఉభయులూ పారాయణం చేసి దాని అంతరార్థం గ్రహించి ఆచరించాలి. అదే గీత విశేషం.

**⌘ భగవద్గీత భారతంలో వున్నదా?**

చూడండీ ఈ సందేహం మీకెందుకు కలిగింది. కురుక్షేత్ర రణరంగంలో నిలబడిన అర్జునుడు బంధు ప్రీతితో బాధపడుతుంటే వానికి ధర్మం ప్రబోధించి అన్యాయాలకూ, అత్యాచారాలకూ ఒడిగట్టేవారు రక్తసంబంధీకులయినా సరే సంహరించి తీరాలని కర్తవ్య పరాయణుని చేశాడు శ్రీకృష్ణుడు అని వ్యాసుల వారు భారతంలో చెప్పారు. వాస్తవానికి మనమందరం జీవిత కురుక్షేత్రంలో ఒకనాడు కర్తవ్యం తెలియక దిగులుపడి కూలబడే అర్జునులమే. ఆ సమయంలో భగవద్గీత మనకు దారిచూపి ముందుకు నడుపుతుంది. అందుకే గీత చదవాలి.

**⌘ రచయిత కావాలంటే ఏం చెయ్యాలి?**

ఏ భాషలో రాయాలనుకుంటున్నారో అందులో, మహామహుల రచనలు పారాయణం చెయ్యండి. భక్తితో కాదు, వారి శైలి, విషయ విన్యాసం ప్రారంభం, ముగింపు యివన్నీ చూసుకుంటూ చదవండి. ముందు భాషాజ్ఞానం కావాలి, ఈనాడు అదొక్కటే లోపిస్తున్నది. అందుకే తారాజువ్వల్లా లేచిన రచయితలు - రచయిత్రులు దశాబ్దం తిరగకుండా తెరమరుగవుతున్నారు.

**⌘ రాముడు, రావణుడు వీరిలో ఎవరు గొప్పవారు?**

మన మనసులో ధర్మం, సత్యం పట్ల విశ్వాసం వుంటే రాముడు గొప్పవాడు. కంటబడిన కన్నెపిల్ల మీద అత్యాచారం చేసే ప్రవృత్తి మనలో వుంటే రావణుడే గొప్పవాడు ఏదయినా మన బుద్ధిలో వుంది.

**⌘ వేమన దిగంబరంగా వుండేవాడా?**

ఆయన గోచీ పెట్టాడా, తీసేశాడా అనే పేచీలతో తలలు పాడుచేసుకోవడం కంటే ఆయన నీతులు గ్రహించి, చిత్తశుద్ధితో ఆచరిస్తే లోకానికి మేలు.

**⌘ మయసభలో దుర్యోధనుడు అవమానాలు పడినప్పుడు ద్రౌపది నవ్వలేదా?**

ద్రౌపది నవ్వినంతలో సభాభవనంలో పెద్దల సమక్షంలో బట్టలు విప్పించడం దుర్యోధనుడు చేసిన సత్కార్యం అంటారా. మనకు చాలా కావలసినవాళ్లు అరటిపండు తొక్క మీద కాలు జారిపడితేనే నవ్వుతామే. అటువంటిది అంతటి దుర్మార్గుడు అలా పడితే నవ్వకపోవడం సహజమా.

**⌘ ఆశకూ, తృప్తికి తేడా ఏమిటి?**

ఆవగింజకూ, అగ్నిపర్వతానికి వున్నంత తేడా ఉంది. కోట్లు మూలుగుతున్నా పావలాకు కక్కుర్తిపడడం ఆశ, దొరికిన పావలాతో గంజి త్రాగి హాయిగా జీవితం గడపడం తృప్తి.

**⌘ ధర్మం ఒక్కపాదమే మిగలడానికి కారణభూతులైన అవినీతిపరులను, అత్యాచారాలు జరిపేవారినీ చూస్తూ వూరుకున్నాడా దేవుడు?**

దేవుడన్నాడని మీరు నమ్ముతుంటే ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే అని శంఖద్వానం చేసిన గీతాచార్యుని రాకకోసం ఎదురుచూడండి. అయితే దేవుడెవడు? మనిషే సర్వస్వం అనుకుంటారా? మనిషిని మనిషిగా నిలబెట్టడానికి అబలల మీద, దుర్బలుల మీద అత్యాచారాలు, అక్రమాలు జరిపే దుర్యోధన దుశ్శాసన లక్షణాలు కల దుర్మార్గులను హతమార్చే సంఘాలు స్థాపించండి.

**⌘ ఋషులు గొప్పవారా? శాస్త్రవేత్తలు గొప్పవారా?**

ఎవరు గొప్పో తేల్చుకునే ముందు ఋషి అంటే ముందుగా అవగాహన చేసుకోవాలి. ఋషి అంటే గడ్డాలు, మీసాలు పెంచుకుని తపస్సు చూసుకుంటూ వ్యక్తిగత మోక్షాన్ని కాంక్షించే స్వార్థజీవి అనే ఒక అభిప్రాయం అందరిలో కాకపోయినా చాలామందిలో ఉంది. కాని అది తప్పు అభిప్రాయం. మన వాఙ్మయంలో ముని, ఋషి అనే రెండు పదాలు కనిపిస్తాయి.

మునులు ఇహలోక వాంఛల్ని వీడి తపస్సు చేసుకొనేవాడు. ఋషులు అలా కాదు, సమాజహితాన్ని కోరి సత్యాన్వేషణ చేసే శాస్త్రవేత్తలు. భరద్వాజుడు, అగ్నివేశుడు, కణాదుడు అటువంటి ఋషులు. భరద్వాజుడు కాంపిల్య నగరం లో విజ్ఞాన విశ్వవిద్యాలయాన్ని నడిపి భౌతిక, వైద్య విజ్ఞానాన్ని బోధించినట్లు ఆధారాలున్నాయి.

అగ్నివేశుడు ఆయుర్వేద ఋషి. కణాదుడు ప్రపంచంలోనే మొదటి అణుశాస్త్రవేత్త. తమాషా ఏమంటే మనదేశంలో భౌతిక, ఆధ్యాత్మిక విద్యలు రెండూ చెట్టాపట్టాలు వేసుకుని తిరిగాయి. పెరిగాయి. నేటి శాస్త్రవేత్తలు కూడా ఋషుల వంటివారే. హోమీ బాబా, సి.వి.రామన్, ప్రఫుల్ల చంద్ర రే, శ్రీనివాస రామానుజం ఇలా ఎందరో మహానుభావులు.

⌘ **భారతదేశానికి తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన అరేబియా సముద్రం, దక్షిణాన హిందూ మహాసముద్రం వున్నాయి. వీటికి ఇదివరకటి పేర్లేమిటి?**

అతిప్రాచీన కాలంలో బంగాళాఖాతాన్ని గంగాసాగరం అనేవారు. గంగానది ఈ సాగరంలో కలుస్తుంది కదా. అలాగే సింధునది కలుస్తుంది. కనుక అరేబియా సముద్రాన్ని సింధుసాగరం అనేవారు. హిందూ మహాసముద్రాన్ని కాశ్యప సముద్రం అనేవారు. ప్రస్తుతం మనం ఆఫ్రికా అని పిలుస్తున్న ఖండానికి 'కాశ్యప ద్వీపం' అనే పేరు. కాలం గడిచింది. ఖండాలు దూరం అయ్యాయి. పేర్లు మారాయి. పురాణయుగం, ఇతిహాసయుగం, ఆధునిక యుగాలు మనకు తెలిసినవే కదా.

⌘ **సీతాదేవి నగలన్నీ విడిచి, నారచీరలతో అడవికి వెళ్ళింది కదా, వానరులకు**

**నగలమూట ఎలా దొరికింది?**

ఈ సందేహం రామాయణం చదివిన వారికి కూడా కలుగుతూనే వుంది. దానికి ప్రధాన కారణం - కిష్కింధలో సుగ్రీవుడు నగలమూట తెప్పించే వరకూ ఈ నగల విషయం మన మనసులో వుండకపోవడం వల్ల.

అయోధ్య కాండలో సీతారామలక్ష్మణులు అరణ్యవాసానికి బయలు దేరుతూంటే దశరథ మహారాజు తన అంతరంగిక సచివుడైన సుమంత్రుని పిలిచి విదేహాధీశుల ఇంటి ఆడపడుచు, ఇక్ష్వాకుల ఇంటి పెద్దకోడలు అడవిలో వున్నా మహారాణిలా వుండవలసిందే కనక ఈ పదునాలుగేళ్ళకూ అవసరమైన చీనాంబరాలూ, రత్నమాణిక్యాభరణాలు రథం మీద పెట్టి తీసుకెళ్ళు అని ఆజ్ఞాపించాడు.

అయితే దశరథుని కంటే రామ వనవాస దుఃఖం రామాయణ శ్రోతలను నేటికీ అధికంగా బాధిస్తూ వుండడం వల్ల ఆ సన్నివేశంలో దశరథుని మాటలు మనకు గుర్తుండవు. కాని వాల్మీకికి గుర్తుండకపోతే ఆయన కూడా సెక్స్, సస్పెన్స్, థ్రిల్లర్ నవలా రచయితలా నామరూప రహితుడయేవాడు ఆనాడే.

**⌘ ఉపవాసం చేసినంతలో భక్తిపరులైనట్లా?**

ఉపవాసం చేసినంతలో, సుందరకాండ పారాయణం చేసినంతలో, తీర్థయాత్రలు చేసినంతలో భక్తులు కారండీ. భక్తికి అవి మార్గాలు. ఇవి చెయ్యకుండా భక్తిసాధన చేసి తరించినవారున్నారు. ఉపవాసం చేస్తున్నా మంటూ ఇంట్లో వారిని సణుగుతూ, ఇరుగు పొరుగు మీద నిందలు వేయడం వల్ల ఉపవాస ఫలం దక్కదు. ఉపవాసం ఆరంభించింది మొదలు ఫలహారానికి పదార్థాలు వెదికినా అంతే!

**⌘ సుందరకాండ పారాయణం చెయ్యడానికి నియమాలున్నాయా? ఆడవాళ్లు చదవవచ్చునా?**

సుందరకాండ, భగవద్గీత స్త్రీలు చదవరాదు అని కొందరు ప్రచారం చేస్తున్నట్లు విన్నాం.

వేదం చెప్పిన సత్యం వద, ధర్మం చర అనే రెండు ప్రధానాంశాలను నిఖిల మానవులకూ బోధించడానికి, తద్వారా వారిలో పశుత్వ, రాక్షసత్వం నాశనం చేసి మానవత్వం నిలబెట్టడానికీ రామాయణ, భారతాలు అవతరించాయి. అంతే తప్ప వీటికి రిజర్వేషన్లు లేవు. కులమతాలతో సంబంధం లేదు. ఆర్థిక స్థితితో ప్రమేయం లేదు. అందరూ వీటిని చదవాలి, వినాలి, చూడాలి, సత్యవాక్పాలనం, ధర్మ పరాయణత్వం అలవరచుకోవాలి. అదే వాల్మీకి, వ్యాసుల కాంక్ష.

**⌘ ఎంతటి పాపాత్ముడు చచ్చినా స్వర్గానికే వెళ్ళాడంటారేం?**

అదొక ఊతపదం అంతే! భూభారం తగ్గించాడని సంతోషం.

**⌘ ఈ రిజర్వేషన్లు ఇలా సాగితే వచ్చే పదేళ్లలో అగ్రకులాలు సంక్షేమ పథకాలు అవసరం కావా?**

భూమి గుండ్రంగా తిరుగుతున్నది కదా, వచ్చే పదేళ్ళదాకా దేనికి, ఇప్పుడే ప్రతిభకు 20, అప్రతిభకు 50, రెండూ కాని తృతీయా ప్రకృతికి 30 అయింది కదా, క్రమంగా ఇది తలక్రిందులవుతుంది. ఈ రావణాసురుడి కాష్టం చల్లారాలంటే కలవారూ, లేనివారూ ఉద్యోగాల బానిసత్వం కోసం పడిగాపులు పడే దరిద్ర దశ నుంచి బైటపడాలి. కోట్లకు పడగెత్తిన వారి పిల్లలు కూడా చేతులు నులుపుకుంటూ తలవంచే నౌఖరీ మనస్తత్వం పాతికేళ్ల క్రితం లేదు. పాతికవేల జీతగాడి కొడుకు కూడా రిజర్వేషనులో సీటు కోసం ఎగబడేవాడు కాదు. కాలం మారింది. ఈ బానిస మనస్తత్వ కాలం కూడా మారక తప్పదు.

**⌘ పుణ్యాత్ములెవరో దేవుని పేర ఇచ్చిన మాన్యాలను భగవత్సేవకూ, ధర్మ కార్యాలకూ వినియోగించకుండా చేయడం ధర్మమా?**

ఇది చాలా చిత్రమైన కాలం. ఎంత చిత్రమైనదంటే నాయకులందరూ బడుగు వారిని ఉద్ధరించి, ప్రజాసేవ చెయ్యడానికే జీవితాలు అంకితం చేస్తున్నామంటూ, ఎవరి పార్టీకి వారే అధినాధులై సింహాసనాలు ఎక్కాలనుకుంటున్నారు. పదవి లేకపోతే ప్రజాసేవ చెయ్యలేరు. అటువంటి కాలంలో ఎవరు ఏం మాట్లాడినా అరణ్యరోదనమే!

**⌘ పంజాబు వారు రాజర్షి జనకుని వంశానికి చెందినవారంటారు కదా! అంతటి వారిగా వంశంలో పుట్టిన వారు ఇంత హింసాకాండ ఎందుకు సాగిస్తున్నారు?**

ఏ వంశంలో పుట్టిన వాడయినా అందరిలోనూ మంచి గుణాలే వుండవు. అందరూ దుర్మార్గులూ కారు. రావణుడు పుట్టిన వంశంలోనే విభీషణుడు పుట్టాడు. దుర్యోధన, దుశ్శాసనులతో పుట్టిన వికర్ణుడే ధర్మం విషయంలో ద్రౌపదీదేవిని సమర్థించి సభ్యులందరినీ నిలదీశాడు. తులసివనంలో గంజాయి మొక్కలూ పుట్టవచ్చు. గంజాయి తోటలో మల్లెతీగలూ పెరగవచ్చు.

**⌘ భగవద్గీతలో సంజయుని పేరు ఎక్కువగా వినిపిస్తుంది. మిగతా భారతంలో వీని ప్రస్తావన లేదా?**

భగవద్గీత కృష్ణుని నోట విన్నవారు ఇద్దరు. ఎదురుగా వున్న అర్జునుడు మొదటివాడు, ఎక్కడ వున్నా, ఏం మాట్లాడుకుంటున్నా, ఎవరి మనస్సులోని ఊహలనయినా వినగలవాడు సంజయుడు రెండవవాడు.

సంజయుని నోటనే భగవద్గీత ధృతరాష్ట్రుడు శ్రోతగా మనకందినందు వల్ల గీతలో సంజయుడు కనిపిస్తాడు. అయితే అంతకు మించిన విశేషం భారతంలో వున్నది.

మహాభారతం ఆదిపర్వం నుంచి ఆశ్రమవాస పర్వంలో ధృతరాష్ట్రుడు భస్మమయ్యే వరకు సంజయుడు కనిపిస్తూనే వుంటాడు. ఎక్కడికక్కడ దుర్యోధనాదుల దుర్మార్గాన్ని నిందిస్తూ, ధృతరాష్ట్రుని లోభ బుద్ధిని తిడుతూనే వుంటాడు. ఎవరు ఎన్ని బోధించినా సావధానంగా వింటాడే తప్ప ధృతరాష్ట్రుడు లోభగుణం విడిచి పెట్టలేక వంశనాశనం తెచ్చుకున్నాడు.

సంజయుని వివేకానికి, రాజనీతికి గీటురాయి ఉద్యోగపర్వంలో రాయబార ఘట్టం నిజానికి కృష్ణరాయబారం కంటే సంజయ రాయబారం రాజనీతిలో కూడినది.

కాని అవతార పురుషుని విశ్వరూపం ముందు సంజయుడు సామాన్య నేత్రాలకు కనిపించకుండా పోయాడు. మరోసారి ఉద్యోగపర్వం చదవండి

సంజయ సంస్కారం బోధపడుతుంది.

⌘ **ఒకనాటి ధర్మం ఈనాడు అధర్మంగా, ఈనాటి అధర్మం ధర్మంగా మరోనాడు మారుతుందా?**

ధర్మం, ధర్మం అని మనం వ్యవహరించేది నిజంగా ధర్మం కాదు. ఆచారాలు, సంప్రదాయాలు, రాజకీయంగా వచ్చే మార్పులు అన్నీ ధర్మం అనుకుంటున్నాం. అసలు ధర్మ శబ్దాన్ని ఎలా నిర్వచించారంటే

**ధృతిక్షమా దమోస్తేయో**

**శౌచ మింద్రియ నిగ్రహః**

**ధీ ర్విద్యా సత్యా మక్రోధో**

**దశకం ధర్మం లక్షణం॥**

ధైర్యం, ఓరిమి, అంతరింద్రియ, బహిరింద్రయ నిగ్రహం, శుచిగా వుండడం, విద్యావంతులు కావడం, బుద్ధిమంతులై క్రోధరహితంగా సత్యవాక్పాలనా నియమంతో వుండడం - ఈ పది లక్షణాలతో వుండేవాడే ధర్మపరుడు. ఈ విషయాలు దృష్టిలో ఉంటే ధర్మం మారడం వుండదు.

ఇక మీరడిగేది వున్నదే అది మారుతూనే వుంటుంది. దేశం, కాలం, వ్యక్తి- ఈ మూడింటి మీదా ఆధారపడి ఉంటుంది.

⌘ **వరకట్నాలు రామాయణం నాడు వున్నాయా?**

రామాయణం నాడు కట్నాల మాట దేవుడెరుగు, వరుడిని ఎన్నుకునే హక్కు వధువు చేతులలో వుండేది. ఇప్పటికి వలె డిగ్రీల తరగతిని బట్టి సంతలో గిత్తలనూ, ముర్రాజాతి బర్రెలనూ బేరమాడినట్లు పెళ్ళికొడుకులను నిలబెట్టి వేలం పాడేవారు కాదు.

తన కుమార్తెను వివాహమాడే కుర్రవాడికి ఏయే లక్షణాలుండాలో ఆడపిల్ల తండ్రి నిర్ణయించేవాడు. ఈనాటి చదువుకున్న పెళ్ళికొడుకుల్లా హిరణ్యాక్ష వరాలు అడిగే హక్కు మగవాడికుండేది కాదు. అయితే ఆడబిడ్డను అత్తవారింటికి పంపేటప్పుడు సంతోషంతో సారె పెట్టడం వుంది. అది కూడా ఆడవారి ఇష్టమే.

**⌘ భగవద్గీతలో కృష్ణుడు విశ్వరూపం ప్రదర్శించి ఇతఃపూర్వం దీనినెవరూ దర్శించలేదు అంటాడు. కాని, రాయబారంలో కురుసభా భవనంలో చూపించాడు కదా?**

రాయబార సన్నివేశంలో చూపించిన విశ్వరూపం కంటే భిన్నమైన రూపం గీతలో కనిపిస్తుంది. సావధానంగా భారతం చూడండి.

**⌘ మన భాషలన్నీ సంస్కృతం నుంచి పుట్టలేదా?**

పుట్టలేదని కొందరు పట్టభద్రులు ఢంకా మ్రోగిస్తున్నారు. పుట్టినా పుట్టకపోయినా మన భాషలన్నిటికీ పాలు పట్టి పెంచి పెద్ద చేసినది సంస్కృతమే. అందుకే జనని సంస్కృతంబు సర్వభాషలకును అన్నారు వివేకవంతులు.

**⌘ భారత రామాయణాలకు మసి పూసి మారేడు చేసి, విషవ్యాఖ్యాలు చేస్తున్నారే?**

చెయ్యనివ్వండి. ఇది ఈనాటి విషబీజం కాదు. రామాయణం, భారతం బహుజనాదరణ పొందిననాడే ఆ విషాహారులు విజృంభించారు. అక్కడదాకా ఎందుకు కాళిదాసు కవితకే దుర్వ్యాఖ్యా విషం ఎక్కించేవారికి విరుగుడుగా సంజీవనీ వ్యాఖ్య అందించాడు మల్లినాథుడు. సత్యవాక్పాలన, ఏకపత్నీవ్రతం కిట్టని నాగరిక, ధూమపాన పరాయణ జీవనక్రియలకు కల్పవృక్షం కంటే విషాహారమే ఆరోగ్యం. అందుకోనివ్వండి వారిని.

**⌘ సీతాదేవి రావణాసురిని కూతురా?**

ఈ అనుమానానికి ఆధారం సీతాదేవి మీద గౌరవమా, రావణుని మీద వాత్సల్యమా?

రావణుడు ఎంత రాక్షసుడైనా ఈనాటి త్రాగుమోతుల వలె మైకంలో కన్నతల్లినీ, సొంత కూమార్తెనూ కౌగలించుకొనేవాడు కాదు. కాకపోగా లంకలో ఏడాది వుంచినా ఆమెను బలాత్కరించకుండా-

నీ మనసు నాయందు అనురాగంతో వుంటేనే నా అంతఃపురానికి రా, అని కూడా అనగలిగినంత నిగ్రహం గలవాడు. అంతవరకే వాల్మీకి చెప్పాడు.

**⌘ జ్యోతిష్యం నిజంగా శాస్త్రమా?**

శాస్త్రం ఎప్పుడూ శాస్త్రమేనండీ, అయితే శాస్త్రం చదివి ఫలితాలు చెప్పే వారున్నారే వారివల్ల దీని ప్రతిష్ట దెబ్బతింటుంది. మరొక రహస్యం. వారఫలాల పేరిట ప్రజలలో మూఢవిశ్వాసాలు పెంచుతున్నారనే పెద్దలే తమ ప్రచురణలో ఒకే లగ్నంలో పుట్టిన వారందరికీ ఆ వారం అంతా ఒకే ఫలం చెప్పించి ముంచుతున్నారు.

నిజంగా శాస్త్ర సాంప్రదాయం దానికి విరుద్ధం. ఆ విధంగా జ్యోతిశ్శాస్త్రం చదివిన వారివల్ల దానికి శాస్త్ర గౌరవం పోతున్నది.

**⌘ మనసు పరిపక్వం కావడానికి వయసుతో సంబంధం వున్నదా?**

వయసు పెరిగే కొద్దీ మనసు పక్వం అయే అవకాశం లేకపోలేదు. అయితే వయసు మీదపడినా మనస్సు మొద్దుగా వుండేవారు ఎక్కువగా కనిపిస్తారు.

వయసు పెరుగుతున్నంతలో మనసు పక్వం కాదు. దానికి తగిన కృషి సాగాలి. బాల్యంలోనే పరిపక్వమైన మనసు కలవారు కూడా కనిపిస్తారు. దీనికి కారణం పూర్వజన్మసుకృతం అని కొందరు చెపితే, పూర్వజన్మ ఏదీ లేదు అనేవారు వీరినీ పరిహాసం చేస్తారు.

గణిత శాస్త్రవేత్తలు రామానుజం, శకుంతల, ఎనిమిదేళ్లు రాకుండానే శాస్త్రబద్ధంగా సంగీతం పాడగలిగిన బాలమురళి, శ్రీనివాస్ మున్నగువారికి ఆ శక్తి ఎలా వచ్చిందంటారో.

**⌘ శివపురాణాలలో విష్ణువు శివభక్తుడుగా వుంటాడు, విష్ణు పురాణంలో శివుడు హరిభక్తుడుగా వుంటాడు?**

చమత్కారం చూశారా! శివపురాణం, విష్ణు పురాణం రెండూ భక్తుల కోసమే. అందులో ఆయన ఈయననూ, ఈయన ఆయననూ ఆరాధన చేస్తున్నారంటే ఇద్దరికీ భేదం లేదనే కదా. ఈ పరమ రహస్యం తెలియక వారు వీరినీ, వీరు వారినీ హింసించుకుంటున్నారు.

**"శివాయ విష్ణురూపాయ**
**శివ రూపాయ విష్ణవే"**

అని చెబుతూ వున్నా వివేకం రావటం లేదు. శివకేశవులే కాదు - ఈశ్వర, అల్లా, ఏసూ, అన్నీ 'తేరే నామ్' అని గాంధీజీ వంటి మహనీయులు బోధిస్తున్నా మతోన్మాదం మనుషుల మనసుల్లో విషబీజాలు పోస్తూనే వుంది.

ఇంకో రహస్యం- బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడా తపస్సు చేస్తున్నారని పురాణాలలో చదువుతాం, దాని అర్థం ఏమిటీ? ఈ ముగ్గురికీ అతీతమైన శక్తి ఒకటి వున్నది. దానినే ఆదిశక్తి, పరాశక్తి అనీ, అదే పరమాణువు నుంచి బ్రహ్మాండం వరకూ వ్యాపించి వున్నదనీ ధీమంతులు చెబుతారు.

దానినే ప్రహ్లాదుడు-

**ఇందుగలడందులేడని**

**సందేహము వలదు చక్రి**

**సర్వోపగతుండెందెందు**

**వెదకి చూచిన అందందే**

**కలడు** దానవాగ్రణి వింటే అన్నాడు.

### ⌘ నువ్వులనూనె మర్దన చేసి తలంటుపోసుకోకూడదా?

పిల్లలకు ఆముదం పెడితే అనారోగ్యం, చెవిలో, కంట్లో నువ్వుల నూనె వేస్తే ప్రమాదం, నెత్తికి కొబ్బరినూనె తగలకూడదు అని నేటివారు చెబుతున్నారు.

కాని రెండు మూడు దశాబ్దాల క్రితం వరకూ ఆముదం త్రాగి పెరిగిన మన తాతలు, అమ్మమ్మలు పిడుగుల్లా వున్నారు. నువ్వులనూనె మర్దన చేసుకుని చెవిలో, ముక్కులో పోసుకున్న వీరి ఇంద్రియాలు హాయిగా పనిచేస్తున్నాయి. కొబ్బరినూనె వాడిన వాళ్ళ జుట్టు ఇరవై ఏళ్ళు రాకుండానే తెల్లబడలేదు. ఇది మన కళ్ళ ఎదుటే కనబడే విషయం.

### ⌘ భారత రామాయణాలు చదివితే పుణ్యమా?

పుణ్యం అని కొందరంటారు. పుణ్యం లేదు. పాపం లేదు అనే వారికి ఈ గ్రంథాలు వివేకం కలిగించి, మంచిదారిలో పెడతాయి.

### ⌘ కౌసల్య తెలుగు వారి ఆడబిడ్డ అనీ, రాముడు ఆంధ్రుల మేనల్లుడనీ...?

రామాయణం ఈ జాతిని ఎంత ప్రభావితం చేసిందో మీరు విన్న కథ వల్ల

తెలుస్తుంది. కోసల రాజపుత్రిని తీసుకొచ్చి కోనసీమ కొబ్బరితోటకు అంటు కట్టేవరకూ మనకు తృప్తి కలగలేదు.

⌘ **ఎప్పుడో ఎవరో ఒక వర్గాన్ని అణగద్రొక్కారని ఈనాడు వారిని అణగద్రొక్కడం న్యాయమంటారా?**

ఆదిలో ఈ రిజర్వేషన్లు విశాల హృదయంతో పదేళ్ళుండాలని భావించారు, ఆ తరువాయి సింహాసనాలెక్కిన వారందరూ రాజకీయ ప్రయోజనాల సాధనకే ఈ అణగద్రొక్కుడు విధానం వాడుకుంటున్నారు. ఇది తోడేలు మేకపిల్ల కథలా తయారవుతున్న మాట వాస్తవం.

⌘ **కులాలు ఎలా పుట్టాయి? శాఖలు ఎలా ఏర్పడ్డాయి?**

మానవుల గుణాన్ని, కర్మను- అంటే చేసే వృత్తిని బట్టి - కులాలు ఏర్పాడ్డాయని గీత చెపుతోంది. అంటే మీ ప్రవర్తన, మీ వృత్తి కులానికి ప్రాతిపదిక. క్రమక్రమంగా ఒక కులానికి చెందిన వారికి పుట్టిన వారందరూ అదే కులం వారయారు. కాగా పోగా దేశంలో ఇంగ్లీషు చదువులొచ్చి ఉద్యోగాలూ, ఎన్నికలు వచ్చి పదవులు రావడంతో కులాల మధ్య అనుబంధాలు తెగిపోయి కులద్వేషాలు మండుతున్నాయి.

కులాలు నశించాలి అనే పెద్దలు తమ కులం చుట్టూ కందకాలు త్రవ్వి రాతిగోడలు పెట్టుకుని ఎదుటి కులాల మీద రాళ్ళూరప్పలూ రువ్వుతున్నారు. ముందు కులద్వేషాలు పోవాలి, ఆ తరువాత కులాలు పోతాయి. ఇక శాఖలంటారా, ఇవన్నీ ప్రాంతాలను బట్టి వచ్చాయి. అందులో ముఖ్యంగా ప్రయాణ సౌకర్యాలు లేని రోజులలో - (ఈనాడు మండలాల వలె) ఆనాడు వెలనాడు, పలనాడు, వేగినాడు, కాసల్నాడు, తెలంగాణమూ ఇలా పిలిచేవారు. ఈ ప్రాంతాలవారిని ఆ శాఖవారిగా భావించేవారు. కులాల కంటే ఈనాడు 'కొమ్మ' భేదాలు కొమ్ములు మొలిపించుకొని కొమ్మ ఎక్కి కూర్చున్నాయి. ఇవన్నీ పోవాలంటే మళ్ళీ నిస్వార్థంగా జాతిని నడిపే ఋషితుల్యులైన నాయకులు పుట్టాలి. అంతవరకూ మతోన్మాదం, కులద్వేషం అనే జాడ్యాలు జాతిని కాలుస్తూనే వుంటాయి.

**⌘ దేశానికి స్వాతంత్ర్యం రావడానికి గాంధీగారే కాదు. ఎందరో విప్లవకారులు కూడా వున్నారు...**

కాదన్న మాదన్న ఎవడు? భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, అల్లూరి సీతారామరాజు, సుభాష్‌చంద్రబోస్.... ఇలా శత సహస్రనామాలు నిత్య పారాయణం చేసుకోవాలి - యువతరంలో విశృంఖలత్వం కాక జాతీయ భావం నెలకొల్పాలంటే.

**⌘ భగవద్గీత హిందూ మతగ్రంథం కాదు, బుద్ధుని బోధలు అనుసరించిన ఆచార్యుల రచన అంటున్నారు.**

అనమనండి. క్రీస్తు, మహమ్మద్ అందరు బోధించేదీ అదే. 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ...' అదీ గీతాసారం.

మానవుడు ఏ మతానికి చెందిన వాడయినా మోక్షాన్ని కోరుతున్నట్లయితే అధర్మాలూ, అన్యాయాలు ధర్మకార్యాలూ కూడా విడిచిపెట్టి ఆ పరంజ్యోతిని ఉపాసించే ఏకాగ్రత అలవరచుకోవాలి. అప్పుడు మతం పేరిట ప్రచారాలు, హింసాకాండ వుండవు.

**⌘ పాపపుణ్యాలున్నాయా? స్వర్గనరకాలు కూడా వున్నాయా?**

పాపం, పుణ్యం అంటే ఏమిటో తెలిస్తే నరకం స్వర్గం తేలిపోతాయి. ఎదుటి ప్రాణికి భౌతికంగా, మానసికంగా హింస కలిగించడం కంటే పాపం లేదు. మనకు ఉన్నదానిలో లేనివారికి పంచిపెట్టి, ఆకలితో వున్నవారికి, ఆపదలో పడినవారికి సాయుం చెయ్యడం కంటే పుణ్యం లేదు. పదిమందిచేత మంచిదనిపించుకోవడమే స్వర్గం. వీడి పీడ ఎప్పుడు పోతుందిరా అనిపించు కోవడం నరకం. మీరే చెప్పండి. స్వర్గం మంచిదో, నరకం కోరుకోవాలో.

**⌘ రావణాసురుడు లక్ష్మణ స్వామికి బోధించిన రాజనీతి విశదీకరిస్తారా?**

తప్పకుండా- కాని హోరాహోరీగా సాగిన రామ రావణ సంగ్రామంలో చివరి రోజున రామచంద్రుడు విడిచిన బ్రహ్మాస్త్రంతో నేలకూలిన రావణుడు ఆ క్షణంలోనే ప్రాణాలు విడిచాడని రామాయణం చెపుతున్నది.

ప్రాణహీనమైన రావణ శవం బోధించేదేమిటో వాల్మీకి ఊహకు అందలేదు.

నాకు ఏం తెలుస్తుంది?

శవాల చేత మాట్లాడించగల క్షుద్రసాహిత్య రచయిత ఎవడో రావణుని మీద అనురాగంతో లక్ష్మణస్వామిని రాజనీతి నేర్చుకోవడానికి పంపించాడు.

లోకానికి ధర్మ బోధచేసి సత్యవాక్పాలన వ్రతం ప్రబోధించడానికి సింహాసనాన్ని విడిచి వచ్చిన రాముడు ఒక దుష్టుని వద్దకు ధర్మోపదేశం కోసం పంపడం మామూలు మనిషి బుర్రలో పుట్టే ఆలోచన కాదండి. చచ్చిన రావణుని మీద జాలితో కట్టిన కథ.

※ **నిత్యం ఎన్నో వేలమంది మరణించడం వింటున్నా, చూస్తున్నా, మృత్యువుకి భయపడడం దేనికండీ?**

చమత్కారం అదే. ఆచార్య శంకరభగవత్పాదుల వారొకమాట అన్నారు. ప్రపంచంలో అత్యాశ్చర్యకరమైనదేవిటంటే ఈ దేహానికి తొమ్మిది రంధ్రాలున్నాయి. ఈ తొమ్మిది చిల్లులలో దేని నుండి ప్రాణవాయువు వెళ్ళిపోయినా పోవచ్చు. కాని అది వెళ్ళకుండా సంవత్సరాల తరబడి దేహంలో ఎలా ఉంటున్నదో! ఇంతకన్నా ఆశ్చర్యం ఏం వుంది. దాన్ని అలా వుంచుతున్న పరాశక్తికి తలవంచాలి అని.

చచ్చిన వాళ్ళ కోసం చావబోయేవాడు ఏడవడం కంటే అవివేకం లేదు. కాని మనిషి వున్నాడే ప్రాణాల మీద తీపి పెంచుకుంటూ, దాని కోసం ఎన్ని అత్యాచారాలు, అకార్యాలూ చేస్తూ లక్షలు, కోట్లు కూడబెడుతున్నాడో. భూమి మీదకు వచ్చేటప్పుడు ఎలా వచ్చాడో, అలానే వెళ్ళిపోతాడు. అయితే వాడు చూసిన మంచి, చెడు మాత్రం పుణ్యపాపాల పేరుతో వుంటాయి.

※ **రాముడు రామలింగ ప్రతిష్ట చేసినపుడు రావణుడు పురోహితుడుగా వచ్చాడా? ఇది వాల్మీకి కవిత్వమా? సొంత పైత్యమా?**

రామలింగ ప్రతిష్ట విషయమే రామాయణంలో లేదు. ఇక రావణ పౌరోహిత్యం.... ఈ కథ కట్టిన మహనీయుల మనస్సు రామభక్తితో వున్నదో, రావణారాధనతో వున్నదో తెలియదు.

※ **చిన్ననాటి స్నేహమును మరిచిపోవు వారినేమందురు?**

సింహాసనం దొరకగానే బాల్యస్నేహాన్ని మరచిన ద్రుపదునికి ద్రోణుడు జరిపిన పరాభవం ఎరుగుదురుగా- కుచేలుని గాఢాలింగనం చేసుకున్న కృష్ణుడు దేవుడైన సంగతీ విని ఉండాలి. ఈ రెండూ గ్రహించిన వారు స్నేహాన్ని విస్మరించరు.

※ **పురాణకాలంలో స్త్రీని పవిత్రంగా ఆరాధించేవారు. ఈనాడింత అధోగతి ఎందుకు ఏర్పడింది?**

ఆనాడూ ఈనాడూ పవిత్రంగా ఆరాధనలు పొందే పతివ్రతలు లేకపోలేదు. అయితే ఆ కాలంలో శూర్పణఖలు తక్కువ. అంతే.

※ **భారత, రామాయణ, భాగవతాలకు సంబంధం ఏమిటి?**

మూడూ కలిసి మనిషిని బ్రతికించడానికి అవతరించాయి. అదే సంబంధం. ఒకటి ఇతిహాసం, రెండోది కావ్యం, మూడోది పురాణం.

※ **ఆముదం వాడితే శరీరానికి మంచిదా?**

మంచి వంట ఆముదం అరికాళ్ళకు, తలకు మర్దన చేస్తే దేహానికి చలువ చేస్తుంది. అరికాళ్ళ మంటలు, పగుళ్ళు తగ్గుతాయి. జుట్టు నున్నగా ఒత్తుగా పెరిగి తెల్లబడకుండా వుంటుంది.

※ **వినాయకుడు ఏకదంతుడెలా అయ్యాడు?**

పరశురాముడు ఇరవది యొక్క మారు ధరణీశుల నెల్లర చంపి, పశ్చాత్తాపంతో తన గురువైన శివుని దర్శనానికి రాగా, అంతఃపుర ద్వారంలో వున్న వినాయకుడు అడ్డగించాడు. పరశురాముడు ఆగ్రహంతో గండ్రగొడ్డలి తీయగా వినాయకుడు దంతాలతో అడ్డుకున్నాడు. నాటి నుంచీ ఏకదంతు డయ్యాడు. ఇది ఒక పురాణ గాథ.

※ **కర్ణుడి భార్యకు పేరు లేదా?**

కర్ణుడు దాకా దేనికి, దుర్యోధనుల వారి భార్యకు పేరు లేదు మహా భారతంలో. భానుమతి అనేపేరు కొందరు చెబుతారు కాని అది వ్యాస భారతంలో లేదు.

※ **భగవంతుని స్వరూపం ఎలా వుంటుందో?**

అది తెలిసి వుంటే ఇంకా ఈ సమాధానాలిచ్చే అవివేకంతో కొట్టుమిట్టాడే దశ ఉండేదా! దాన్ని దర్శించడానికే ఈ తాపత్రయం.

**⌘ రామాంజనేయ యుద్ధం ఎందుకు జరిగింది?**

అది రామాయణం నాటి కథ కాదు. కలియుగంలో ఏ కవిగారి బుర్రలో ప్రవేశించిందో!

**⌘ దేవతలలో స్త్రీలకు, పురుషులకు కూడా శ్రీ అనే అంటారు. శ్రీమతి లక్ష్మి, శ్రీమతి కాళిక అనరేం?**

శ్రీ అనేది శుభప్రదం అనే అర్థంలో దేవతలకు వాడుతారు. అయితే మీరు సూచించిన శ్రీమతి వున్నదే ఇది ఇంగ్లీషు వారి వ్యవహారం. వారి మిస్టర్ మన వారికి శ్రీ అయ్యింది. మిస్టర్ గారి ఇల్లాలు శ్రీమతి అయింది.

సీతారాములు, లక్ష్మీనారాయణులు, పార్వతీ పరమేశ్వరులు అనేవి దాంపత్య సూచకాలు అలనాడు.

దొరల వాసనతో లక్ష్మీఈశ్వరన్ అంటే ఈశ్వరన్ గారి భార్య, సీతా పరమ శివన్ అంటే పరమశివుని భార్య - ఇలా తయారయాం.

ఆ కాలంలో సీతాదేవి భర్తను సీతారాముడనే వాళ్లం, అది మోటుగా తోచినట్టుంది. వ్యామోహం.

**⌘ కొందరు ఆడవాళ్ళు నిరంతరం దేనికో దానికి సణుగుతూ సాధిస్తూ వుంటారు, ఈ రోగానికి చికిత్స లేదా?**

ఈ సణుగుడు వున్నదే ఇది శరీరానికి వచ్చే రోగం కాదు. మనస్సును పట్టిన వ్యాధి కాదు. ఈ రెండింటికీ అతీతంగా 'జీవి'తో దిగుతుంది.- దానికి మందు లేదు. దానికి కారణం అసంతృప్తి. ఈ అసంతృప్తి ఒక విషయంలో కాదు, జీవించి వుండడమే బాధ వీరికి, వారే కాదు, ఎవరూ బ్రతకకూడదు.

సోక్రటీస్ నుంచి రామానుజుల వరకూ తమ ధర్మపత్నుల సణుగుడుతో హాయిగా విరాగులై లోకానికి శాంతి ఇవ్వగలిగారు. కాని, వారి కొంపలో మాత్రం సణుగుడు ఆగలేదు.

నిజానికి ఇలా సణిగే వారున్నారే వారి ఆయుర్దాయం త్వరగా క్షీణిస్తుంది

అని హితవు చెప్పామనుకోండి.

నేను త్వరగా చావాలని కోరుతున్నావా? అని గొణుగుతారు.

అయితే సణుగుడు వల్ల బాధపడే ఎదుటి వారున్నారే వారికి మనస్సు నరాలు పాడయి, రక్తపోటు పెరుగుతుంది. మీరు చూశారో లేదో...

తేలు చెంబునీ, చేటనీ కుట్టినట్టు వీరు ఎదురుగా మనిషి లేకపోతే గోడనీ, చీపురుకట్టనీ కూడా సణుగుతుంటారు. అదొక రకమైన ఉన్మాదం. వీరికి ఆసుపత్రులు లేవు.

**⌘ రామాయణ, భారతాల కాలంలో కూడా వస్త్రధారణ ఇలానే ఉండేదా?**

ఇంత దారుణంగా వుండేది కాదు. ఈ దేశానికి, ఈ గాలికీ సరిపడేటట్లు పలుచని నూలుతో నేసుకునేవారు. ఈ ఉష్ణ దేశానికి గాలి ఆడని రసాయన వస్త్రాలు పనికిరావు అని వారెరుగుదురు.

ఈ దేశంలో అగ్గిపెట్టెలో ఆరుగజాల చీరమడత పెట్టగలిగిన చేనేత నిపుణులుండేవారనీ, బ్రిటిష్‌వారి ధర్మమా అని ఆ శక్తిని నాశనం చేయడానికి బొటనవ్రేళ్ళు నరికించారని విని ఉంటారు చరిత్ర చదివితే.

**⌘ గీతోపదేశం పొందిన అర్జునుడు ఆవేశంతో ధర్మరాజుపై కత్తి దూయడం న్యాయమా?**

కాదు, కాని భగవద్గీత వంటబట్టడానికి ఒక జన్మ చాలదు. దానికి ఉదాహరణ అర్జునుడే. ఈ మనస్సున్నదే అది శుద్ధ రాగి చెంబు, నిరంతరం రాగ, ద్వేషాలనే కిలంతో నిండుతుంటుంది. దాన్ని భగవద్గీతా శ్రవణ, మనన రూపమైన చింతపండు పెట్టి తోముతూ వుండాలి.

**⌘ దేవేంద్రుని వద్ద వున్న కామధేనువు జమదగ్నికీ, వశిష్ఠుల వారికి ఎలా లభించింది?**

కామధేనువు యొక్క సంతానం అని పురాణాలు చెబుతున్నాయి.

**⌘ ద్రౌపది బ్రహ్మరాక్షసియా?**

ఏ బ్రహ్మ రాక్షసుడు చెప్పాడీ మాట.

**⌘ ఈనాడు విద్యావంతులే - కుల, మత, వర్గ కలహాలు రేపుతున్నారే, ఇదేనా**

విద్య నేర్పవలసినది?

ఈ కుల, మత ద్వేషాలు రేపుతున్నవారు విద్యావంతులు కాదు, వీరు చదువు''కొన్న'' వారు, కొన్నదాన్ని విక్రయించి లాభాలు గడించాలి కదా. చదువుకు మించిన వ్యాపారం ఏమున్నదీనాడు.

చదువు కొనుక్కుని దాంతో ఉద్యోగాలు కూడా కొనుక్కుంటున్న సమాజం యిది. కాలేజీలో పిల్లలకు విద్య నేర్పవలసిన లెక్చరర్ ఉద్యోగాలు వేలం పాటకు దిగాయి. ఏం చేస్తాం, ఇది వరలో డఫేదారులే చెయ్యి జాపేవారు. ఇప్పుడు వేలు సంపాదించేవారు కూడా ముష్టి కోసం చేతులు బల్లక్రింద పెడుతున్నారు. చదువు, ఉద్యోగం వున్న ముష్టివాళ్ళు పెరగడం వల్ల ఆకలితో బాధపడే బిచ్చగాళ్ళ బ్రతుకు దుర్భరమవుతూ వున్నది.

**⌘ ఈనాటి మనిషికన్నా పశువులు, పక్షులు సుఖంగా బ్రతుకుతున్నాయనుకుంటా?**

అందుకు సందేహమా? అవి అబద్ధం ఆడలేవు, దొంగతనం చెయ్యలేవు. రేపు తిండి దొరుకుతుందో లేదోనని ఏడుస్తూ మూడు తరాలకు సరిపడే సిరిసంపదలు పాతి పెట్టుకు కూర్చోవు. అయితే వాటి స్వేచ్ఛను కూడా మనం విషధూమంతో, కలుషిత జలాలతో కల్తీమందులతో నాశనం చేస్తున్నాం.

**⌘ భీష్ములవారు అంపశయ్య మీద పరుంటే అవి గుచ్చుకోలేదా?**

సున్నితమైన సూదితో ఇంజక్షన్ చేయించుకుంటే మూడురోజులు వేడినీళ్లతో కాపడం పెట్టించుకునే దుర్బల దేహాలతో వున్న మనకు కలుగవలసిన సందేహమే యిది. కాని పిడుగులు పడుతున్నట్లు పిడిగుద్దులతో మల్లయుద్ధం చేసే కింగ్‌కాంగ్, దారాసింగ్‌లను చూస్తే ఈ అనుమానం రాదు. అలానే కరాటే యోధులను చూసినా ఆశ్చర్యం కలగదు.

అంతదాకా దేనికి? అయిదు కిలోల పంచదార తెచ్చేసరికి నరాల పీకుడు జాతి దిగిందిప్పుడు, మన ఎదురుగానే బస్తాలకు బస్తాలు లారీల మీదకు ఎక్కించే బక్క ప్రాణులున్నారు ఈ నాటికీ.

బహుశా సంవత్సరం క్రితం అనుకుంటా, బ్రెజిల్‌లో ఒక దొంగ పారిపోతుంటే

16 బుల్లెట్లు వాని శరీరంలో నడిపించారు పోలీసులు. అయినా వాడు పరిగెడుతూనే వుంటే పట్టుకుని హాస్పిటల్‌కు తీసికెళ్లి పరిశీలిస్తే ఆ శరీరంలో అంగుళం మందాన కొవ్వు బలిసి వున్నట్లు తెలిసింది.

ఇంత యాంత్రిక ధూమం వాతావరణాన్ని కలుషితం చేసిన రోజులలో అంత బలిష్టులుంటే అయిదు వేల సంవత్సరాల క్రితం గాలి, నీరు, ఆహారం ఏ కల్తీ లేకుండా దొరికే కాలంలో ఉదయం, సాయంత్రం రెండు మూడు గంటలు వ్యాయామం చేసే తరంలో పుట్టిన బ్రహ్మచర్య దీక్షితుడైన భీష్మునికి బాణాలు గుచ్చుకుని బాధించడం అసంభవం. చిన్ననాటి నుంచీ ఆసనాలు వేస్తూ, ప్రాణాయామం చేస్తే మీరు కూడా సాధించగలరు ఆ శక్తిని.

⌘ **కృష్ణుడు అర్జునుడొక్కడికే గీతను ఎందుకు బోధించాడు? అందరికీ బోధిస్తే...?**

బోధిస్తే కురుక్షేత్ర యుద్ధం లేదు. యుద్ధం లేకపోతే దుష్టశిక్షణ లేదు. అత్యాచారాలు జరిపే దుర్యోధన, దుశ్శాసన సంహారం లేదు. చివరకు మహా భారతం లేదు.

⌘ **భారతంలో విదురుడు దేహయాత్ర చాలించాడని ధర్మరాజు గ్రహించాడు. భాగవతంలో దీనికి భిన్నంగా కనిపిస్తుంది?**

దేవరహస్యం అక్కడే వుంది. ఈ భారత, భాగవతాలు జరిగాయని నమ్మితే ప్రతికల్పంలోనూ యివి కొద్ది కొద్ది తేడాలతో జరుగుతూనే వుంటాయి. కల్పభేదం వల్ల కథాభేదం వస్తుంది. అయితే ప్రధాన కథలో తేడా వుండదు. చిన్ని చిన్ని సంఘటనలలో మార్పులు వస్తాయి.

జరగలేదని అనుకుంటే వీటిని కూడా ఒక్కసారి చదివి తూకానికి అమ్మే సీరియల్స్‌లా వదిలేయండి.

⌘ **వాలి సుగ్రీవులు అహల్య సంతానమా?**

ప్రప్రథమంగా వాలి సుగ్రీవులు ఈ లోకానికి దిగినది వాల్మీకి రామాయణంలో. దాని ప్రకారం వారు ఋక్షరజసుని కుమారులు. ఇక గౌతముని భార్యయైన అహల్య కుమారుడు శతానందుడు, జనక మహారాజుగారి కులగురువు.

⌘ **దేవుడొక్కడే కదా, ఆయన కొందరికి కృష్ణుడుగా, కొందరికి క్రీస్తుగా ఎందుకు అనిపిస్తున్నాడు?**

క్రీస్తు దేవుని బిడ్డయే కాని దేవుడు కాదనుకుంటూ, యెహోవా అంటారు దైవాన్ని క్రీస్తు మతానుయాయులు. ఇస్లాంవారు అల్లా అంటారు. ఎవరు ఏ పేరుతో పిలిచినా వున్నది ఒక్కటే.

ఆదిని శబ్దము వుండెను అని బైబిలు బోధించినా, "ఓం" ఇత్యేకాక్షరం బ్రహ్మ అని వేదం చెప్పినా రెండూ ఒకే సత్పదార్థాన్ని సూచిస్తాయి.

ఎవరు ఏ పేరుతో పిలిచినా బాధలేదు. ప్రధానమైనది నిర్మలమూ నిశ్చలమూ అయిన మనస్సు అనే సత్యాన్ని విస్మరించి ఒకరినొకరు ద్వేషించు కుంటూ, సంహారాలు సాగిస్తున్నారు. ఇదంతా దేవుని తృప్తి కోసమే అనుకునే అవివేకం నుంచి బయటపడాలి. దానికి పరిష్కారం మత నిర్మూలనం అని కొందరు మేధావులు వాదిస్తున్నారు. మతంకాదు, మత విద్వేషం, మతోన్మాదం చావాలి.

⌘ **మన పండుగలన్నీ ఇంగ్లీషు తేదీల ప్రకారం క్రమంగా రావు, సంక్రాంతి మాత్రం తప్పనిసరిగా ఎలా వస్తుందో?**

మిగిలిన పండుగలు అన్నీ చాంద్రమాసం ప్రకారం నడుస్తాయి. చైత్రశుద్ధ నవమి, శ్రావణ బహుళ అష్టమి, ఆశ్వయుజ శుద్ధ దశమి ఇలా. సంక్రాంతి వున్నదే ఇది సూర్యగమనానుసారం వస్తుంది. సూర్యుడు సరిగ్గా 365 రోజుల అరపూట పై చిలుకులో మళ్ళీ మకరరాశిలో ప్రవేశిస్తాడు. ద్వాదశ రాశులలో నెల తప్పకుండా నడుస్తాడు. చంద్రుడు నెలకు ఓసారి వస్తే, మరోసారి 27కే రావచ్చు. అందుకే అధికమాసాలు, క్షయమాసాలూ.

⌘ **అనవసరంగా గుడులు కట్టి భక్తి అనే నల్లమందు పోయడం కంటే హాయిగా బడులు కట్టి చదువు చెప్పరాదా?**

బడులలో ఎందరు చదువుతున్నారు? ఈ చదువులు ఉద్యోగాలివ్వని నాడు హాయిగా వీధులు తుడవడం, బూట్‌పాలిష్ చేయడం మంచిదనుకుంటున్నారే, ఈ దేశంలో బడులు విప్పి గుడులు కట్టాలేమో.

ఒకనాడు ఈ దేశంలో గుడులలోనే విద్య నేర్పువారు, అది పొట్టకూటికి కాదు. అప్పుడు డొనేషన్లు లేవు. చదువుకుంటాననే వాడికి తిండి, బట్ట ఇచ్చి నేర్పేవారు. పొట్టకూటికి విద్య దిగడంతో డిగ్రీలు కూడా పచ్చి మిరపకాయ బజ్జీలవలె వీధిలో అమ్మకానికి దొరుకుతుంటే గుడులు పడగొట్టడం దేనికంటా!

❋ **రావణుడు, విభీషణుడు చక్కని అందగాళ్ళని వర్ణించిన వాల్మీకి శూర్పణఖను అంత వికారంగా ఎందుకు వర్ణించాడు?**

శూర్పణఖలానే చూపించేవాడు. వాస్తవానికి రావణ, కుంభకర్ణ, విభీషణులు ఒక తల్లి కడుపున పుట్టారు. అయినా కుంభకర్ణుని దేహం, స్వభావం చూశారుగా, మరి విభీషణుని ధర్మబుద్ధి గమనించారా... శరీరాకారాలే చూసి వూరుకున్నారు మీరు. శూర్పణఖ-రావణుడు పినతల్లి పెత్తల్లి బిడ్డలు.

❋ **కొడుకుల మీద చూపే అభిమానం కూతుళ్ళ మీద ఎందుకు చూపరు, ఇద్దరూ ఆ దంపతుల సంతానమే కదా?**

అంతకంటే అవివేకం లేదు. ఈ అజ్ఞానం ప్రాచీనకాలంలో లేదు. మధ్య కాలంలో వచ్చిపడింది. మగవాడు తలకొరివి పెడితేకాని ఉత్తమగతులుండ వనుకునే వారి అజ్ఞానం అది, కాని ధర్మశాస్త్రం దౌహిత్రునికి కూడా కర్మాధికారం యిచ్చింది. పైగా నూరుగురు కొడుకులున్నారు ధృతరాష్ట్రునికి అయితేనేం కర్మకాలింది కదా.

❋ **కట్టుకున్న భార్యను హింసిస్తూ, కన్నతల్లిదండ్రులకు తిండిపెట్టనివాడు సంఘసేవ, దేశసేవ చేస్తానంటే...?**

ఏం చేస్తాం, తన విధిని తాను గుర్తించకుండా పోయేవాడిని 'విధి' ఏం చేస్తాడో చూద్దాం. తల్లికి తిండి పెట్టనివాడు అన్నదానాలు చేస్తున్నాడంటే వాడికి పరమార్థం కంటే స్వార్థమే శరణాలయం.

❋ **పది నిమిషాలు కదలకుండా కూర్చుంటే కాళ్ళు తిమ్మిరెక్కుతున్నాయి, ఆ కాలంలో మునీశ్వరులు ఎలా కూర్చునేవారు?**

కూర్చుంటే కాళ్ళు తిమ్మిరెక్కుతున్నాయి, పడుకుంటే ఒళ్లునొప్పులు, నడిస్తే ఆయాసం. ఇదీ యాంత్రికయుగంలో లభించిన దశ.

ఆనాటి ఋషులకు ఆ అవసరం లేదు. ఈనాటికీ పద్మాసనం వేసి గంటల తరబడి భగవదారాధన చేయగలవారున్నారు, రామాయణ భాగవతాలు పారాయణ చేసేవారున్నారు.

దానికి చిన్ననాటినుంచీ సాధన కావాలి. మూడేళ్ళు రాకుండానే స్కూలు బస్సులు ఎక్కి, కాన్వెంటులో కునికిపాట్లు పడే చదువు ప్రారంభించి, అయిదు నెలలు నిండకుండానే, తల్లి చంకలో కూర్చుని భయానక, బీభత్స నగ్న సుందరీమణుల ప్రదర్శనలతో నిండిన సినిమాలు చూస్తూ పెరుగుతున్న జనానికి తిమ్మిరి మాత్రమే మిగులుతుంది.

అలాకాకుండా ఉదయం, సాయంత్రం రెండు మూడు మైళ్ళు పచ్చని చేలగట్ల మీద నడిచి పరిశుభ్రమైన గాలి పీలిస్తే, అనుభవజ్ఞుల దగ్గర ప్రాణాయామం, ఆసనాలు అభ్యాసం చేస్తే మన శరీరం మన స్వాధీనంలో వుంటుంది తిమ్మిరెక్కకుండా.

ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ తిండి తింటూ, త్రాగుతూ, ధూమపానం చేసే జీవితానికి అలవాటుపడితే వయసు రాకుండా పుంస్త్వం చస్తుంది.

**⌘ భారత రామాయణాలు జరిగాయంటారా?**

జరగకుండా వుంటే ఎంత బావుండునూ అనుకుంటాను. ఎందుకంటే జరగని కథలు రాసి జరిగిన చరిత్ర కంటే బలంగా తరతరాల వారి నరనరాలలోకి ఆ పాత్ర స్వరూప స్వభావాలను ఎక్కించడం, ఏటేటా సీతారామకళ్యాణాలు, కృష్ణ జయంతులు చేయిస్తూ లక్షలాదిమందికి ఆ గాథలు వినడంలో ఎంతో మనశ్శాంతినీ, వివేకాన్ని ఇస్తున్నారు అని రాసిన వ్యాస వాల్మీకులు.

జరగనివే రాశారనుకోండి, అంత జాగ్రత్తగా ఆయా వ్యక్తుల అంతరాలలోకి వెళ్లి వారి గుణశీలాలను ఎంత విశ్లేషించి ఇచ్చారు.

అందుకే అరవింద యోగి అన్నాడు, ఈ ప్రపంచం అంతా నాశనమైనా రామాయణం నా చేతిలో వుంటే మళ్ళీ సృష్టించగలను అని.

**⌘ ప్రత్యక్ష దైవం అయిన భర్తను వదిలి గుడుల వెంట, ఆశ్రమాల వెంట**

**తిరిగేవారిని ఏమనాలి?**

ప్రత్యక్ష దైవం కంటే పరోక్ష దైవమే కాపాడాలనుకునే వారయివుంటారు. కన్న సంతానాన్ని నిత్యం హింసించేవాళ్ళు ఆ పిల్లల శ్రేయస్సు కోసం నోములూ, వ్రతాలూ చేస్తారు. అలానే భర్తను కాల్చుకుతినే వాళ్ళు భర్త ఆయుర్దాయం కోసం పూజలు చేస్తారు. ఈ ప్రవృత్తి మనకర్థం కాదు.

⌘ **పుడుతున్నారు, పెరుగుతున్నారు, పోతున్నారు, ఏమిటీ దీని రహస్యం?**

ఆ సృష్టి రహస్యం తెలుసుకుందామని ఎందరో ముక్కు మూసుకు కూర్చున్నారు, ఇప్పటికీ నోరు విప్పలేదు వారు.

⌘ **అయ్యప్పస్వామి హరిహర పుత్రుడా?**

అని ఆయన భక్తులంటున్నారు. ఆయన ఎవరి పుత్రుడైనా, మనకు బాధలేదు. కొన్ని వేలమందిని 40రోజుల పాటు సిగరెట్లకీ, సీసాలకీ, స్త్రీలకూ దూరంగా వుంచి ఆరోగ్యం కాపాడుతున్నారు. అంతకంటే ఏం కావాలి. ఆ పేరు చెప్పి యింతమంది దీక్ష వహించి కామ, క్రోధాలకు లొంగకుండా వుంటే చాలదా!

⌘ **సుందరకాండలో అరిష్ట పర్వతం వున్నదా? లేక ఆ పర్వతం అరిష్టాలు తెస్తుందా?**

పర్వతం పేరే అరిష్టం. దానిమీద ఎక్కిన హనుమంతుడిని అదృష్టం వరించిందే కాని అరిష్టం కాదు.

⌘ **తల్లిదండ్రుల పాప పుణ్యాల ఫలం పిల్లలను పీడిస్తాయా?**

పుణ్యఫలం తెలియదు కాని వారు చేసిన దుష్కర్మల వల్ల వచ్చే రోగాలు తరతరాలనూ పీడిస్తాయని వైద్యులు చెబుతున్నారు.

⌘ **శ్రీరాముని కన్నా సీత పెద్దదంటారా?**

పెద్దలెవరూ అనరు, బుద్ధిమంతులూ అనరు, అది వక్రించిన వారు అంటూంటారు.

⌘ **ఉదయం లేవగానే దైవప్రార్థన చేయాలని వుంటుంది. కాని లేవగానే ఏదో తింటేగాని వుండలేను. ఏం చెయ్యాలి?**

తినగలిగింది తిని దేవుని మీద మనసు నిలపండి, అంతేకాని ఎప్పుడు ప్రొద్దు గ్రుంకుతుందా, ఫలహారం చేద్దామనుకుంటూ ఉపవాసం చేసే వారి దొంగభక్తి నిష్ప్రయోజనం.

**✠ చిన్ననాటి నుండీ వుండే గాజులు, బొట్టు, పువ్వులూ భర్త మరణిస్తే ఎందుకు నిషేధిస్తారు?**

అంతేకాదండీ! నిగనిగలాడే జుట్టు తీయించే దురాచారం కూడా వుంది. ఈ దుర్దశ ఎప్పుడు వచ్చిందో తెలీదు. అలానే, సహగమనం దురాచారం కూడా.

రామాయణంలో దశరథునితో ఎవరినీ సజీవదహనం చెయ్యలేదు. భారతంలో మాద్రి స్వయంగా పాండురాజు దేహం మీద పడింది. మరెవరూ సహగమనం చెయ్యలేదు. అలంకారాలు తీసి, కేశఖండనం చేయించలేదు.

ఈ దేశం మీదికి కిరాతులు దండయాత్ర సాగించినప్పుడు వారి కీచకత్వానికి తమ శీలాన్ని బలిపెట్టలేని స్త్రీలు అగ్నిగుండాలలో దూకేవారు.

ధనం కంటే, ప్రాణం కంటే మానం ఈ జాతికి విలువైనది. అందుచేత ఈ దురవస్థ ఏర్పడింది. పరిస్థితులు మారినా మూర్ఖులు కొందరు బలవంతంగా సజీవదహనాలు సాగిస్తుంటే రాజా రామమోహన్‌రాయ్ పూనుకుని సహగమనం నిషేధింప చేశాడు. అలానే వీరేశలింగం పంతులు నడుంకట్టి పునర్వివాహాన్ని అంగీకరింపజేశారు.

**✠ చేసేదీ, చేయించేదీ, పుట్టించేదీ, గిట్టించేదీ అన్నీ నేనే అన్నాడు కృష్ణభగవానుడు. అటువంటప్పుడు అందరినీ మంచివారినే సృష్టిస్తే అవతారాలెత్తి అవస్థ పడనవసరంలేదు కదా!**

పుట్టించి, గిట్టించి, చేసి చేయించే లీల కలిగిననాడు అవతరించి దుష్టశిక్షణ శిష్ట రక్షణ చేయడం అవస్థ ఎలా అవుతుంది. అది కూడా ఒక వేడుక. పిల్లలు పిచ్చుకగూళ్ళు కట్టి చివరకు తన్ని పారేస్తారే, అలాగే, ఆయన ఆడుతున్నాడు.

**✠ ధృతరాష్ట్రుని కొడుకులందరి పేర్లు దుర్యోధన, దుశ్శాసన, దుస్సల - ఇలా 'దు'కారంతోనే పెట్టడం దేనికో?**

అందరికీ ఆ అదృష్టం లేదు. వికర్ణుడు, వివింశతి, విశాలాక్ష, క్షేమధూర్తి

ఆదిగా గలవారు కూడా ఆ శతకంలో వారే.

- **పాపం, పుణ్యం, సమాజ నిబంధనలు - ఇవన్నీ మానవునిలో పశుత్వాన్నీ, దానవత్వాన్నీ, నాశనం చెయ్యడానికే అనీ, అలానే దేవుడు కూడా అంటున్నారు.**

అక్షరాలా ఒప్పుకుంటున్నాను, కావలసింది 'మంచి' మానవత్వం.

- **మనిషికీ, మతానికీ ఏమిటి సంబంధం?**

మనిషిలో పశువుని నాశనం చేసి దివ్యత్వం వైపు నడిపేది మతం, మనిషి వుంటేనే మతం వుంటుంది. భక్తులుంటేనే భగవంతుడుంటాడు.

- **రావణుడు సీతను అపహరించుటలో మరొక ఉద్దేశ్యం వున్నది?**

ఉన్నదనేవారికి రావణుడు తన అంతఃపురంలో అన్ని దేశాల నుంచి తెచ్చిన అందగత్తెల అనుభవాలు తెలియవు. ఆ భామలందరినీ ఎందుకు తెచ్చాడో ఈమెనూ అందుకే తెచ్చాడని సుందరకాండలో గొంతుచించుకుని వాని నోట వాడు చెప్పినా వినని బధిరులకు వందనాలు.

- **జాంబవంతుని గుహలో ఉయ్యాలలో పడుకున్న జాంబవతిని కృష్ణునికిచ్చి పెళ్ళి చేశాడా?**

చేశాడండీ, తొట్టి ఉయ్యాలలో పడుకున్న నెలగుడ్డు కాదు ఆ అమ్మాయి. తూగుటుయ్యాలలో పడుకున్న పడుచుపిల్ల.

- **ద్రుపద పుత్రుడు ద్రోణుని శిష్యుడెలా అయ్యాడు?**

ఆనాడు దేశ దేశాల క్షత్రియ కుమారులు ద్రోణాచార్యుని శిక్షణలో ఆరితేరిన వారే. కర్ణుడూ, సాత్యకీ కూడా ఆ విద్యాలయంలో విద్యార్థులే.

- **రాజ్యం పెద్దవాడైన ధృతరాష్ట్రునిది కదా, పాండవులెలా అడిగారు?**

అక్కడే పెద్దచిక్కు. గ్రుడ్డివాడు, కుంటివాడు, మతిభ్రష్టుడు సింహాసనార్హుడు కాదు. కనుకనే పాండురాజు పట్టాభిషిక్తుడయాడు. అందుచేతనే యువరాజు పట్టం ధర్మరాజుకి కట్టారు. భారతం చదవండి. ధృతరాష్ట్రుడే చక్రవర్తి అయితే దుర్యోధనుడే యువరాజు పీఠం ఎక్కాలి.

**హీనాంగం పృథివీ పాలం**

**నాభి నందంతి దేవతాః**

అవయవ హీనుడు రాజైతే దేవతలు హర్షించరు, కనుక మరో కుమారుడు కావాలని రాజమాత సత్యవతి అడిగినప్పుడే వ్యాసుడు పాండురాజుని పుట్టించాడు. అది ఆదిపర్వంలో కథ, చివరి అనుశాసన పర్వంలో ధృతరాష్ట్రుడు మాట్లాడుతూ ఈ రాజ్యాన్ని మా తాతగారు శంతనుడు పాలించాడు. మా తండ్రి విచిత్రవీర్యుని మరణానంతరం మా తమ్ముడు పాండురాజు పాలించాడు అంటాడు. ఇప్పుడు కొంత తెలిసి వుంటుంది.

⌘ **పుస్తకం తీసి చదువుదామనుకుంటే కళ్లు మూతలు పడతాయి. నిద్రపోదామంటే కంటి రెప్పవాలదు.**

ఈ నాగరిక యుగం ప్రసాదించిన శాపం అది. మనస్సు నిలకడగా వుండదు. ఏవేవో ఆలోచనలు, దుష్టవాంఛలు. దాని చుట్టూ ఈగల్లా ముసురుతూ చదువుకోనివ్వవు, నిద్రపట్టనివ్వవు.

ఈ దురవస్థ నుండి బయటపడాలంటే శరీరాన్ని ముందు ఆరోగ్యంగా వుంచాలి. ఆరోగ్యంగా వుండే దేహంలో మనస్సు ఆరోగ్యంగా వుంటుంది.

నియమితకాలంలో ఆహారం మితంగా తీసుకుంటూ తూర్పున సూర్యుడు రాకుండా నిద్రలేచి రెండు మూడు కిలోమీటర్లు నడిచి చల్లని నీరుతో స్నానం చేసి వేపడాలూ, తామసం కలిగించే పదార్థాలు ముట్టుకోకుండా వుంటే కొంత ఆరోగ్యం చేకూరుతుంది.

పుస్తకం చదువుతూంటే నిద్రవచ్చే సూచన రాగానే, కాసేపు చల్లగాలిలో తిరిగి చల్లని నీటితో ముఖం కడిగి, నాలుగైదుసార్లు దోసిటనిండా నీళ్ళు తీసుకుని కనురెప్పలు తడపండి. మళ్ళీ పుస్తకం తీయండి.

నిద్ర పట్టనప్పుడు చల్లని నీటితో కాళ్ళు, ముఖం కడిగి, అరికాళ్ళకు కొబ్బరినూనె మర్దన చేసి వెల్లగితలా పడుకుని మనసులోకి ఆలోచనలు రాకుండా చూడండి.

⌘ **రాముడు మానవుడే కదా, దేవుడని ఎందుకు పూజించాలి?**

రాముడు కాదు ఏ మానవుడైనా పాదాల ముందుకు వచ్చిన రాజ్యభోగాలు విడిచి సత్యవాక్పాలన బద్ధుడై, ఏకపత్నీవ్రతం పాటిస్తే వానిని దైవంగా ఆరాధించాలి, పంచాయితీ సభ్యత్వం కాపాడుకునేందుకు నానా పాట్లు పడే నాయక సమాజంలో వున్నాం మనం! అటువంటప్పుడు దైవం ఎక్కడ కనిపిస్తాడు.

⌘ **కార్టూన్లు మన దేవతల మీదనే వేస్తారేం?**

మిగిలిన మతాలవారి దేవుని రూపం ఆ మత ప్రవక్తలు కూడా ఎరగరు కనక! వారెప్పుడూ పరలోకమందే దయాదాక్షిణ్య మూర్తులై ఉండాలి కనక.

⌘ **శ్రీనాథుడు రచించిన శృంగారకావ్యాలు లోకంలో ప్రఖ్యాతాలైతే, ఈనాటి శృంగారకథలు అశ్లీలంగా కనిపించి అపఖ్యాతి పాలవుతున్నాయేం?**

ప్రాచీనులు రాసిన కావ్యాలు చదివేవారిలో అప్పటికే కొంత చిత్త సంస్కారం ఏర్పడి ఉంటుంది. ఆ కళలను రసదృష్టితో చూడడానికి అనుకూలంగా మనస్సు పక్వమై ఉంటుంది.

ఈనాడు రాసే వారిలో చిత్తసంస్కారం లోపిస్తున్నది. ఇక చదివేవారి విషయం అంటారా? అజ్ఞానం అనాలో అగ్నానం అనాలో తెలియక కృతజ్ఞత కూడా కృతగ్నతగా పలికే గురువుల దగ్గర నూటికి 30శాతం తెలిసిన పట్టభద్రులు, ఇంకేం చెప్పమంటారు?

⌘ **పార్వతీ పుత్రుని శిరసు శివుడు ఖండించాడా? శని దృష్టివల్ల పోయిందా? ఏది నిజం?**

పురాణగాథలున్నాయే, అవి ఒక్కో కల్పంలో ఒక్కో రకంగా ఉంటాయి. కల్పభేదం వల్ల కథ మారుతుంది.

⌘ **వ్యాసుని కుమారుడైన శ్రీ శుకులవారికి వేదాంతం బోధించిన జనకుడు రామాయణ కాలం వాడేనా?**

జనక శబ్దం వారి వంశాన్ని చెపుతుంది. సీతాదేవి తండ్రి జనకుని పేరు సీరధ్వజుడు. శుకుని గురువు ఆ వంశంలోవాడే.

⌘ **త్రిమూర్తులలో ఎవరిని ఆరాధించాలి?**

మూర్తులు మూడు కాని అసలు శక్తి ఏకమేవా ద్వితీయం. ఏ నామాన్ని జపించినా సుఖమే.

**⌘ వేంకటేశ్వరస్వామిని బాలాజీ అంటారెందుకు?**

ఏడుకొండల మీద వున్న విగ్రహం "బాలాత్రిపురసుందరి" హరిహరమూర్తి అని కొందరు భావిస్తారు. మనం కమలనాథుడైన శ్రీమన్నారాయణుడుగా ఆరాధిస్తాం. ఏమైనా దేశదేశాల నుంచి భక్తులను ఆకర్షించే అతీతశక్తి ఏదో ఆ విగ్రహంలో వున్నది అనేది ప్రత్యక్షంగా కనిపించే సత్యం.

**⌘ సముద్రం మూడడుగులు వెనక్కు తగ్గిందనీ, అందువల్ల మళ్ళీ గోదావరి వరద ముంచుకొస్తుందనీ అంటున్నారు?**

సముద్రం మూడడుగులే కాదు ముప్పై అడుగులు కూడా వెనక్కుపోతూ ఉంటుంది. పోటు తగ్గి పాటులో పడినప్పుడు, పూర్ణిమ, అమావాస్యలలో ఈ పాటు పోటు చూడవచ్చు. దానికీ గోదావరి ముంపుకూ ముడిపెడితే నెలనెలా మునుగుతుంటాం.

**⌘ శ్రీకృష్ణులవారి ఎనిమిది మంది రాణులలో రుక్మిణి, సత్యభామ, జాంబవతి... వీరి కథలు తెలుసు, మిగిలినవారిని ఎప్పుడు ఎలా పెళ్ళాడారు?**

భాగవతం చదవడానికి ప్రయత్నిస్తే సంతోషం! కాదంటే అచ్చ తెలుగులో నీలాసుందరి పరిణయం ఉన్నది, కాళిందీ పరిణయకావ్యం గ్రంథాలయాలలో దొరుకుతుంది.

**⌘ నిర్వికారుడైన దేవుడు మన మీద కోపాన్నీ, ద్వేషాన్నీ చూపుతాడా?**

నిర్వికారుడికి ఏ చూపూ ఉండదే, ఇంక కోపతాపాలెక్కడివి.

**⌘ దుర్యోధనుడికి సార్వభౌమ బిరుదం వుంది, ధర్మరాజుగారికి లేదేమి?**

యువరాజు పదవి కూడా లేనివాడు దుర్యోధనుడు. అయినా ఈనాడు చూస్తున్నారుగా కవిసార్వభౌమ, గాయక సామ్రాట్, మిమిక్రీ శార్దూల, నట గార్దభ ఆదిగా గల బిరుదులు తమకు తామే తగిలించుకుంటున్నారే, వీరందరికీ గురుపీఠం ఇవ్వడానికి దుర్యోధనుడికి సార్వభౌమ బిరుదం ఇచ్చి అపఖ్యాతి

పాలు చేశారు ఆ పదాన్ని.

❋ **భారత రచనా కాలంనాడు భూగోళం ఎలా వుండేది?**

కురుక్షేత్ర యుద్ధప్రారంభ సమయంలో - ఇదే ప్రశ్న ధృతరాష్ట్రుడడిగాడు. సంజయుడు వివరించాడు చదవండి.

❋ **సుందరకాండలో సీతాదేవితో మాట్లాడే రావణుని గాఢాలింగనం చేసుకుని వెనుకకు మరలించుకుపోయినది 'ధాన్యమాలిని' అని వాల్మీకి వ్రాశారు. అదే విషయాన్ని హనుమంతుడు రామునితో చెపుతూ "దారా మండోదరీ నామ" అంటాడేమిటీ?**

లంకలో తిరుగుతున్న హనుమంతునికి రావణుని పట్టమహిషి పేరు మాత్రమే తెలుసు. మిగిలిన రాణుల నామాలు తెలిసే అవకాశం లేదు. పైగా రావణునంతవాణ్ని మందలించి వెనుకకు త్రిప్పగలిగే శక్తి పట్టమహిషికే వుంటుందని హనుమంతుడు భావించాడు. ఆ దృష్టితోనే వాల్మీకి హనుమంతుని చేత మండోదరి పేరు చెప్పించాడు. అందుకే ఆయన ఆదికవి.

❋ **కురుక్షేత్రంలో అంత కోలాహలం మధ్య ధర్మరాజు "అశ్వత్థామ హత..." అంటే ద్రోణాచార్యులకు ఎలా వినిపించింది?**

పెళ్ళికీ, చావుకీ మైకు రాక్షసి వాడవాడలా ధ్వని కాలుష్యం పెంచి, గుండె దడ వృద్ధి చేయని కాలంలో హరికథాపితామహుడు ఆదిభట్ల నారాయణదాసు గొంతెత్తి "శంభో" అంటే పదివేల మందికి వినిపించేది. ఈ శతాబ్ది పూర్వార్థంలోనే ఇంత గంభీర కంఠం వుంటే అయిదువేల సంవత్సరాల క్రితం ఎలా వుండాలి గాత్రాలు, ఏ కాలుష్యమూ ప్రకృతిని నాశనం చేయని రోజులలో-

❋ **అరసెంటు ఆస్తికోసం, ఆడదాని కోసం అన్నదమ్ములు హత్యలు చేసుకుంటున్నారే, పాండవులయిదుగురూ అంత అన్యోన్యంగా ద్రౌపదితో ఎలా గడిపారు?**

గడిపారు కనుకనే ప్రపంచంలోని అధికార భౌతికవాదులు, గతితార్కిక మేధావులు భారతాన్ని తమ దేశ భాషలో వ్రాయించి పారాయణం చేస్తున్నారు.

భగవద్గీత బట్టీపడుతున్నారు.

**⌘ వేమన బంగారం చేశాడా?**

అప్పటి మాట తెలియదు గాని ఈనాడు మనుషులకు బంగారుబాట మీద నడిచేదారి చూపాడు శతకం అందించి.

**⌘ భారత యుద్ధంలో భీముడు విసిరిన రథాలు ఆకాశానికి ఎగిరాయంటారు?**

అంటారు కవులు. అతిశయోక్తి అని ఒక అలంకారం వుంది. దాని ప్రకారం పది మైళ్లు పరిగెట్టగలిగితే వంద మైళ్ళవుతుంది. నీకు లక్షసార్లు చెప్పినా బుద్ధి రాదు అంటుంటారు పెద్దలు, అదే యిది.

**⌘ రాజర్షి అని ఎవరినంటారు?**

చతురంగ బలాలు సేవిస్తుంటే అంగరంగభోగాలు అందుబాటులో వున్నా తామరాకు మీద నీటి బిందువులా భోగభాగ్యాల మీద మనసు పడకుండా, పరతత్వాన్ని ఉపాసిస్తూ కర్తవ్యాన్ని నిర్వర్తించే ప్రభువులు రాజర్షులు. వారిలో అగ్రేసరుడు జనక మహారాజు.

**⌘ పురాణాలలో కనిపించే అద్భుతాలన్నీ నిజాలా?**

చమత్కారం ఎక్కడున్నదంటే పురాణాలూ, ఇతిహాసాలూ వేదం ప్రతిపాదించిన ధర్మాన్ని మానవులకు సులభంగా, సుఖంగా అర్థం చేసుకోవడానికి పుట్టిన కథలు. వేదార్థోప బృంహణంగా వ్రాస్తున్నానని వ్యాస భగవానుడు గొంతెత్తి ఘోషించాడు. ఆమాట వినిపించుకోకుండా కథలనే పట్టుకు ప్రాకులాడే మేధావులు పెరిగారు.

కథ అనేది పంచదార పూత, ఆ కథ బోధించే నీతి మన మనుసులో మాలిన్యాలను క్షాళనం చేసే రసాయనం. దాన్ని సేవించాలి.

**⌘ అసభ్య నృత్యాలు, అశ్లీల పాటలు, అవకతవక పోరాటాలూ సాగించే సినీ నటులను ఆరాధించేవారిని ఏమనాలి?**

వారి అభిరుచి ఎప్పటికయినా మారుతుందా? అని ఎదురుచూడడం తప్ప ఇంకేమయినా అంటే మన మొహాన బురద పడుతుంది.

**⌘ లవకుశులకు పిల్లలు లేరా?**

ఎందుకు లేరూ. కాని చెప్పుకోదగ్గ ఘనకార్యాలు చేయని పుల్లయ్యల పేర్లు ఎవరికి కావాలి?

⌘ **దెయ్యాలూ, భూతాలకు భయపడేవారు ఆంజనేయస్వామినే ఎందుకు స్మరిస్తారు?**

దెయ్యాలూ, భూతాలు ఉత్తి గాలి, ఆంజనేయస్వామి గాలి కొడుకు.

⌘ **సినిమాలో శవాలన్నిటినీ దహనం చేస్తారు. కాని పాతిపెట్టరేం?**

ఆ శవాలను కూడా పాతిపెడితే భూగోళం చాలదు కాబోలు! అయినా ముస్లిం క్రైస్తవ శవాలను పాతిపెడతారు. సినిమా అయినా సరే.

⌘ **సీతాకళ్యాణానంతరం విశ్వామిత్రుడు ఏమయ్యాడు?**

రామాయణంలో ఆయన పాత్రకు అదే ప్రయోజనం. ఆ తరువాత ఆయన కథ రామాయణ కవికి అవసరం లేదు. అలానే మిగిలిన పాత్రలూ.

⌘ **రామాయణంలో పిడకలవేట ఏమిటో?**

లోక కళ్యాణార్థం అవతరించిన సీతారాముల కథ వింటున్నా పిడకల మీదికే మనస్సుపోయే మందభాగ్యులమాట.

⌘ **రామాయణ కాలం నుంచీ స్త్రీని ఆటబొమ్మగానే ఆడిస్తున్నారు?**

రామాయణంలోనే కాదు. భారతంలో కూడా ఆటబొమ్మలు లేరు. నేటి భారతంలో, ప్రేమాయణాలలో వ్యాపారులు డబ్బు కోసం ఆడిస్తుంటే అందు కోసమే ఆడుతున్నారు కొందరు ఆడవాళ్ళు. భారత రామాయణాలు శ్రద్ధగా చదవండి. మగవాళ్లని ఆడించిన కైకమ్మలు, నిండు సభలో న్యాయం కోసం నిలబడి వాదించిన ద్రుపదరాజ నందనలు కనిపిస్తారు. ఝాన్సీరాణులు, రుద్రమదేవులు, పలనాటి నాగమ్మలు చరిత్రలో వున్నారు.

⌘ **రామాయణం మీద వ్యాఖ్యానించే అర్హత వైష్ణవులకే వున్నదని శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు వాక్రుచ్చినట్టు పత్రికలో చదివాను?**

పత్రికలలో కొన్ని రగడలు రేపడానికి ఉపన్యాసాల నుంచి వెనుక ముందులు లేకుండా వేస్తూంటారు. అలాకాక వైష్ణవుల సొత్తు రామాయణం

అని శివతాండవ మూర్తి పుట్టపర్తివారే అని వుంటే వాల్మీకి వైష్ణవుడేనా? అని అడగండి. రామాయణంలో రాముడు-

**ఆత్మానం మనుషం మన్యే**

**రామం దశరథాత్మజం**

అని ఎందుకనవలసి వచ్చిందో ద్వాదశ ఊర్ధ్వ పుండ్ర ధారులు చెపితే సంతోషిద్దాం. భద్రాచల రాముడు వైష్ణవుల సొంత సొత్తు కావచ్చు కాని వాల్మీకంలో రాముడు నిఖిల ప్రపంచానికీ, అన్ని మతాల వారికీ ఆదర్శ పురుషుడు, సద్గుణాలు రూపుదాల్చిన పూర్ణపురుషుడు. అయితే ఆధ్యాత్మ, ఆనంద, తులసీ, రంగనాథ రామాయణాల మీద వైష్ణవులే వ్యాఖ్యానం చేసుకోవడం మంచిది.

వాల్మీకం ఎవరికి ప్రైవేట్ లిమిటెడ్ కాదు, కారాదు, కాబోదు.

⌘ **సాధింపు అత్తగార్లను ఏ వైద్యానికి పంపాలి?**

సణుగుడు, సాధింపు తమ అత్తగారి నుంచి వారికి సంక్రమించిన రోగం. ఈ రోగానికి చికిత్సలేదు.

⌘ **లంక నుంచి తిరిగి వచ్చే రాముడు గుహుని చూడలేదా?**

భరద్వాజుని ఆశ్రమం నుంచి హనుమంతుని పంపుతూ రాముడు గుహుని చూసి వెళ్ళమంటాడు. దయచేసి రామాయణం కొని ముమ్మారు చదవండి. స్నేహ ధర్మం సేవా ధర్మం - ధీర శక్తులు పెరుగుతాయి.

⌘ **దేవాలయంలో ధ్వజస్తంభ ప్రాధాన్యం ఏమిటి?**

ముందుగా వాస్తుశాస్త్రం ఏం చెబుతుందో చూద్దాం.

**శిఖరం శిరః గర్భః కంఠః**

**హృదయంచాంతరాళం**

**కుక్షి స్థానంతు మంటపం**

**ప్రాకారం జాను జంఘం**

**గోపురం పాదయుగ్మం**

**ధ్వజంతు జీవస్థానంః**

దేహమే దేవాలయమని, శరీరమని, ఆత్మయే విశ్వామిత్రుడైన పరమేశ్వరుడనీ, ఆత్మసాక్షాత్కారమే జీవి లక్ష్యమని ఆదిలో భావించారు. అలా అంతర్ముఖులు కాలేని వారి కోసం నిర్మించిన ఆలయాలు దేహరూపమే. అందులో ధ్వజస్తంభం లింగస్థానం పతాకంపైన ఎగురవేసే స్తంభం.

ఇంకా వివరాలు కావాలంటే శైవ వైష్ణవ ఆగమాలు చూడండి.

⌘ **తమరు భారత, రామాయణాలతో తృప్తి పడండి. ఆధునిక విజ్ఞానం వైపు తిరిగి మీ మూర్ఖత్వాన్ని, మూఢ బుద్ధిని ప్రజల మీద రుద్దకండి.**

గాలిని, నీటిని, మందులను, ఆహారాన్ని, సర్వాన్ని కలుషితం చేసే కర్మాగారాలు, ఎరువులు, పురుగుల మందులు ఇవన్నీ భారత, రామాయణాలు పుట్టించినవేనా? ప్రపంచాన్ని ప్రళయంలో ముంచడానికి వినియోగపడే అణ్వస్త్రాలు ఎవరి భిక్ష? కట్టిన వంతెనలు ప్రారంభోత్సవానికి ముందే కూలడం, ఆపరేషను చేసి కత్తెరలు కడుపులో వదిలి కుట్లు కుట్టడం విజ్ఞాన శాస్త్రజ్ఞుల తెలివి కాక భారత, రామాయణాలు చదివిన మూర్ఖుల మూఢుల వివేకమా!

⌘ **శ్రీరాముడు ద్రావిడుడా?**

చమత్కారం ఏమంటే రామాయణం జరిగిందని అనుకుంటే ఆనాడు చూసి వ్రాసిన వాల్మీకి కంటే, ఈనాడు చెపుతున్న ఈ పెద్దలు రాముని అరణ్యవాస యాత్ర స్వయంగా చూసి ఇంతకాలం ఊపిరి పీలుస్తూ బ్రతికివచ్చి మనకోసం ఈ పరమ రహస్యాన్ని ఆవిష్కరించినందుకు సాష్టాంగపడాలి.

ఈనాడు సముద్రంలో ద్వారకా నగరం వున్నదని పరిశోధనలు చెపుతున్నట్టే మరికొన్నాళ్ళకు శ్రీరాముని వనవాస విశేషాలు బయటపెట్టినప్పుడు ఈ వింధ్యపర్వతం దగ్గర తలబ్రద్దలు కొట్టుకొంటున్న మేధావులు సముద్ర లంఘనానికి సాహసిస్తారు. అంతవరకు వారిని గాలిలో మొగ్గలు వెయ్యనివ్వండి.

⌘ **సినిమాలలో పంతుళ్ళనీ, పోలీసులనీ హేళనగా చూపిస్తున్నారే అది న్యాయమా?**

న్యాయం చూపిస్తే మీరు సినిమాలను పోషించలేరుగా. ముష్టివాడి వేషానికి

లక్షలు పుచ్చుకునే నటులను పడకగదిలో బొమ్మల రూపంలో ఆరాధించే జాతి ఇది. ముష్టివాడు కనబడితే పదిపైసలు వేయాల్సి వస్తుందని ద్వారంలో గూర్ఖానీ, భవనంలో ఆల్సీషియన్ కుక్కలను పోషించే జాతి. దీని దౌర్బల్యాల మీద దోపిడీ చేస్తున్నది సినిమా.

**⌘ ఎవరైనా ఆయుర్దాయం వున్నంత కాలమే జీవిస్తారా?**

ఈ సందేహం ఎందుకు కలిగింది? ఆయుర్దాయం వున్నంత వరకే జీవిస్తారు. ఏ వైద్యుడైనా రోగానికి చికిత్స చేస్తాడు. ఆయుర్దాయాన్ని పెంచలేడు. ఆ శక్తి వుంటే అంతరిక్షంలో విహరించే విజ్ఞానం వృద్ధి చెందిన దేశాలలో సైంటిస్టులు అమరులయేవారు. కనుకనే ఆపరేషను జయప్రదం, ప్రాణి ఎగిరిపోయింది- అంటారు.

**⌘ రామాయణంలో రావణుడి లంక ఈనాటి శ్రీలంక కాదా?**

కాదనలేము, ఔననలేము. ఎందుకంటే ఈ భూగోళం ఎప్పుడూ ఒకే రకంగా వుండలేదు. వుండబోదు.

లక్షల సంవత్సరాల క్రితం ఈ గోళంలో అయిదు ఖండాలు లేవు. అంతా ఒకే మట్టిముద్ద. ఒకనాడు అగాధసముద్రం వుండే చోట హిమాలయాలు మొలిచాయి అని శాస్త్రజ్ఞులు అంటున్నారు. పర్వతాలు పెరుగుతున్నాయి. నదులు గతులు మారుస్తున్నాయి. సముద్రాలు ఒక వంక మేటవేసి మరోవైపు పల్లెలు, నగరాలు మునుగుతున్నాయి. ఖండాలు అటూయిటూ జరుగు తున్నాయి. అందుచేత లంక శ్రీలంకకి ఆటోయిటో వుండవచ్చు.

అదీగాక రామాయణంలోనే కిష్కంధకాండలో భూగోళ వర్ణన వుంది. భారతంలో భీష్మపర్వంలో భూగోళ విశేషాలున్నాయి. ఈ రెండింటిలో తేడా కనిపిస్తుంది. అంటే రామాయణం నాటి భూగోళం భారతం నాటికి మారింది. రెండూ చదివి గ్రహించండి.

**⌘ కర్ణుడు సూర్యుని కొడుకు, యముడూ అంతేకదా?**

సూర్యునికి కృతయుగంలో పుట్టినవాడు యముడు, ద్వాపరం నాటి వాడు కర్ణుడు. ఇక యుగాలు నిలిచే దివ్యరూపాలకు వావివరసలుండవు, ఈ బాధలన్నీ

మానవులకే.

**※ సుందరకాండ పారాయణం చేసినవారికి కష్టాలు ప్రాప్తిస్తే..?**

రామకోటి రాయడం, సుందరకాండ పారాయణం చేయడం ఇవన్నీ భౌతికమైన క్లేశాలు తొలగించి ధనలక్ష్మిని మన ఇనుప బీరువాలోకి తెస్తాయని ఎవడు చెప్పాడు?

కోతిలా గంతులు వేసే మనస్సునూ, వరదలా పొంగుకువచ్చే కామ క్రోధాలనూ అరికట్టి బుద్ధిని పారమార్థికం వైపు మరలించడానికే ఈ ప్రయత్నాలు.

**※ శివుని భార్య గంగ, ఈవిడే శంతనుని చేపట్టిందా?**

భగీరథుడు తపస్సు చేసి గంగను భూమికి దింపినప్పుడు దాని వేగాన్ని నెత్తిన నిలిపినవాడు శివుడు.

గంగా గౌరీ సంవాదం పేరిట సినిమాల దాకా ఎక్కిన జానపద గీతం పురాణాల నుంచి పుట్టలేదు. పుక్కిట బుట్టిన కథ.

**※ ఇతర మతాలవారు మన ప్రసాదం తింటే పాపం వస్తుందా?**

విగ్రహారాధకుల మొహం చూస్తేనే పాపం వస్తుందని భయపడే వారికింకా ప్రసాదం పెట్టి పాపాత్ములను చేయడం దేనికి? జీడిపప్పు, కిస్మిస్, ఏలకులు, కుంకుమపువ్వు, కర్పూరం తగిలించి చేసే సత్యనారాయణస్వామి ప్రసాదం, తిరుపతి లడ్డు ఒకసారి రుచి చూడమనండి. మళ్ళీ అడగకపోతే చూద్దాం.

**※ భగవంతుడు దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు అవతరించాలి కదా, మరి కలిపురుషుడు పాపులనే కాపాడుచున్నాడేమి?**

కలిపురుషుడు పాపులకు పోషకుడు, కల్కిపురుషుడు రానున్నాడు. కలినీ, వాని సేవక పరివార ఆశ్రిత వర్గాలనూ నాశనం చేయడానికి అని భాగవతం ఘోషించింది.

**※ సూర్యచంద్రులను పాము మ్రింగితే గ్రహం వస్తుందా? ఎంత మూర్ఖులు హిందువులు?**

పాము మ్రింగడమే అయితే అది ఏ మాసంలో ఏ తిథి నాడు మ్రింగుతుందో శతాబ్దాలుగా పంచాంగం వ్రాసే పిలక బ్రాహ్మణుడికి ఎలా

తెలుస్తుంది? ఆ పంచాంగ కర్తకు ఇంగ్లీషు అక్షరాలు రావే.

సూర్య, చంద్ర, భూభ్రమణ కక్ష్యలకు రాహుకేతువులని సంకేతం.

ఈ మూడూ తిరిగే క్రమంలో ఒకదానికొకటి ఎప్పుడు అడ్డు వస్తుందో చెప్పేది గణితం. ఆ గణితం తెలిసిన పంచాగ కర్త గ్రహణ సమయాన్ని చెపుతూంటే పాములు మ్రింగుతాయనే మూర్ఖులు హిందువులనే వారి మూర్ఖత్వం ఎలాంటిది. కామెర్ల రోగికి లోకం ఎలా కనిపిస్తుంది.

⌘ **'నేను' అనగా ఏమి?**

అది తెలుసుకుందామని ఉపనిషత్తులూ, గీతా, దర్శనాలు అవతరింప జేశారు. ఆ బాదరబందీ పడలేక రామానుజులవారు భక్తిమార్గాన సాగమన్నారు. అసంఖ్యాకులకు అదే శరణ్యం.

⌘ **అభయహస్తం అంతటా ఎలా ఉంటుంది? తిరుపతి వెంకన్న చెయ్యి వెనుకకు తిరిగి వుంటుందేం?**

తిరుపతి స్వామి కుడిచేయి వరద హస్తం కాగా, ఎడమ చేయి కట్యావలంబి హస్తం, అంటే తనను స్మరించేవారిని రక్షిస్తాడని భావం అంటారు వైష్ణవ స్వాములు.

⌘ **భగవద్గీత చివరలో అర్జునుడు తన అజ్ఞానం నశించిందన్నాడు కదా! అభిమన్యుని మరణవార్త విని ఎందుకు శోకించాడు?**

గీతాప్రబోధంతో మోహాంధకారం పటాపంచలైనమాట వాస్తవమే. కాని అది పూర్తిగా ఒంటబట్టలేదు. అర్జునుడికే కాదు, ధర్మరాజుకే ఆ వ్యామోహం వదలలేదు. జీవితాంతం గీతాపారాయణం చేస్తూ ప్రవచనం జరుపుతూ వుండేవారికి కూడా కామ, క్రోధాలు చావవు. తరతరాలకు సరిపడే సిరిసంపదలు మూటగట్టాలనే కాంక్ష సన్నగిల్లదు. అందుకే ఆ వ్యామోహం లేని రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి వంటి వారిని స్మరించుకోవడం.

గీత వంటబడితే రెండుదారులు అనుసరించాలి.

**కర్మణ్యేవాధికారస్తే**

**మా ఫలేషు కదాచన**

**అది కర్మవాదం**

**అనన్యాశ్చింతయంతో మాం**

--- --- ---

**సర్వధర్మాన్ పరిత్యజ్య**

**మామేకం శరణం వ్రజ**

అది భక్తిమార్గం. ఈ రెండింటిలో ఏది మనసుకెక్కినా పారాయణాలు, ప్రవచనాలు, జ్ఞానయజ్ఞాలు వుండవు.

⌘ **సిగరెట్టు కాలుస్తూ, విస్కీ, బ్రాందీలు సేవిస్తూనే డాక్టర్లు తమ వద్దకు వచ్చే రోగులను పొగ త్రాగవద్దు. మద్యం ముట్ట వద్దు అంటారేం?**

వారు చెప్పినట్లు చెయ్యాలి కాని చేసినట్లు చేయరాదని అనుకుంటారు. అందుకు రోగి బుద్ధి అంగీకరించక డాక్టరే వ్యసనాలతో వుంటే మనమెందుకు విడవాలి అనుకుని దీర్ఘరోగాలతో డాక్టర్ల ప్రాక్టీసు పెంచుతున్నారు.

⌘ **ద్వైతానికి, అద్వైతానికి ఏమిటి భేదం?**

ద్వైతం అంటే రెండు

అద్వైతం అంటే రెండు కానిది

ఆత్మ పరమాత్మల ఏకత్వాన్ని ప్రతిపాదించేది అద్వైతం

**అహం బ్రహ్మాస్మి**

**ఏక మేవా ద్వితీయం బ్రహ్మ**

అని వేదం అందించిన దానిని స్వీకరించి, ఉపనిషత్తుల, ఉత్తర మీమాంస, భగవద్గీత ప్రమాణంగా ప్రస్థాన త్రయం అనుగ్రహించి అద్వైతాన్ని ఉద్ధరించారు ఆచార్య శంకరభగవత్పాదులు.

దీనికి భిన్నంగా జీవుడు వేరు, బ్రహ్మ వేరు అని బోధించారు ద్వైతాన్ని మధ్వాచార్యులు. మధ్యేమార్గం రామానుజుల వారిది. ఇంకా వివరాలు కావాలంటే ఆచార్య సన్నిధానానికి వెళ్ళాలి.

⌘ **మేనత్త రాధను కృష్ణుడు వలచెనా?**

గోకులాష్టమి ఎప్పుడు హామీదుల్లాగారూ అని అడిగే అదృష్టవంతులు

పెరగడానికి కొంచెం ముందు ఈ రాధ పుట్టింది. కృష్ణుని బాల్యక్రీడలు చూపిన భాగవతంలో 'రాధ' అనే అక్షరాలు లేవు. శ్రీకృష్ణుని విశ్వరూపం ప్రదర్శించిన భారతంలోనూ ఈ మేనత్త వరసలేదు.

అయితే జయదేవుని ధర్మమా అని మధురభక్తి సంప్రదాయం ఉత్తర దక్షిణాలను ఊపిన కాలంలో ఈవిడ విజృంభించి తంజావూరు నెరజాణల చేతులలో స్వాంతనం పొందింది. అసలుకంటె వడ్డీకి ప్రీతివలె రుక్మిణీ, సత్యభామల కంటే ప్రచారం పొందిన భక్తురాలీవిడ.

**❋ స్త్రీలు నెలకు మూడు రోజులు ఇంట్లో కాలు పెట్టకుండా 'బైట' వుండాలంటే మహానగరాలలో ఒకటిన్నర గదులలో కాపురం చేసేవారికి కుదురుతుందా?**

మన సమాజం ఎలా మారిందంటే ఆచారం ఎందుకు, ఏ కాలంలో ఏర్పడిందో ఎరగరు. వాస్తవానికి ఆ కాలంలో విశాలమైన గృహాలలో, పదిమంది కలిసివుండే ఉమ్మడి కుటుంబ వ్యవస్థలో మూడు రోజులు పూర్తి విశ్రాంతి యివ్వడానికి యిది ఏర్పరచుకున్నారు.

ముఖ్యంగా ఆ మూడు రోజులలో శారీరకంగా నీరసం ఎక్కువ కావచ్చు కనుక, ఆ సమయంలో కూడా గొడ్డుచాకిరీ చేయించే అత్తగార్ల బారి నుంచి ఆడబిడ్డను కాపాడడానికి విశ్రాంతి ఇస్తూ దూరంగా ఉంచారు. ఇది ఆరోగ్యానికి సంబంధించిన విషయం. అంతేతప్ప కొంపలు మునిగేది కాదు. అంచేత హాయిగా స్నానం చేసి చిన్నచిన్న పనులు చేసుకోవడానికి అభ్యంతరం లేదు. అది పాపమూ కాదు, నరక కారణమూ కాదు. ఇప్పటికే ఎందరో ఇలా హాయిగా ఉంటున్నారు. ఆరోగ్యం ప్రధానం.

**❋ పెళ్లికి, శోభనానికి, భర్త పోయినా తెల్లచీరనే కట్టిస్తారేం?**

పెళ్ళికి, శోభనానికి కట్టిన చీరకు అంచు ఉంటుంది. చివరి దానికి అంచు యోగం ఉండదు. గమనించండి.

**❋ చరిత్రకు, పురాణానికి తేడా!**

చరిత్రకందని కాలాల ఇతిహాసం పురాణం.

**❋ వెయ్యి స్తంభాల మంటపం తమిళనాడులోనే ఉన్నదా?**

హంపిలో, ఓరుగల్లులో సహస్ర స్తంభ మంటపాలున్నాయి.

**⌘ సీతాదేవి శ్రీరామునితో కాషాయ వస్త్రాలు ధరించి వెళ్లింది కదా?**

రామాయణం నాటికి కాషాయం బాబుల డాబులు లేవు. శ్రీరాముడు నారచీరలు ధరించాడు. సీతాదేవి చీని చీనాంబరాలతో, ఏడువారాల నగలతో వెళ్ళింది. రామాయణం చదవడానికి ప్రయత్నించండి.

**⌘ బ్రాందీ, సిగరెట్లు త్రాగండి, హస్త ప్రయోగం చేసుకోండి, మీ ఆరోగ్యం మేం బాగు చేస్తాం అని డాక్టర్లే సలహా ఇస్తుంటే..?**

లేకపోతే లక్షలు పెట్టుబడి పెట్టి సంపాదించిన డిగ్రీతో వ్యాపారం ఎలా సాగుతుంది? వారి సలహాలు వినే వారివల్లనే మూడేళ్లలో మూడు నక్షత్రాల హొటళ్ళు కూడా కట్టి మరింత అనారోగ్య దేశాన్ని వృద్ధి చేస్తున్నారు. చదువు 'కొంటున్న' వారు చేసే పనులివి.

**⌘ పరశురామావతారం ఉండగానే రామావతారమా?**

అవతారాలు అన్నీ పూర్ణావతారాలు కావు. పరశురాముడు అంశావతారం. రాముడు పూర్ణావతారం. అలానే కృష్ణావతారం. అంశావతారం దాని కర్తవ్యం. అయిపోగానే మామూలు జీవి అయిపోతుందని ఆర్యోక్తి.

**⌘ సీతాదేవిని మైథిలి, వైదేహి అని కూడా పిలుస్తారా?**

జానకీ, భూపుత్రీ అని కూడా పిలుస్తారు. మిథిలాపతి కూతురు. విదేహాధీశుని కూతురు, జనకరాజనందన భూమిలో దొరికింది. గిరిరాజపుత్రి గౌరి అయినట్లే ఇవన్నీ.

**⌘ పితృకర్మలు వేదోక్తాలా? ఇవి చేసి తీరాలా?**

వేదం విధించిన షోడశ కర్మలలో ఇది అత్యంత ప్రధానమైనది. నవమాసాలు కడుపులో పెట్టుకొని రక్తమాంసాలు పంచి ఇచ్చిన తల్లికి, పాతికేళ్ళు వచ్చినా పోషణభారం వహించే తండ్రికీ కృతజ్ఞత చూపడం మానవత్వ లక్షణం. విశ్వాసం ఉన్నట్లయితే వారికి ఉత్తరగతులు కల్పించడం విధి. ఇక కర్మలు చేయాలా అంటే ఒక పేదవాడికి పాతిక రూపాయిలిచ్చి మంత్రం చెప్పించడం ఇష్టం లేకపోతే పాతిక వేలిచ్చి పత్రికలలో ఘనంగా ప్రకటనలు వేయించి పదిమందికి

పంచిపెట్టే దారి కూడా ఉన్నది ఎవరి అభిమానం వారిది.

**⌘ కథల్లో సినిమాల్లో కోనసీమ గురించి వినిపిస్తుంది. ఎక్కడుందీ సీమ?**

తూర్పుగోదావరి జిల్లాలో ధవళేశ్వరం దగ్గర చీలిన గోదావరి నది తూర్పున గౌతమిగా పడమర వశిష్ఠగా వెళ్లింది.

ఈ రెండింటి మధ్య సముద్రంలో ద్వీపంలా అమలాపురం, రాజోలు తాలూకాలున్నాయి. ఈ రెండింటి మధ్య భాగం కోనసీమ.

మూడువందల అరవైరోజులు చల్లగా, పచ్చదనంతో అలరారే కొబ్బరి తోటలు అక్కడి వారికి నిత్యపంట.

ఒకనాడు నిరంతర వేదఘోష వినిపించే ఆ సీమ కూడా ఈనాడు డిస్కో, విస్కీలతో మూలుగుతున్నది. ఆ సీమలో పుట్టిన వేగినాటి పండితుడు షాజహాన్ ఆస్థానంలో విద్వాంసుడుగా వుంటూ, ఆ కాలంలోనే యవన కన్య లవంగిని చేపట్టిన ఉద్దండుడు. అక్కడ పుట్టిన వేగినాటి వారే మహీధరవారు. మార్క్సిజంలో ఘనులయ్యారు ఆదిలో.

**⌘ దేవుడూ, పిల్లలూ సమానం అంటారు, దేవుడు కూడా అమాయకుడా?**

పిల్లలకంటే అమాయకుడు. కాకపోతే ప్రపంచం అత్యాచారాలతో, అన్యాయాలతో, అక్రమాలతో, అత్యాశాపరుల ఆధిపత్యాలతో అభివృద్ధి పొందుతూంటే చూస్తూ ఆడుకుంటాడా? తన నగలు దొంగిలించి, భూమి వేలం పాడినా మాట్లాడడా?

**⌘ తు.చ. తప్పకుండా అంటారే...?**

సంస్కృత శ్లోకాలలో అర్థంతో నిమిత్తం లేకుండా గణం సరి పెట్టడానికి 'తు.చ.' అని పూరణార్థం వేసుకుంటారు. అలా వేసిన వాటిని కూడా విడిచి పెట్టకుండా ప్రమాణంగా స్వీకరించడమే దాని అర్థం.

**⌘ యోగి, సాధు, బాబా వీరిలోని భేదం?**

ముగ్గురూ కూడా స్వార్థాన్ని విడిచి లోక కల్యాణ కాంక్షతో ఆత్మ సాక్షాత్కారానికి కృషి చేసేవారు.

అయితే ఈనాడు వేషధారులై సాధు, యోగి అనుకుంటూ బంగారం

బొంతలు సంగ్రహించే ఆషాఢభూతులెక్కువయ్యారు.

**⌘ మన దేశంలోనే ఇంతమంది దేవతలున్నారా?**

మిగిలినవారి దేవుడు ఒకే పేరుతో ఒకచోటనే వుంటాడు. ఈ దేశంలో ఏ భక్తుడు ఏ నామంతో ఏ రూపంతో ఆరాధిస్తే ఆ పేరుతో ఆ రూపంతో సాక్షాత్కరిస్తాడు. ఇక్కడి దేవుడు భక్తపరాధీనుడు. ఎందుకంటే భక్తులు లేకపోతే భగవంతుడున్నాడని తెలిసేదెలా?

**⌘ శ్రీకృష్ణదేవరాయల ఇంటి పేరు?**

ఒకటి రెండు శతాబ్దాల క్రితం వరకు ఇంటిపేర్లు లేవు. దశరథ మహారాజు దగ్గర నుంచి రాయలవారి వరకు అంతే!

ఇంకో విశేషం- తమిళదేశీయులకు తండ్రి పేరు ఇంటి పేరవుతుంది. మరికొన్ని ప్రాంతాలవారికి ఊరిపేరు ఇంటి పేరవుతుంది.

**⌘ రాముడు మానవుడే గదా, పూజ దేనికి?**

మనిషిగా పుట్టినవాడు ఎలా బ్రతికితే మానవుడుగా మిగులుతాడో ఆచరించి చూపిన పూర్ణపురుషుడు కనుక, ఆయనను ఆరాధించి, ఆయన గాథ మననం చేసుకుంటూ కొందరైనా మనుషులుగా బ్రతుకుతారని ఆశ.

ఇవేమీ లేనివారికి పాదపూజలూ, సాష్టాంగాలూ సాగే రోజులలో రామాయణం, రాముడూ అనవసరం. సత్యం, ధర్మం అనే రెండు నేత్రాలను మనకు ప్రసాదించారు వాల్మీకి, వ్యాసులు. రామాయణ, భారతాల పేరిట ఈ రెండు కన్నులూ లేకపోతే..?

**⌘ గజేంద్రుని రక్షించడానికి వైకుంఠం నుంచి దిగిరావాలా? సుదర్శనం పంపితే వెళ్లడా?**

భక్త రక్షణలో ఆయన ఎప్పుడు, ఏ విధానం అనుసరిస్తాడో తెలియదు, ద్రౌపదీ వస్త్రాపహరణవేళ ద్వారక నుండి కదలకుండానే రక్షించాడు.

మరో విషయం- గజేంద్రుడంటే ఏనుగే అనుకోకండి. సంసార సముద్రంలో పడికొట్టుకుంటూ తననంతవాడు లేడనే అహంకారంలో మునిగిన ప్రతిమనిషికి ఆ అహంకారాలన్నీ వదిలించాలి, అందుకు "లావొక్కింతయు లేదు" - అని

ఆరంభించి "నీవే తప్ప ఇతఃపరంబెరుగ" అనే దశకు దింపాలి. అప్పుడు పరమేశ్వరుడు అనుగ్రహిస్తాడు.

**అనన్యాశ్చింతయంతో మాం**

**యే జనాః పర్యుపాసతే**

అని గీత చేసిన ప్రబోధం ఇదే.

**⌘ ఎవడో సామాన్యుడు చేసిన అపవాదు కోసం సీతను అడవికి పంపుతాడా?**

పంపాడు కనుకనే దానిని రామరాజ్యం అన్నారు. సామాన్యుడే కాదు అసంఖ్యాకులు ఘోషిస్తున్నా పట్టించుకోని కలియుగంలో వున్న మనకు, కూటసాక్ష్యాలు, గూండాయిజాలు యుగధర్మమైన మనకు వాగ్దానాలే తప్ప సామాన్యుడికి సుఖం కూర్చని ప్రణాళికా ప్రగతి పత్రికా ప్రకటనలలో చూసి ముచ్చట పడే మనకు రామరాజ్యం అర్థం కాదు.

ఇంతకూ సీతా పరిత్యాగానికి సంబంధించిన ఉత్తరకాండ- వాల్మీకి వ్రాయలేదని రామపట్టాభిషేకానంతరం ఫలశ్రుతి చెప్పిన వాల్మీకి మళ్లీ శ్రీకారం చుట్టలేదని అంటారు.

**⌘ భారతంలో లేనిది లేదంటారు కదా, ఈనాడు నడివీధిలో అబలలపై జరిగే అత్యాచారాలు కూడా వున్నాయా?**

ఎంతమాట సెలవిచ్చారూ? నిండుసభలో జరిగిన వస్త్రాపహరణం. తన భవనం నుండి విరాటరాజ భవనం వరకు ద్రౌపదిని తరిమిన కీచకుడు ఈనాటి అత్యాచారాలవారికి అన్నగార్లే. అయితే భారతంలో ఇలాంటి పనులు చేసిన వారిని అప్పడాల పిండి చేసి, గుండె చీల్చి నెత్తురు త్రాగిన భీమసేనులున్నారు. ఈనాడు ఎంత అవినీతిగా, అత్యాచారపరాయణుడుగా బ్రతికితే అంత పైకి వెళ్ళి, మనలను పాతాళానికి త్రొక్కుతున్న వారు పెరుగుతున్నారు.

ఈ దుశ్శాసన, కీచక సంహారానికి భీమసేనులను నడిపే వాసుదేవుడు రావాలి, వస్తాడు.

**⌘ సీతాదేవి పెళ్ళిలో అలుకుగుడ్డ కోసం దాసీలు తగవులాడారా?**

అది విశ్వనాథ సత్యనారాయణగారి చమత్కారం. ఆయన జనక

మహారాజుని మిథిల నుంచి కృష్ణాజిల్లాకు తెచ్చి తెలుగు పెళ్ళివేడుకలన్నీ జరిపించి 'నాగవల్లితగూ' లేకపోతే బావుండదని దాసీల మధ్య అలుకుగుడ్డతో ముడేశారు. అయిదురోజులపాటు వివాహాలు జరుపుకుని ఆనందించే కాలంలో నాగవల్లీ తగూలుండేవి. నాలుగు నిమిషాల పెళ్ళికే నరాలు లాగే కాలంలో వున్నాం మనం!

⌘ **కామక్రోధాలు లేనివారు దేవునితో సమానమంటారు. మరి దేవునికి పిల్లలు కలిగారు, కామం లేకుండా ఎలా?**

కామం అంటే ఒళ్లు తెలియని ఉద్రేకంతో, స్వపర భేదం లేకుండా కంటికి కనిపించిన కాంతలపై బడడం ధర్మబద్ధంగా చేసే సంసారం కాదు.

⌘ **రామాయణ కల్పవృక్షం అందరికీ అర్థమయ్యేలా ఎందుకు రాయలేదు?**

మహాప్రస్థానం అందరికీ అర్థమయేలా రాశారా! కవిత్వం ఎప్పుడూ కొందరికే, అందరికీ అందదు.

⌘ **త్రికరణశుద్ధిగా చేసినదే ఫలమిచ్చేటప్పుడు అజామీళుడు వాక్కుతో నారాయణా అన్నంతలో ఫలం లభించిందా?**

నారాయణ నామస్మరణ వేళ మనసు, వాక్కు ఆ నామం మీదనే లగ్నమయాయి, కాయానికి పనిలేదు. ఫలం దక్కక తప్పదు.

⌘ **సూర్యుడు కదలడు కదా, వానికి రథం, ఆ రథానికి తొడలు లేని అనూరుడు సారథి..?**

కదలని రథానికి సారథి ఎవడైతేనేం? ప్రసరించే తెల్లని కిరణాలలోని ఏడు రంగులూ ఏడు గుర్రాలంటారు పెద్దలు.

⌘ **బుద్ధినీ కర్మనూ మార్చగలమా?**

బుద్ధిః కర్మానుసారిణీ, కర్మను జ్ఞానాగ్నితో దగ్ధం చేయవచ్చునంటాడు గీతాచార్యుడు.

⌘ **రామాయణ, భారతాలకు సూక్ష్మమైన తేడా ఏమిటి?**

రామాయణంలో కామపిశాచం, భారతంలో ధనభూతం తాండవించాయి. కైకేయి మీది వ్యామోహంతో దశరథుడు కన్నబిడ్డను అడవులపాలు చేసి

మరణించాడు. సీత మీది కామంతో రావణుడు సర్వనాశనం అయ్యాడు.

పాండురాజు, పాండవులు జయించి తెచ్చుకున్న రాజ్యానికి, సిరిసంపదలకూ ఆశపడి దుర్యోధన శతం నశించింది.

※ **రావణుడు రంభను నిజంగా బలాత్కరించాడా?**

బలాత్కరించినందువల్లనే ఏడాది పాటు లంకలో వుంచినా సీతను ఏమీ చెయ్యలేకపోయాడు అంటుంది రామాయణం.

※ **అల్లా, యెహోవా, వెంకటేశ్వరుడు వీరిలో ఎవరిని ప్రార్థించాలి?**

పేరు తేడాయే తప్ప దైవం ఒక్కటే. అని అన్ని మతాలు చెపుతున్నా మతిహీనులు ఉన్మాదంతో మారణకాండ సాగిస్తున్నారు.

※ **రాముడు, భీష్ముడు వీరి ఆయుర్దాయమెంత?**

రామాయణ, భారతాలు బ్రతికి వున్నంతకాలం

చూడండీ వారి ఆయుర్దాయాలూ, మరికొన్ని ప్రఖ్యాత పాత్రల తల్లిదండ్రుల పేర్లు, భార్యల నామాలూ తెలుసుకుని లాభం లేదు. మనం వింటున్న చరిత్రల వల్ల మన జీవితాలను సన్మార్గాన నడుపుకునే ప్రయత్నం చేయాలి.

※ **ప్రపంచంలో అతి పొడుగైనవారెవరు?**

ఎనిమిదడుగుల ఆరంగుళాల పురుషుడొకడు బస్సు ఎత్తు చాలక, రైళ్లలో కూర్చోలేక అవస్త పడుతున్నాడట, రామాయణంలో కుంభకర్ణుడు నిలబడి కాలెత్తితే అది తాడి ఎత్తున కోట గోడ మీద ఆగిందట. పొడుగు, వెడల్పు కాదు. మనిషికి ధీశక్తి ప్రమాణం.

※ **కుంతి కన్యగా ఉండి పదినెలలు గర్భంతో కర్ణుని మోసింది కదా, తల్లి దండ్రులకు ఈ సంగతి తెలియదా?**

అంతఃపురాలున్నాయే. అక్కడ జరిగే సంగతులు అంత గుట్టుగా వుంటాయన్నమాట.

※ **ధనుర్మాసంలో తెల్లవారుఝామునే లేచి, స్నానం చేస్తే పుణ్యం అంటారు, అంత చలిలో ఎలా లేవడం?**

ధనుర్మాసంలోనే కాదు, వానలు వెనకబట్టి, చలి ప్రారంభించే కార్తీక మాసంలో తెల్లవారుఝామునే లేచి దగ్గరలో వున్న నదీప్రవాహంలోనో, కాలువలోనో స్నానం ఆరంభించాలి. ఆ అలవాటు శివరాత్రి వరకూ సాగించాలి. ఈనాటికీ కృష్ణా, గోదావరీ ఆదిగా గల నదీ ప్రాంతాలలో వుండే వారు వందల సంఖ్యలో స్నానాలు చేస్తున్నారు.

పుణ్యం మాట ఎలా వున్నా ప్రకృతిలో వచ్చే మార్పులను తట్టుకునే శక్తి శరీరానికి వున్నంతకాలం ఏ రోగమూ రాదు. అలాకాక వేసవి ప్రవేశించేసరికి మంచుగదులలోకి (ఏ.సి.), శీతాకాలంలో ఉన్ని దుస్తుల్లోకి వెడుతూంటే రక్తపుపోటు, గుండెదడ పెరిగి నింతరం నరకయాతనే అవుతుంది.

స్నానమే కాదు. ధనుర్మాసంలో చక్రపొంగలీ, దధ్యోదనం కూడా కాలాను గుణమైన ఆహారవే. అయితే దానిని వైష్ణవులు భక్తితో మేళవించి సామాన్యులకు ఆరోగ్యం ప్రసాదిస్తున్నారు ప్రసాదరూపంలో.

ఈ కారణం తెలియని మేధావులు ప్రకృతికి భయపడి, దాన్ని జయిస్తున్నా మంటూ అద్దాల తలుపులు బిగించుకుంటున్నారు.

⌘ **గ్రహాలన్నీ ఒకే దశకు వస్తే క్షుద్రశక్తులు పుడతాయా?**

క్షుద్రశక్తులు వేరే పుట్టాలా! దశాబ్దంగా దేశంలో వస్తున్న నవలలు, సినిమాలు పుట్టించే శక్తులన్నీ క్షుద్రాతి క్షుద్రాలు కావా?

⌘ **నాస్తికులు పెరిగితే దేశం ముందుకు వెడుతుందా?**

రామాయణం నాటికే వున్నారు నాస్తికులు. దేశం యింకా ఎందుకు ముందుకుపోలేదో?

⌘ **పెళ్లిలో మంగళసూత్రం కంటే జీలకర్ర, బెల్లం ప్రమాణం చేయించడమే ప్రధానమా?**

మంగళసూత్రం, తలంబ్రాలు యివన్నీ వేడుకగా సాగే తంతులే. అందు వల్లనే సుముహూర్త సమయానికి జీలకర్ర, బెల్లం పెట్టించి ప్రమాణం చేయిస్తారు, అంతటితో వివాహం అయిపోతుంది. పారిశ్రామిక ప్రగతి, వైజ్ఞానిక

విజృంభణం లేని కాలంలో వేడుకలతో కాలక్షేపం చేసే సుఖమయ ప్రాణులు వివాహాన్ని అయిదు రోజుల తంతు చేసుకుని హాయిగా గడిపేవారు.

అమెరికా నుంచి వచ్చి అయిదోనాడు విమానం ఎక్కవలసిన వేగంతో బ్రతికే యుగంలో అయిదు నిమిషాలలో పెళ్ళి పూర్తి చేయించే అభ్యుదయ వాదులు కూడా తెలిసియో, తెలియకయో వేదప్రోక్తమైన ప్రమాణంతోనే పెళ్ళి ముగిస్తున్నారు.

※ **భగీరథుడు గంగను భూమికి తెచ్చాడంటే ఆయనొక గొప్ప ఇంజనీర్ అనుకుంటా?**

పరమ సత్యం.

※ **క్షత్రియుడైన అర్జునుడు యాదవుల సుభద్రను ఎలా పెళ్ళి చేసుకున్నాడు?**

యాదవులు క్షత్రియులే, యదువు యయాతి కొడుకు.

※ **వికర్ణుడు కర్ణుని కొడుకా?**

వికర్ణుడు దుర్యోధన శతకంలో వాడు.

※ **ధ్యానం వల్ల లాభమేమి?**

కోతిలా పరుగులు తీసే మనస్సును ఏకాగ్రం చేసి కర్తవ్యం వైపు నడిపించడం.

※ **పులస్త్య ప్రజాపతి మనుమడు రావణుడు ధర్మ సూక్ష్మాలు ఎరిగిన శివ భక్తుడు కదా, అటువంటి వానిని రాక్షసుడనడం ధర్మమా!**

ప్రజాపతి మనుమడనీ, శివభక్తుడనీ, శాస్త్రజ్ఞాని అనీ, వాల్మీకి రామాయణంలోనే చెప్పాడు. ధర్మశాస్త్రం తెలియడం, శివుని ఆరాధించడం వేరు, తెలిసిన శాస్త్రాన్ని, ధర్మాన్ని ఆచరించని రావణుడు రాక్షసుడే.

※ **కులాలు, మతాలు, వరకట్నాలు రూపుమాపుతాం అని పదవి రాగానే అన్నీ తమ కులం వారికే ధారాదత్తం చేసి, తమ సంతానానికి లక్షలు కట్నం పుచ్చుకుంటున్నారే?**

బహుశా ఇతర కులాలూ, మతాలూ రూపుమాపాలని సంకల్పం.

※ **మనిషి కోతి నుంచి పుట్టాడా?**

పెద్దపులి, నక్క, ఎలుగుబంటి, గాడిద యిన్నింటి నుంచి దిగినట్లు దాఖలాలు కనిపిస్తుంటే కోతికే ఆ గౌరవం యివ్వడం అవమానం కదా!

❋ **ఆర్యులు జర్మనీ నుంచి ఈ దేశానికి వచ్చారని చరిత్రకారులు..?**

ఆ అహంకారంతోనే హిట్లర్ రెండవ ప్రపంచ యుద్ధం నడిపి లక్షల మందిని ఆహుతి చేశాడు. మన దేశ చరిత్రను ఇంగ్లీషు ప్రభువులు వ్రాసి పెట్టారు. వారికి పరువు దక్కేటట్లు మన చరిత్ర తిరగరాస్తున్నారు.

❋ **వ్యాస భారతం ఎన్నివేల శ్లోకాలు?**

మహాభారతం శతసాహస్రికం అని గద్యం వ్రాశారు. వాస్తవానికి వ్యాసముని ముందుగా వైశంపాయనులకు చెప్పారు. ఆయన జనమేజయనికి చెప్పారు. అది విన్న సూతుడు శౌనకాదులకు చెప్పాడు. ఇలా ఆ నోటా ఆ నోటా పడి తమ కాలం వరకూ వచ్చిన విశేషాలన్నిటినీ చేరి లక్షశ్లోకాల గ్రంథంగా వెయ్యి సంవత్సరాల పూర్వమే ప్రచారంలోకి వచ్చింది. అంతా వ్యాసులవారి పేరు మీదనే సాగింది.

ఈనాడు ఏది వ్యాసప్రోక్తం! ఎంత ఇతరం! అనేది తేలే విషయం కాదు, కాని మహాభారతం నాటికీ నేటికీ మానవజాతి మహేతిహాసం. ప్రక్షిప్తాలనే పేరుతో కొందరు తమ అభిమానధనులకు న్యాయం జరగాలనే సంకల్పంతో వారు చేసిన అత్యాచారాలు తొలగించి ప్రచురిద్దాం అంటున్నారు.

అంతకంటే ఆ "సచ్చినోళ్ల" మీద ఆపేక్ష విడిచి మన జీవితానికి పనికొచ్చే నీతినీ, ధర్మాన్నీ గ్రహించడం శ్రేయస్కరం.

❋ **భారత యుద్ధంలో కర్ణుణ్ని అన్యాయంగా చంపడం న్యాయమా?**

అన్యాయం అన్యాయమే, న్యాయం కాదు. కాని భారతం వున్నదే అది ఇటువంటి విషయాలలో చేసే ధర్మనిర్ణయం "సుప్రీం కోర్టు" తీర్పు.

❋ **భారతం మొదటినుంచి చివరదాకా చదవకూడదా?**

మొదట భారతం చెప్పిన వైశంపాయనుడు ఆదిపర్వంతో మొదలుపెట్టి సుఖంగా చివరకు నడిపించాడు. సూతుడు కూడా అలాగే నడిపాడు. దురదృష్టవశాత్తూ నన్నయ్యగారు అరణ్యం వ్రాస్తూ కన్ను మూయడం వల్ల

తెలుగు దేశంలో భయం పుట్టింది.

ధర్మ ప్రబోధానికి పుట్టిన పంచమవేదం మహాభారతం ఎక్కడ మొదలు పెట్టినా ఏ ప్రమాదమూ లేదు.

⌘ **మడి, ఆచారం అనేవి శుభ్రత కోసమనీ, కాళ్ళకూ, ముఖానికీ పసుపు రాసుకోవడం ఆరోగ్యానికనీ అంటే నవ్వుతారేం?**

అది ఆధునికతకు లక్షణం. అయితే మడీ, ఆచారం అతిగా సాగించి ఎదుటి వారిని హింసించడం న్యాయం కాదు.

⌘ **అంగదుడు మండోదరి కొడుకా?**

ఈ కథ కట్టిన వానరుడెవడో! వాలి నేలకూలగానే తార గుండెలు బాదు కుంటూ అంగదుని దగ్గరగా తీసుకొని శోకించిన సన్నివేశం రామాయణంలో చదివితే ఆ తల్లి పేరు అందుతుంది, అప్పుడు చెప్పాలి అంగదుడు ఎవరి కొడుకైనది!

⌘ **పునర్జన్మ వున్నదా?**

దేవుడున్నాడో లేడో అని తలబ్రద్దలు కొట్టుకుంటున్న వారిలానే ఈ విషయంలోనూ వాదోపవాదాలు సాగుతున్నాయి. అయితే జన్మ సంస్కారం లేకుండా అతిబాల్యంలో అద్భుత ప్రతిభా, సాహసాలూ ప్రదర్శించడం ఎలా సాధ్యం అనే ప్రశ్నకు శాస్త్రజ్ఞులు మౌనంగానే వుంటున్నారు.

⌘ **రాముడు, కృష్ణుడు, ఏసు, మహమ్మద్ అందరూ విధి వంచితులే కదా! అటువంటప్పుడు వీరినెందుకు పూజించాలి?**

విధివంచితులై కూడా దానికి తలవంచలేదు కనక.

⌘ **కలియుగం ఎప్పుడు ప్రారంభమైంది? ఎన్ని ఏళ్ళుంటుంది?**

క్రీస్తు పుట్టడానికి ముందు మూడువేల నూటరెండు సంవత్సరాల క్రితం అని దొరలు కూడా చెపుతున్నారు. ఇక యుగ ప్రమాణమంటారా?

కలియుగం నాలుగు లక్షల 32వేల సంవత్సరాలు

గతించిన ద్వాపరయుగం 8 లక్షల 64 వేల ఏళ్ళు.

దీనికింకో కలికాలం కలిపితే నృసింహ, వామనావతారాలు ప్రభవించిన కృతయుగం. ఇది ఈ దేశం వారి కాలచక్ర విభజన.

⌘ **రామాయణ, భారతాలవలె మిగిలిన కథలు జనుల గుండెలలోకి ఎక్కడం లేదేం?**

రక్తమాంసాలతో నిండిన హృదయం కల మనిషి ఏ సమయంలో ఏ వయసులో ఎలా ప్రవర్తిస్తాడో చూపుతూనే మానవజాతిని పదికాలాలు భూమిమీద నిలపడానికి అవసరమైన సత్యం, ధర్మం ఎలా ఆచరించాలో చూపగల శక్తి ఆ తరువాయి వారికి లేకపోయింది. లేకపోగా అనంతరం వచ్చిన సాహిత్యం అంతా ఆ రెండు మహానదుల నుంచి వచ్చిన పిల్లకాలువలే. నదీ తీరంలో వున్న వారికి ఈ గుంటకాలువలు దేనికి?

⌘ **వాల్మీకి, నన్నయ్య మహాకవులు కారా?**

అక్షరాలా వారు కవులు మాత్రమే. వారి కవిత్వానికి విశేషణాలు వేలు. కనుకనే "మహా మహా" హేమాహేమీలెందరు పుట్టినా తెలుగునాట వాల్మీకి, నన్నయ్యలకు నమస్కరించక తప్పడం లేదు.

కాళిదాసంతవాడు-

మందః కవి యశః ప్రార్థీ అనుకున్నాడు. కవిని కావాలనే కండూతితో వున్న మందబుద్ధిని - అనుకున్నాడు ఎదురుగా శ్రీమద్రామాయణ వాల్మీకి కవిని దర్శించి, ఈ చూపు లేని వారందరూ స్థానిక మహాకవులే!

⌘ **సత్వ రజస్తమో గుణాలు ఎలా గెలుచుకోవాలి?**

ధర్మరాజు సత్వగుణం, భీమార్జునులు రజోగుణం, దుర్యోధన, దుశ్శాసనులు తమోగుణ వాసితులు. ఇలా తెలిసే విషయం కాదిది. గీతా ప్రవచనం చేసే చోట కూర్చుంటే వారు మూడురోజులు పాఠం చెబుతారు.

⌘ **శ్రీరాములవారిని కైకేయి పెంచింది కదా, పెంచిన ప్రేమను మరిచి అడవులకెందుకు పంపింది?**

కైకేయి పెంచినట్లు చెప్పిన వాడెవడో శైవుడై వుంటాడు. వాల్మీకానికి

సంబంధించినంతవరకూ రాముడు కౌసల్యాదేవి చేతులలోనే పెరిగాడు.

⌘ **రామకోటి వ్రాయడానికి నియమాలున్నాయా?**

వ్రాస్తున్నంత సేపైనా మనస్సును రాముని మీద నిలపడం కంటే నియమం లేదు. రోజుకి ఎన్ని రాయగలిగినా మంచిదే, మనసు దానిమీద వుంచి. అంతే కాని ఇంట్లో వాళ్ళని సణుగుతూ, ఇరుగు పొరుగులను నిందిస్తూ కాదు.

⌘ **భారతం ఏ వేదంలో కథ?**

వేద ప్రతిపాదితమైన ధర్మం సామాన్యులకు అందడానికి కురుపాండవ గాథ ఆధారంగా వ్యాసముని అందించిన గాథ భారతం.

⌘ **శ్రీరాముడు తన ఉంగరాన్ని హనుమంతునికే యిచ్చాడు కదా, మరి మిగిలిన దిక్కులకు వానరులను పంపడం దేనికి?**

ఉంగరం యివ్వడం దేనికి, ముందుగా తానే యిందరితో దండయాత్ర సాగించవచ్చుకదా! అప్పుడు మనకు రామాయణ కాలంనాటి భూగోళం కనిపించేది కాదు. మరొక రహస్యమేమంటే దొంగచాటుగా ఎత్తుకు వెళ్ళిన నీచుడు ఆమెను ఏ దిశలో దాచిపెట్టాడో తెలియదు కదా.

⌘ **దేవేంద్రుడు మునివేషంతో వచ్చి అహల్యను మోసగించలేదా?**

ముని వేషంతో మోసగిద్దామనే వచ్చాడు కాని, వచ్చినవాడు ఇంద్రుడని తెలిసే అందుకు సిద్ధపడింది, దానికి ప్రాయశ్చిత్తంగా రాయిలా పడివుండమని శిక్ష వేశాడు గౌతముడు. ఆశ్రమంలో పవిత్ర జీవితం గడిపే అహల్య దేవేంద్రుని వంటి అందగాడు, శ్రీమంతుడు కంటబడితే కాలుజారింది కనక కామం ఎంత బలీయమో గ్రహించి ఇంద్రియ నిగ్రహం అలవరచుకోవాలనే నీతి మనం గ్రహించాలి. అహల్య గాథయే కాదు, విశ్వామిత్రుని కథ కూడా ఇదే నీతికోసం చదవాలి. మేనక కంటబడేసరికి సర్వం మరిచిపోయి పతనమయ్యాడు.

⌘ **ధృతరాష్ట్రునికి నూరుగురు కొడుకులంటే నమ్మలేము?**

ఒకే కాన్పులో ఆరుగురు పిల్లలంటే నేనూ నమ్మలేను, కాని పురాణాలు నమ్మని మేధావులు ప్రచురిస్తున్న పత్రికలు ఘోషిస్తున్నాయి. ఏం చేద్దాం.

⌘ **నిరంతరం మంత్రాలు చదువుతూంటే దేవునికి వినిపిస్తాయా?**

మంత్రాలు దేవునికి వినిపించడానికని ఎవరు చెప్పారు! మంత్రాలు కర్మ కాండకు సంబంధించినవని తెలియకపోవడంలో ఆశ్చర్యం లేదు. దేవునికి వినిపించవలసినది ప్రార్థనలు, స్తోత్రాలు, గీతాలు... అవి బైట గాలిలో కలిసిపోకుండా చర్చిలో, మసీదులో, ఆలయంలో గొంతెత్తి పాడుతూంటారు ఎవరి నమ్మకాన్ని అనుసరించి వారు. చిత్రమేమంటే అక్కడ వున్నది ఒకే దైవం, అయినా ఎవరి మనసుకు వచ్చిన పేరుతో వారు ప్రార్థించుకు ఊరుకోలేక మీ దేవుడు దొంగ అంటే, మీ దేవుడు గూండా అని రుజువు చేయడానికి అన్ని మతాలలోనూ గూండా భక్తులూ, దొంగభక్తులూ బయలుదేరి రాజకీయ నాయకులతో సమంగా ప్రపంచాన్ని ధ్వంసం చేస్తున్నారు.

**⌘ ఇంద్రుడు కోడిగా కూసినప్పుడు గ్రహించలేకపోయాడా మహర్షి?**

కోడిలా కూశాడని చెప్పిన కోడిగాడెవడు! పిట్టకథలు వినకండి, రామాయణం చదవండి.

**⌘ దేవుడు లేడని వాదించేవారిని నమ్మించడం ఎలా?**

దేవుడున్నాడనే వారు లేడనే వారి దృష్టికి మూర్ఖులు, మూఢవిశ్వాసపరులు. అలానే దేవుడు లేడనే వారిని వాడి మూఢ విశ్వాసం మూర్ఖత్వం అంతే అని వీరు...

చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు...

అన్నాడు నీతి శతకకారుడు. ఆయనకు ప్రణామాలు.

**⌘ ఉపవాసం ఏకాదశినాడే చెయ్యాలా?**

ఈ లోకం కంటే పరలోకం మీద విశ్వాసం వున్నవారికి ఏకాదశి పరమ పవిత్రం. ఇహం మాత్రమే వున్నదనుకునేవారు ఏ రోజునైనా ఉపవాస నియమం పాటిస్తే జీర్ణకోశం కొంత విశ్రాంతి తీసుకుని శరీరం ఆరోగ్యంగా వుంటుంది.

**⌘ వాల్మీకి వ్రాసిన తరువాయి రామాయణం జరిగెనా?**

రాముడు అరణ్యంలో వాల్మీకిని దర్శించినట్లు రామాయణం చెపుతున్నది. అంటే తాను విన్నదీ, చూసినదీ వ్రాసినట్లు అనుకోవాలి. అంతకంటే భక్తికలవారు ముందే వ్రాశాడనుకుంటే వారి మనసు నొప్పించరాదు.

❋ **ఎవడో సామాన్యుడు ఏదో అన్నాడని సహధర్మచారిణిని రాముడు విడిచి పెట్టడం న్యాయమా?**

గుర్రుకొట్టే భర్తతో కాపురం చెయ్యలేనని విడాకులు కోరే సమాజం వృద్ధిపొందుతున్న వైజ్ఞానిక యుగంలో వున్న మనం రామాయణ కాలానికి వెళ్ళాలంటే చాలా కష్టం.

నూటికి డెబ్బైమంది తిరస్కరించినా ప్రభుత్వం నిర్వహించే ప్రజాస్వామ్యంలో నినాదాల అభినయ వాగ్దానాలతో పాలకులుగా ఆరాధనలు పొందే ప్రభువుల ఏలుబడిలో వున్న మనకు రాముని రాజలక్షణం తెలియదు. ఈ ప్రశ్న అడగబోయే ముందు, ఒక ఆడదాని కోరిక కోసం సింహాసనం విడిచి అడవుల పాలైన సత్యవాక్పాలన పరాయణుడు రాముడు అని గుర్తుంచుకోవాలి. కాగా పోగా తన దేశంలో ఒక సామాన్య మానవుని నోట వెలువడిన మాట ప్రజలందరి నోటా వాని అపవాదులతో తన వంశం అపఖ్యాతి పాలవుతుందని భావించాడు రాముడు. మరొకమాట, సింహాసనం మీద వుండేరాజు ఎంత నిష్కళంక జీవితం గడపాలో చూపించాడు రాముడు. రాజు జీవితం ప్రజలకు ఆదర్శం కావాలి. అయింది కనకనే 'రామరాజ్యం' నేటికీ ఆదర్శం అవుతున్నది.

❋ **రామాయణ, భారతాలు లేకపోతే ఏం ప్రమాదం?**

మరికొన్ని వందల మంది రావణులు, దుశ్శాసనులూ విజృంభించి అబలలపై అత్యాచారాలు సాగించేవారు.

కొందరిలో అయినా ఈ దుర్మార్గాన్ని నిరోధించడానికే భారత, రామాయణాలు పుట్టాయి. అందుకే చదవాలి, వినిపించాలి.

❋ **హనుమంతుడు, అశ్వత్థామ వీరంతా చిరంజీవులైతే వీరెక్కడుంటారు?**

అది తెలిస్తే వారినాశ్రయించి మనం కూడా చిరంజీవులమయే వరం కోరుకోవచ్చు. కాని ఈ మారణహోమ కాలుష్యభరిత శాస్త్రీయ యుగంలో ఎంత త్వరగా జీవితం చాలిద్దామా అనుకుంటున్నారు కదా మేధావులు.

❋ **నాభిలో అమృతం వున్న రావణుడు రాక్షసుని వలె ఎందుకు ప్రవర్తించాడు?**

మీరు పిట్టకథలలో, సినిమాలలో చూసిన రావణుడు పొట్టలో అమృత

భాండం పెట్టుకున్నట్టున్నాడు. వాల్మీకి రామాయణంలో రావణుడు ఖాళీ కుండలు మ్రింగలేదు. నిండు కడవలతో సురాపానం చేసి, కుండలు బైట పారవేశాడు. ఇక అమృతం - రాక్షసత్వం అంటారా ఎంతో అందంగా వుంటూ, చిరునవ్వుతో తిరిగేవారు ఎన్ని అత్యాచారాలు చెయ్యగలరో ఈనాడు ప్రపంచాన్ని చూస్తే కనిపించడం లేదూ.

⌘ **పూర్వకాలం పొయ్యి వెలిగించాలంటే ఏం చేశారు?**

నిన్న మొన్నటివరకూ ప్రతి ఇంటా నిప్పు ఆర్పకుండా రోజంతా వెలుగుతూండేది. నిప్పు చేయడం వేదాలతో నేర్చుకున్నాడు భారతీయుడు.

⌘ **రామాయణం, భారతం, శివపురాణం ఏది చెప్పినా హరికథ అంటారేం?**

హరిహరులకు అభేదం అని తెలియజేయడానికి.

⌘ **కోరికతో భగవంతుని ప్రార్థించకూడదా?**

ఎందుకు కూడదు. ప్రార్థనలు వినే భగవంతునికి చాలా పనులుంటాయి. అందరి కోరికలు తీర్చి మీవైపు చూసేవరకు మీరు ప్రార్థించగలరా? అందుకే

"అనన్యాశ్చింతయంతో" అన్నాడు. ఏ ఆలోచనలూ, కోరికలూ లేకుండా ప్రార్థించాలి.

⌘ **బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఎవరిని గురించి తపస్సు చేశారు?**

తమకా శక్తినిచ్చిన పరాశక్తిని గురించి.

⌘ **ఓం - స్వస్తిక్ వీని అర్థమేమి?**

సర్వ సృష్టికీ మూలభూతమైన ప్రణవమును 'ఓం' అందురు. స్వస్తిక్ చిహ్నం శుభానికి గుర్తు. మంత్రశాస్త్రంలో దాని ప్రాధాన్యం వేరు.

⌘ **అరణ్యాలలో సీతాదేవికి నగలెక్కడివి?**

అందుకే ఇంటింటా వచన రామాయణం, భారతం కొని దాచాలి పెద్దలు. నిత్యం కొంచెం కొంచెం చదివి పిల్లలకు తలకెక్కించాలి. అంతేకాని సినిమాలు చూపించి విజ్ఞానం పెంచామనుకోరాదు.

సీతాదేవి వనవాసానికి బయలుదేరేవేళ ఆవిడ నగలూ, చీరలూ రథం మీదపెట్టి పంపమని దశరథుడు ఆదేశించాడు. ఇలాంటి చిన్ని చిన్ని విషయాలు

మరిచిపోకుండా వుండడానికే రామాయణం రోజూ చదవాలి.

⌘ **సుగ్రీవుడూ, విభీషణుడూ లేకపోతే రాముడు రావణసంహారం చెయ్యగలడా?**

నేను పుట్టకపోతే ఎవరిని పెళ్ళాడతావు అన్నట్టుంది. రావణ సంహారం దాకా ఎందుకు, రామాయణమే ఉండేది కాదు. అయితే గియితేలతో మనస్సు పాడుచేసుకోక, అయిన గాథలు చదివి మనస్సు వికసింపజేసుకోండి.

⌘ **తలవ్రాత వ్రాసేది బ్రహ్మ కదా, పాపపుణ్యాలతో మనకేమి సంబంధం?**

మన తల మీద వ్రాసిన రాత కదా! ఆ పాపపుణ్యాలు తల కలవాడే అనుభవించాలని రాయడా?

⌘ **సినిమాలలో దేవుళ్ళు నాట్యం చేస్తారు. నిజంగా వీరు నాట్యం చేశారా?**

సినిమాలలో శోభనం గదిలో భార్యాభర్తలు పాటలు పాడుతూ గంతులేస్తారు. అటువంటి దంపతులను మీరు చూశారా?

⌘ **క్రైస్తవులు వివాహ సమయంలో ప్రభువా! నీ కుమార్తెను నీ కుమారుడు పెండ్లాడుచున్నాడు అంటారేం?**

మనమందరమూ దేవుని బిడ్డలం...

⌘ **రామబాణానికిక తిరుగులేనప్పుడు విభీషణుని సలహా దేనికి?**

విభీషణుడు సలహా ఇచ్చాడని వ్రాసినవాడు అవివేకి! రాముడు రావణుడు అస్త్రవిద్యలలో సమానులు.

కనుకనే వారం రోజులు ఒకరికెదురుగా ఒకరు నిలిచి యుద్ధం చేశారు. చివరకు బ్రహ్మాస్త్రం విడిచి రాముడు రావణుని చంపాడు.

⌘ **నిజంగా దేవుడనేవాడుంటే నాస్తికులను ఆస్తికులుగా మార్చడేం?**

ఆయనకు వాళ్ళను అలా వుంచడమే ఆనందం కాబోలు.

⌘ **సత్కర్మ అనగానేమి?**

ఏ ప్రాణికి కష్టం కలగని రీతిలో తన జీవితాన్ని క్రమబద్ధంగా నడుపుకోవడానికి ఉపయోగపడేవన్నీ సత్కర్మలే.

⌘ **అహింసను బోధించిన భగవద్గీతను ఆదర్శంగా తీసుకున్న రాముడా...?**

ఎవరుచెప్పారీ కథ! రాముడు త్రేతాయుగం నాటి వాడు. గీత ద్వాపర యుగాంతంలో కృష్ణుడు బోధించాడు. ఇదిలా వుండగా 'గీత' బోధించింది దేనికో ఎరుగుదురా? ఎదురుగా వున్న బంధువులను చంపడానికి ధైర్యం చాలక నీరు కారిపోయిన అర్జునునికి కురుక్షేత్ర మధ్యంలో బోధించి, నిలబెట్టి 18 అక్షౌహిణీల సేనను పిట్టను కొట్టినట్టు కొట్టించారు.

**⌘ కామిగాని వాడు మోక్షగామి కాడా?**

భారతంలో యయాతి మహారాజు కథ తెలియక వేమన్నగారు స్వానుభవంతో ఈ వైరాగ్యసూత్రం చెప్పారు.

**⌘ రావణుడికి పదితలలు ఉన్నాయా?**

కర్మేంద్రియాలు 5, జ్ఞానేంద్రియాలు 5. ఈ ఇంద్రియాలు పదింటిని ఒకే త్రాటి మీద నడపడానికి ఒక తలలో ఇంత మనసున్నది. వాడికి ఏ ఇంద్రియం వశంలో వుండదు. పదీ పదిదారులు కనుక పదితలలు అనుకుంటే బావుండదూ!

**⌘ నామాలు నిలువుగా, విభూతి అడ్డంగా వుండాలని దేవుడు శాసించాడా?**

నామాలు అడ్డం చేసి, విభూతి నిలువునా గీసినా బాధ లేదు, మనస్సు నాయందు ఏకాగ్రమైతే అంటాడు భగవంతుడు. ఏకాగ్రత కుదరక నామాల వారూ, విభూతివారూ తలలు తరుగుకుంటున్నారు.

**⌘ రావణుని చిటికిన వ్రేలు చూచి సీతాదేవి చిత్రం గీచిందా?**

ఈ పిట్టకథలు వినడం మాని రామాయణం చదవండి. సీతాదేవి బొమ్మలు వేస్తూ కూర్చునే యిల్లాలు కాదు. పైగా ఆ పరమ దుర్మార్గుడి బొమ్మను కూడా ఆమె మనసులోకి రానివ్వదు.

**⌘ రావణాసురుడికీ, రాజకీయ నాయకులకూ తేడా ఏమిటి?**

ఎంతమాట. రాజకీయ నాయకుల కాలిగోటికి పనికిరాడు రావణుడు. వాడు చెప్పింది చేస్తాడు. తన రాజ్యంలో ప్రజలందరికీ ఎంత సుఖమయ జీవితం అందించాడో సుందరకాండ చదివితే తెలుస్తుంది.

మన నాయకులు వాగ్దానాలతో ప్రజల నెత్తి మీద చెయ్యిపెట్టి కోట్లు

దోచుకుంటారు. వాగ్దానాలు ప్రజలకు, కరెన్సీ కట్టలు తన బంధువులకు ఇవ్వగలిగినంత దుర్మార్గం రావణుడెరగడు.

**⌘ ఆంజనేయులవారు భవిష్యత్ బ్రహ్మ ఎలా అవుతాడు?**

సూర్యుడు తూర్పున ఎలా ఉదయిస్తున్నాడు.

**⌘ శ్రీకృష్ణుడు పాండవపక్షాన వుండగా కర్ణుని అర్ధరథుడుగా భీష్ముడెందుకు నియమించాడు?**

మహారథికుడు, అర్ధరథుడు, రథికుడు అనేవి ఉద్యోగాలు కావు. మన అభిమానులకూ, ఆశ్రితులకూ కల్పించే ప్రమోషనులూ కావు. శస్త్ర విద్యతో ధైర్య సాహసాలు, నిర్దయ ఇన్నిటి మీద ఆధారపడి నిర్ణయిస్తారు. కర్ణుడే కాదు, అశ్వత్థామ కూడా అర్ధరథుడే. ఇక కృష్ణుడు ఏ పక్షాన వున్నా ఈ నిర్ణయంతో సంబంధం లేదు. ఇంకా వివరం కావాలంటే భారతంలో ఉద్యోగపర్వం చూడండి.

**⌘ హిందువులకు, మహ్మదీయులకు, క్రైస్తవులకు వేరు వేరు స్వర్గాలున్నాయా?**

దేవుడు వేరుగా వుంటే అన్నీ వేరుగానే వుంటాయి. కాని ఉన్న దేవుడొకడే అని గ్రహించగలిగితే ప్రపంచంలో నరకయాతన వుండదు.

**⌘ వాలి సుగ్రీవులు, తార రుమలు వీరి సంబంధం?**

క్రమాలంకారంలో వారు దంపతులు.

**⌘ వినత, కద్రువ మనుషులు కదా, వీరికి పక్షులూ, పాములూ పుట్టాయా?**

అప్పటి సంగతి ఏమోకాని, ఈ మధ్య పత్రికలలో చూస్తున్నారా పంది కడుపున ఏనుగుపిల్ల, గుర్రం కడుపున కుక్కపిల్ల!

**⌘ భగవద్గీతా సారం ద్వారా మూర్ఖుని మనసు మార్చగలమా?**

గీతా సారమే కాదు, గీత సమగ్రంగా తెలిసిన వారిలో కూడా మూర్ఖత్వం పోదు. గీత తెలియడం వేరు, ఆచరించడం వేరు.

అబద్ధమాడరాదు అని తెలిసినవారే వాగ్దానాలతో సామాన్యుల నెత్తి మీద భస్మాసుర హస్తం పెట్టే కాలం యిది.

**⌘ విద్య లేని వాని కంటే విద్య వున్న వింత పశువులే ఎక్కువ కనిపిస్తున్నారే?**

విద్య లేని వాడు నాడూ నేడూ పశువే.

కాని ఈనాడు విద్య ఎక్కడుంది. వేలు పోసి కొనుక్కునే చదువుంది.

ఈ చదువులు మనిషికి వివేకాన్నివ్వవు. మానవత్వానికి అవసరమైన వినయం, శీలం, సత్ప్రవర్తన ఇవ్వవు. ఆత్మాభిమానాన్ని చంపి, అయిదువేలు జీతం వస్తున్నా లంచం పట్టే అడుక్కుతినే బుద్ధిహీనుల్నిస్తున్నాయి. నిజానికి వీరి కంటే పశువులు వేయి రెట్లు గొప్పవి.

**⌘ మూఢనమ్మకాలు అంతమయ్యేరోజు రాదా?**

అటువంటి మూఢులకోసం బాధపడే మూఢత్వాన్ని వదిలేయండి.

**⌘ మీరిచ్చే సమాధానాలు మాకు తెలియక అడుగుతున్నామా?**

శంఖంలో పోసి తీర్థం చేసుకుందామని, అంటే మీకు తెలిసిన దానిలో సత్యం ఏది, అసత్యం ఎంత! అని నిరూపించుకోవడానికి తెలియని వాటిని గురించి అడిగే తెలివి ఎవరికుంటుంది.

**⌘ పసుపు లక్ష్మితో సమానం, అటువంటి లక్ష్మిని పాదాలకు పూయుట.**

నఖశిఖ పర్యంతం లక్ష్మిని ధరించాలి.

**⌘ ఈ ప్రపంచంలో జ్ఞాని ఎవరు?**

ఈ ప్రంచానికి అతీతంగా బ్రతికేవాడు.

**⌘ గోవధ మహాపాపం అయితే యాగాలలో గోవధ?**

రెండూ వేదం చెప్పినవే కనక యాగంలో పాపం లేదు.

**⌘ హిందూ - ముస్లిం మతాలు కలిసిపోతే?**

భూగోళం స్వర్గం అవుతుంది.

**⌘ ఒకనాడు పెళ్లికూతురి మనసులో మల్లెలు, వెన్నెలలు, తెల్లచీరెలు వుండేవి. ఈనాడు కిరోసిన్, ఉరిత్రాడు...?**

చదువు కొనుక్కున్న డిగ్రీ కోర్కెలు పెరిగాయి. వాటికి పౌష్టికాహారం పెళ్ళాం తెచ్చి పెట్టాలి.

**ముల్లోకాలూ జయించిన రావణుడు దొంగచాటుగా సీతను అపహరింపనేల?**

అవినీతికి, అత్యాచారానికీ బాహాటంగా పాల్పడలేక పోయాడు రావణుడంతటివాడు. కానీ నేడు ఆ భీతిలేని పిశాచాలు తిరుగుతున్నాయి.

**నారదుడు నేడు భూలోకసంచారం చూస్తే పురాణాలను నమ్మ వచ్చునేమో?**

పురాణకథలు నమ్మడానికి కాదండీ, అవి బోధించే నీతిని ఆచరించి ధర్మంగా నడవడానికి.

**నిర్మల హృదయంతో దేవుని ప్రార్థించగలిగితే అడవులలో ముక్కు మూసుకోవాలా?**

నిర్మల హృదయం కోసమే ఈ తాపత్రయం.

**యముడికి ఆలయం లేదేం?**

ప్రతి మనిషి గుండెలో వున్నాడు. అది ఆగగానే తీసుకుపోతాడు.

**ద్వాపరలో వ్యాసులవారు వేదాలు వ్రాస్తే త్రేతాయుగంలో రాముడు వేదాలు ఎలా చదివాడో?**

వేదాలు ఎవరూ వ్రాయలేదండి. వ్యాసులవారు వేదాలను ఋగ్యజుస్సామ అధర్వణాలుగా విభజించారు.

**కంసవధ వరకూ కృష్ణునికి పాండవులతో లేని పరిచయం తరువాయి ఎలా వచ్చింది?**

భాగవతంలో కృష్ణలీలలు చెప్పేటప్పుడు భారతకథ మిళాయించలేదు. కృష్ణుడి తండ్రి వసుదేవుడు, ఈయన చెల్లెలు కుంతి.

**అన్ని యుగాల్లోనూ వున్న రాక్షసులు కలియుగంలో లేరే?**

మిగిలిన యుగాల్లో వారు అల్ప సంఖ్యాకులు. ఈ యుగంలో వారు కానివారెవరు.

**భారతానికి నాయకుడెవరు?**

వ్యాసునితో ప్రారంభించి పరీక్షిత్తు వరకూ.

**మానవుడికి తృప్తి ఎప్పుడు?**

మనస్సు బుద్ధి అధీనంలో వున్నప్పుడు.

⌘ **శాంత రోమపాద మహారాజు పుత్రిక కదా, ఆమెను బ్రాహ్మణ మునికిచ్చి పెళ్ళి....**

అంతక్రితం విశ్వామిత్రుని చెల్లెలు సత్యవతిని ఋచీకమునికిచ్చి చేశారు. అప్పటికింకా కులద్వేషాలతో దేశనాశనం చేసే బుర్రలు పెరగలేదు.

⌘ **ఆచరించకుండా బోధించరాదా?**

ఆచరణ వినేవాడికే అనే బోధకులు పెరిగినందువల్ల వినేవారు పోయారు. అందరూ బోధక బాధకులే.

⌘ **పోతనగారు వ్యాసభాగవతం తెలుగు చేయలేదేలా?**

చేశారు కానీ అక్షరాక్షరం చెయ్యలేదు. భక్తి ఘట్టాలు పెంచారు, ఇతరులు తగ్గించారు.

⌘ **మునులు హిమాలయాల మీదనే తపస్సు చేశారా?**

కన్యాకుమారి నుంచి కాంచన గంగవరకూ తపోభూమియే.

⌘ **ప్రజలు సుఖశాంతులతో వున్నది రామ రాజ్యంలోనా? రావణ లంకలోనా?**

అక్కడా యిక్కడా సుఖశాంతులున్నాయి. ఎటొచ్చీ అడవిలో వున్నా రాముడు కూడా సుఖశాంతులతో ఉన్నాడు. లంకలో కోటలో హంసతూలికా తల్పం మీద రావణుడికి మనశ్శాంతి లేదు. కామబాధలో దేహసుఖం లేదు.

⌘ **అందరికీ ఒకే దేవుడైతే వాని నామరూపాలేమి?**

నామరూపరహితమైన అంతరాత్మ.

⌘ **'దేహీతి వచనం కష్టం**
**నాస్తీతి వచనం తథా**
**దేహీ నాస్తీతి యద్వాక్యం**
**మా భూజ్జన్మని జన్మని'**
**అని కర్ణుడు చెప్పిన సందేశం నేటి మానవుడు అనుసరించగలడా?**

ఒకని ముందు చెయ్యి జాపి 'దేహి' అని యాచించడం, ఆకలిబాధలో చెయ్యిజాపిన వారికి 'లేదు' అని పొమ్మనడం జన్మజన్మలకీ రాకూడదని కర్ణుడు

బాధపడ్డాడు.

ఈనాడు కోట్లు మూలుగుతున్నవారే బహుమానాలనీ, లంచాలనీ, మామూళ్ళనీ వసూలు చేసుకోవడానికి సిగ్గులేకుండా చేతులు జాపుతూనే వున్నారు. ఆకలి బాధతో వచ్చేవారికి గుప్పెడన్నం పెట్టలేక కిలో మాంసం తినే కుక్కలను మేపుతున్నారు. అటువంటి ధృతరాష్ట్రులకు కర్ణుని ప్రబోధం ఎలా వినిపిస్తుంది. తాము కూడబెట్టిన కరెన్సీ కట్టలు యమలోకానికి వస్తాయని ఆశకాబోలు.

⌘ **మనిషి శారీరకంగా పోతాడా, భౌతికంగానా?**

పంచభూతాలతో తయారయ్యే శరీరం ఆ భూతాలలోకి పోతుంది నాయనా!

⌘ **జయవిజయులు త్వరగా శాపవిమోచనం కావాలంటే మూడు యుగాలు పట్టిందేం?**

అనంతకాల మహాస్రవంతిలో మూడు యుగాలు మూడు క్షణాలండి వారికి. మనకు సెకన్లు నిమిషాలు కావడానికి యుగాలు పడుతుంది, ఆసుపత్రులలో డాక్టరు గారి కోసం నిరీక్షిస్తుంటే!

⌘ **ఒక రజకుని మాట కోసం రాముడు సీతను అడవులకు పంపాడు. ఈనాడు అధిపతులు..?**

కనుకనే రాముడు నేటికీ ఆరాధనలందుకుంటున్నాడు. కనకనే సింహాసనం పోయిన క్షణం నుంచి అనామకులవుతున్నారు కుహనా ప్రభువులు...

⌘ **జ్ఞాని కంటే అజ్ఞానికే సుఖం ఎక్కువా?**

మీరనుకునే జ్ఞానం దృష్ట్యా సుఖం అజ్ఞానులకే ఎక్కువ. అసలు జ్ఞానికి సుఖదుఃఖాలుండవు. రెండింటికి అతీతమైన బ్రహ్మానుభవం కలవాడు జ్ఞాని. ఈనాటి జ్ఞానులున్నారే వారు సుఖాన్ని అనుభవించలేరు, దుఃఖాన్ని భరించలేరు. అజ్ఞానానికి రెండు శక్తులూ వున్నాయి.

⌘ **అందరిలోనూ రక్తమాంసాలే కదా వున్నది, ఇక కులాలెందుకు?**

పెద్దపులీ, మేకలూ జంతువులే. వాటిలోనూ రక్తమాంసాలున్నాయి.

రెండింటినీ ఒక పాకలో వదలండి. ఏ రక్తం ఎలాంటిదో?

⌘ **పాపం చెయ్యనివారు దేవుని పూజించాలా?**

దేవుని పూజించడం పాపం కాదనుకుంటా.

⌘ **భగవంతుడు రాతిబొమ్మగా గుడిలో, భాగ్యవంతులు కదిలే బొమ్మలుగా వీధులలో తిరుగుతూ డబ్బు సంచులు పోగుచేసుకుంటున్నారు. కాని దరిద్ర నారాయణులు..?**

భాగ్యవంతులు భగవదవతారాలుగా తయారు కావడంతో దరిద్ర నారాయణులకు పిడికెడు మెతుకులు కరువయ్యాయి. భాగ్యవంతులే ముష్టి చెంబుల స్థానంలో "బ్రీఫ్‌కేసులు" పట్టుకు చెయ్యి జాపే యాచక బ్రతుకు పోయేకాలం రావాలి.

⌘ **గీత పారాయణం చేస్తే ఏ యజ్ఞఫలం లభిస్తుంది?**

జ్ఞాన యజ్ఞఫలం.

⌘ **ఈనాడు రచయితలు పాఠకులకు అర్థం కాని పదాలు ప్రయోగించి వ్రాయడానికి కారణం?**

ఒకనాడు సంస్కృత సమాసాలలో వ్రాసి జనానికి అర్థం కాకుండా చేశారనడం వల్ల ఈనాడు మరో నాలుగాకులు ఎక్కువ చదివామనే భ్రమతో సగం ఇంగ్లీషు, మరో పాతిక హిందీ కలిపి సంకరభాష నేర్పుదామని వీరి ప్రయత్నం.

⌘ **జీవితం అత్యల్పం అయినా అన్యాయాలతో ఆ అల్పకాలం ఎందుకు నాశనం చేసుకుంటారు?**

మన కళ్ళ ఎదురుగా ఎందరో మహామహులు జీవయాత్ర చాలిస్తున్నా మనం శాశ్వతంగా వుంటామన్న భ్రమతో అన్యాయాలూ, అత్యాచారాలూ చేసి కోట్లు కూడబెట్టి గుండె ఆగి మరణించేవరకూ ధనలోభం వదలదు. ధర్మ దృష్టి రాదు.

⌘ **దేవుడు అందరిలోనూ వున్నాడని శాస్త్రాలు చెపుతున్నా వికలాంగులను మన సమాజం సక్రమంగా చూడదేం?**

శాస్త్రం చెప్పినంతలో చెవికెక్కదు. హృదయ పరివర్తన రావాలంటే చిన్ననాటి నుంచీ పిల్లలలో నీతి, ధర్మం ప్రవేశించే విద్య నేర్పించాలి. ఈనాడు మన చదువుల శాఖలో లేనివి నీతి, ధర్మం, శీలం. ఎందుకంటే చదువును అమ్ముకునే కల్తీ వ్యాపారులు నాయకులవుతున్నారు.

- **అమృతం సేవించిన దేవతలకు ఆకలి దప్పికలుండవు కదా. ఆలయాలలో దేవతలకు నైవేద్యం దేనికి?**

ఆలయాలలో వుండే దేవతలు అమృతం త్రాగినవారు కాదు. అమృతం అందించినవారు. ఆలయాలలో మనం చేసే నివేదనలు ఆ విగ్రహాల ఆరగింపు కాదు, ఆ విగ్రహ రూపంలో వున్న దైవం అనుగ్రహించి మనకు అందజేసిన ఆహారాన్ని ఆ దైవానికి నివేదన చేసి మనం ఆరగించడానికి.

- **భీష్మ పర్వం వరకు శిఖండి కనపడదేం?**

ఏ పాత్ర ఎప్పుడు ప్రవేశించి నిష్క్రమించాలో వ్యాసుల వారికీ, వాల్మీకికీ తెలుసు కనుకనే యిన్ని వేల ఏళ్ళూ వారూ వారి భారత రామాయణాలూ సజీవంగా వున్నాయి. ఈనాటి రచయితలు జీవించి వుండగానే వారి రచనలూ, వారూ నామరూపాలు లేకుండాపోవడానికి ఆ రహస్యం తెలుసుకోలేకపోవడమే కారణం.

- **దశావతారాల అనంతరం అవతరించలేదా భగవంతుడు?**

పదవ అవతారం యింకా రాలేదండీ.

- **సృష్టి, సృష్టికర్త అసత్యాలు కావా?**

మీ సృష్టికి కర్తలేడని నమ్మితే మీకు మిధ్యావాదం బాగా ఒంటబట్టినట్టుంది.

- **వానరులందరికీ కోతిముఖాలుండగా జాంబవంతునికి ఎలుగుబంటి ముఖమా?**

జాంబవంతుడు భల్లూకపతి.

- **అనాయాసేన మరణం (రోగం రాకుండా చావు) వినా దైన్యేన జీవనం (ముష్టెత్తకుండా బ్రతుకు) అని విదురుడు కోరినట్లు బ్రతకగలవారెందరు?**

పూట గడవక దీనంగా బ్రతికేవారికంటే ఏ పూటకాపూట విలాసాలు గడుపుకోవడానికీ దీనంగా చెయ్యిజాపే పండగ మామూళ్ళ దరిద్రులు పెరిగిన

కాలంలో విదురుని మాట వినేవాడెవడు? గాలి, నీరు, తిండి అన్నీ కలుషిత మయిన యుగంలో అనాయాస మరణం ఎలా సాధ్యం...! అయినా విదురుని హితవు తలకెక్కితే కొందరయినా సుఖంగా బ్రతుకుతారు.

**※ వ్యాసులవారు ఆకలిబాధతో కాశీనగరాన్ని శపించడం కంటే ఆహారం సృష్టించుకోవచ్చుగా?**

ఆయన తన తపశ్శక్తిని తిండికోసం వ్యర్థం చెయ్యదలచుకోలేదు. అంతేకాదు తపశ్శక్తి భగవంతుని కూడా నిలబెడుతుందని మనవంటి 'మందు'లకు తెలియచెప్పడం ఆయన లక్ష్యం అని ఆ కథ కట్టినవాని ఊహ.

**※ ఆస్తికుని కడుపున నాస్తికుడు పుట్టునా?**

హిరణ్యకశిపుని కడుపున ప్రహ్లాదుడు పుట్టలేదా.

**※ తండ్రి మాట వింటే కష్టాలే వస్తాయని రామాయణం బోధిస్తోందంటారే?**

తండ్రి మాట వినని ప్రహ్లాదునికి కష్టాలు వచ్చాయని భాగవతం ఘోషించిందని చెప్పడం లేదా! వీటినే విష వ్యాఖ్యలన్నారు సూరివరులు.

**※ విశ్వామిత్ర సృష్టి అంటే?**

త్రిశంకు మహారాజు కోసం మరో స్వర్గాన్నీ, గ్రహ, తారా, మండలాలనూ సృష్టించిన ఘనుడు విశ్వామిత్రుడు. వివరాలకు రామాయణం చదవండి.

**※ తద్దినాలు దేనికి?**

రక్తమాంసాలు ధారపోసి కని పెంచి వృద్ధిలోకి తెచ్చినందుకు కృతజ్ఞత చూపడం మానవ లక్షణం కనుక.

**※ దుష్యంతుని కొడుకు భరతుడు తన కుమారులకు రాజ్యం యివ్వలేదా?**

ఈనాడు నాయకులందరూ తమ సంతానాన్ని వారసత్వంగా ప్రజా ప్రతినిధులను చెయ్యడానికి బలవత్ ప్రయత్నాలు చేస్తుంటే చూసిన మేధావికి కలిగిన ఊహ యిది. రాజు న్యాయమార్గాన నడవాలి. మమకారానికి లొంగరాదు అనే నీతిని చెప్పడానికి చక్కని సన్నివేశం సృష్టించాడు. కాని మన నాయకులకు ఇంత సున్నితంగా చెపితే అందుకునే మనసున్నదా.

**※ టీవీలో రామాయణం చాలా అభూతాలతో చూపించారు, అలానే భారతం**

**కూడా...?**

ఎలా చూపించినా ప్రధాన కథ మార్చరు, మారిస్తే వీరి పప్పులుడకవు. అక్కడక్కడ మారుస్తారు. ఎక్కడ మార్చాలో తెలియాలంటే భారతం దగ్గరుంచుకు కూర్చోండి.

⌘ **భీముడు చురకత్తితో పొడిచి కీచక సంహారము చేసెనా?**

ఒంటరిగా వెళ్ళే ఆడువారిపై అత్యాచారానికి దిగే నీచ కీచకులను చంపడానికి భీమబలునికి కత్తులెందుకు నాయనా! అనాయాసంగా కీళ్ళు విరిచి అప్పడాల పిండి ముద్దగా చేసి పారేశాడు భీముడు - ఇది భారతంలో వ్యాసులవారి మాట.

⌘ **గీతా ప్రబోధానికి ఎంత టైం పట్టింది?**

వాసుదేవునికి మూడు క్షణాలు పట్టింది, శిష్యుడు సమర్థుడు కనక. మనకు కొన్ని జన్మలైనా చాలదు, చెప్పే గురువుకి కూడా గీత తెలియలేదు కనక.

⌘ **కృష్ణుడు నల్లగా రాముడు నీలంగా వుండేవారా?**

ఉభయులూ నీలమేఘులే అని పెద్దలంటారు.

⌘ **ఈ కాలంలో జంధ్యాలెందుకు?**

గాయత్రీ మంత్రం ఉపాసించని వాడికి ఏ కాలంలో అయినా అనవసరమే.

⌘ **రావణుడు సీతాపహరణం చెయ్యడానికి కామం కాదా కారణం?**

కాదనుకునే వారుంటే రాముని చేతిలో చావాలనే కామంతో.

⌘ **పురాణాలు చదవనివారు, పూజ చేయనివారు పాపులా?**

చదివినవారూ, చేసేవారూ కూడా పాపులే. నిర్మల హృదయంతో తోటి వాడికి సాయపడకుండా స్వార్థంతో బ్రతికితే.

⌘ **రామలక్ష్మణులలో గొప్పవారెవరు?**

గొప్పవాడైన లక్ష్మణుని సేవలందుకున్నవాడు.

⌘ **సన్యసించినా ఆశలు చావకపోతే...?**

ఆశలు చచ్చికాదండీ సన్యసిస్తుంటే, దారాపుత్రుల ఆశలు తీర్చలేక

కాషాయం కడుతున్నారు, అసలు సన్యాసి మనకు కనిపించడు.

⌘ **పరశురాముని యుద్ధంలో మూర్ఛితుని చేశాడంటే భీష్ముడు గురువును మించిన శిష్యుడా?**

అందుకు సందేహమా! గురుకులాలున్న రోజులలో గురువు తనను మించిన శిష్యులను రూపొందించేవాడు కనుకనే ఆ విద్యలు ఉత్తమ పౌరులను అనుగ్రహించాయి.

ఈనాడు శిష్యుని మించిన వ్యసనాలకు బానిసలైన గురువులు బయలు దేరి వాళ్ళ కళాశాలలను వాళ్ళే తగలబెట్టుకునే దౌర్భాగ్యులను తయారు చేస్తున్నారు.

⌘ **నారదుడు కలహభోజనుడు కదా, మహర్షి ఎలా అయ్యాడు?**

ఉత్త మహర్షి కాదు నారదుడు దేవర్షి. మీరు నాటకాల్లో సినిమాల్లో చూసే శకుని వికారాలున్న నారదుడు పురాణాలలో లేడు. రామాయణాన్ని వాల్మీకికి చెప్పినవాడు, ధర్మరాజుకి రాజనీతి బోధించినవాడు, భక్తి సూత్రాలు అందించిన వాడు, ప్రహ్లాదునికీ, ధ్రువునికీ నారాయణ మంత్రం ఉపదేశించినవాడు నేనెరిగిన నారదుడు.

⌘ **పునర్జన్మ వున్నదా?**

జన్మకు పునర్జన్మ తప్పదు. జనన మరణ చక్రం నుండి బైట పడడానికే గీత, ఉపనిషత్తులు మార్గాలు చూపించాయి.

⌘ **భోజనానికి ముందు చేతులు కడుక్కుంటే చాలు కదా, పాదాలెందుకు కడగాలి?**

ఉష్ణదేశాలలో చేతులూ, కాళ్ళూ మాత్రమే కాదు, చల్లని నీటితో ముఖం కూడా కడిగి, మూడు నాలుగుసార్లు పుక్కిలించి అనంతరం భోజనం కాగానే మళ్ళీ అవన్నీ కడిగి పదిపదిహేనుసార్లు పుక్కిలించాలని ఈ దేశపు మానవుడి శరీరతత్వం ఎరిగిన ఆయుర్వేద శాస్త్రకోవిదులు ఘోషించారు. కాని కాలిజోడు విప్పకుండా చెంచాలతో తిని, తడిచేత్తో మూతి తుడుచుకునే నాగరికత బలిసింది మనకు.

✾ **రాముడు నవమినాడు, కృష్ణుడు అష్టమినాడు పుట్టారు. అష్టమి నవములు మంచివి కాదంటారు?**

పంచాంగాలకు అతీతులు రామకృష్ణులు.

✾ **సంధ్యావందనంలో త్రివిక్రమ, వామన అంటారే, రెండూ ఒకటేగా?**

శ్రీధర, కేశవా, వాసుదేవ అన్నీ ఒకటే.

✾ **అంత పరాక్రమం కల సుగ్రీవుడు రావణుని చేతులలో దెబ్బలు తిన్నాడా?**

రావణుని పరాక్రమం రాముడంతవాణ్ణి వారం రోజులు నిలబెట్టింది.

✾ **సీతను అపహరించినంతలో వంశనాశనం చెయ్యాలా రాముడు?**

త్రేతాయుగంలో వంశనాశనంతో సరిపెట్టాడు రాముడు. ద్వాపరయుగంలో వస్త్రాపహరణానికి సాహసించిన దుశ్శాసనుని దుర్మార్గాన్ని చూస్తూ వూరుకున్న వీరులందరినీ యమసదనం చేర్పించాడు వాసుదేవుడు.

✾ **ఉపవాసం చేస్తే పరమాత్మను ఆకలితో హింసించినట్లుకాదా?**

ఆకలి దప్పికలున్న పరమాత్మను ఎప్పుడు చూశారు.

✾ **పెద్ద తిరుపతి, చిన్న తిరుపతి ఈ రెండు చోట్ల వున్నవారు అన్నదమ్ములా?**

బింబ ప్రతిబింబాలు.

✾ **రాముని కంటే హనుమంతుడే గొప్పవాడంటారే?**

తన కన్నా గొప్పవారి సేవలందుకోవడం శ్రీరాముని శక్తి. అంతేకాదు, తన కంటే గొప్పవాడైన రావణుని కూల్చినవాడు రాముడు. మన కంటే సర్వవిధాలా అల్పులైన వారిని చేర్చి భజన చేయించుకున్నవారు రామాయణ నాయకుడు కాదు.

✾ **పూర్వయుగంలో దేవతలకు, రాక్షసులకు యుద్ధాలు జరిగేవి, ఈ యుగంలో లేవా?**

ఈ యుగంలో రాజకీయ రాక్షసులే ఒకరినొకరు హింసించుకుంటుంటే దేవతలు చూస్తూంటారు.

✾ **దుర్యోధనుని సహోదరులందరూ దుర్మార్గులేనా?**

ఈ వందమందిలో వికర్ణుడొకడున్నాడు ధర్మ నిర్ణయం కోసం నోరెత్తి

నిలబడినవాడు, కాని వారి నోరుమూశాడు కర్ణుడు. సభాపర్వం చదవండి. మిగిలిన వారికి నోరే లేదు. అన్నగారి వెనక అత్యాచారాలకు దిగినవారే.

※ **భార్యను పందెం కాయడానికి ఎరగడా ధర్మరాజు?**

ధర్మరాజంతవాడే జూదంలో దిగితే అలా అయిపోయాడు. నాయనా రిక్రియేషన్ క్లబ్బులకూ, పేకాట గృహాలకు వెళ్ళకు అంటుంది భారతం.

※ **జీవితం అశాశ్వతం అని తెలిసి పాపాలు చేస్తారేం?**

పుణ్యం చేస్తే జన్మ లేదు, జీవితం శాశ్వతం కావాలంటే పాపాలు చెయ్యాలి. చేస్తే మళ్ళీ జన్మ లభిస్తుంది. మళ్ళీ పాపాలు చేస్తూ మళ్ళీ పుట్టవచ్చు.

※ **కైకేయి రాముని అడవికి పంపడం తప్పెలా అవుతుంది? ఏ తల్లి అయినా తన కొడుకు వృద్ధి కోరుకుంటుందిగా?**

ఎదుటివారికి గోతులు తీసి ఆ మట్టితో మనం మేడలు కట్టుకుని వృద్ధిలోకి రావాలనుకునేవారికి కైక గురువు.

※ **సూర్యుడు ప్రత్యక్ష దైవమా?**

ఒక్కరోజు సూర్యరశ్మి లేకపోతే ప్రాణికోటి ఎలా వుంటుందో గమనిస్తే ఆయన దైవం ఔనో కాదో తెలుస్తుంది.

※ **భాగవతంలో కొంత భారత కథ కనిపిస్తుంది. అది భారతంలో వున్న విషయాలకు భిన్నంగా వుంటుంది కారణం?**

భాగవతంలో భారత కథ, భారతంలో రామాయణ కథ, అలానే యితర పురాణాలలో ఆయా కథలలో భేదం కనిపిస్తుంది. అందుచేత భారతకథకు భారతమే ప్రమాణం, రామాయణానికి వాల్మీకమే ప్రమాణం అంతే.

※ **నన్నయగారి భారతంలో ధృతరాష్ట్రునికే కిరీటం పెట్టారు, దూరదర్శన్‌లో పాండురాజుకి పెట్టారేం?**

సింహాసనం గ్రుడ్డివాడికి రాదు కనుకనే సత్యవతి మరో కుమారుని కోరింది. అయితే నన్నయగారు ఏ కారణం చేత కిరీటం గ్రుడ్డివానికి పెట్టించారో! ధృతరాష్ట్రుడు రాజయితే దుర్యోధనుడే యువరాజు కావాలి.

నన్నయ గారికి దొరికిన తాళపత్ర గ్రంథంలో ధృతరాష్ట్రునికి రాజపదవి

కట్టబెట్టినట్టు వున్నదేమో మరి. నన్నయగారు స్వతంత్రించి సింహాసనాధికారాలు మార్చలేరు కదా.

※ **అమృతం పుచ్చుకున్న దేవతలకు మృతసంజీవని దేనికి?**

అమృతం దొరకడానికి పూర్వం పడ్డ శ్రమ అది, అంటే కూర్మావతారానికి ముందు జరిగింది.

※ **కైకేయి వరం వల్ల రాముడు అడవికి వెడితే అది పితృవాక్య పాలనమా?**

కైకేయికి వరం ఇచ్చినవాడు రాముని తండ్రి, ఆయన చేసిన వాగ్దానాన్ని నిలబెట్టడం పితృవాక్యపాలనం.

※ **అయ్యప్పస్వామి మోహినీ అవతారంలో పుట్టాడు, హరిహరసుతుడెలా అవుతాడు?**

మోహినీ అవతారంలో సంతానం కలిగినట్లు భారతం చెప్పలేదు. ఈ మీమాంసలతో తలబ్రద్దలు చేసుకోవడం కంటే ఆ స్వామిని దీక్షగా ఆరాధించండి.

※ **కామక్రోధాలు జయించలేని విశ్వామిత్ర, దుర్వాసులు ఋషులా?**

కాదు, ఆ రెండూ జయించేవరకూ వారిని ఋషులనలేదు. ఎన్నిక్లేశాలు పడ్డారో అందుకు.

※ **ఆత్మను ఎవరు చూశారు?**

ఆత్మను చూసినవారు మన కంటబడరు, పడినా మనకు తెలీదు.

※ **కూర్మావతారంతో మోహినీ అవతారం కూడా వుంది కదా, మరి పదకొండు అవతారాలనకూడదా?**

మహావిష్ణువు అవతారాలు అనంతం, దశావతారాలు అని బాలసాహిత్యంలో స్థిరపడింది.

※ **కాళిదాసాదికవులు దేవీ వర్ణనలో శృంగారమే చూపించారేం?**

దేవతాస్తోత్రాలు చేసేటప్పుడు మనస్సు భక్తి భావంతో వుంటుందేమో కాని వికారాలకు లొంగదు. అప్పుడు మనకు తుచ్ఛవాసనలుండవు, అందుచేత ఆ వర్ణనలు ఎలా సాగినా మన మనస్సు ప్రధానం కనుక అది అశ్లీలం కాదు.

అక్కడ శబ్దానికున్న ప్రాధాన్యం అర్థానికుండదు.

⌘ **కోరికలుంటే అవి తీరడానికి దేవుని ప్రార్థిస్తాం, ఏ కోరికా లేనివాడు?**

కోరిక లేని వాడు దేవుడే.

⌘ **పాండురాజు సింహాసనాధిపతి అయితే ధృతరాష్ట్రుని అనంతరం దుర్యోధనుడు రాజు ఎలా అయ్యాడు?**

ధృతరాష్ట్రుని తరువాయి వరకూ దుర్యోధనుడు లేడు. వీడు ముందే వెళ్ళాడు తొందరపడి రాజ్యకాంక్షతో.



# ఉషశ్రీ మిషన్

రామాయణ భారతాలు అందించే మానవత్వపు విలువలూ, సంస్కృతీ వైభవాలూ యువతరానికి తెలియజేయాలనే ఉషశ్రీ ఆకాంక్షే లక్ష్యంగా 1991లో ఉషశ్రీ మిషన్ ప్రారంభమైంది, వారి కుటుంబ సభ్యుల ఆధ్వర్యంలో....

## ఉషశ్రీ మిషన్ కార్యక్రమాలు

1. ఉషశ్రీ పుస్తకాలు ప్రచురించడం.
2. ఉషశ్రీ రామాయణ భారత ఉపన్యాసాల సి.డి.లు శ్రోతలకి అందించడం.
3. ఉషశ్రీ.కామ్ నిర్వహించడం.
4. పాఠశాల కళాశాలల విద్యార్థులకి రామాయణ భారతాలు అంశాలుగా వ్యాసరచన. వక్తృత్వ, క్విజ్ పోటీలు నిర్వహించి, మన మహేతిహాసాల పట్ల విద్యార్థులలో ఆసక్తి, అవగాహన పెంచడం.
5. భారతీయ సంస్కృతి, సాహిత్య రంగాలలో కృషిచేస్తున్న వారిలో ఏటా ఒకరిని 'ఉషశ్రీ సంస్కృతీ సత్కారం'తో గౌరవించడం.

# ఉషశ్రీ పుస్తకాలు

భారతం
రామాయణం
భాగవతం
సుందరకాండ
భగవద్గీత
ఉషశ్రీ ఉపన్యాసము
భారతంలో చిన్నకథలు
ధర్మ సందేహాలు
భారతంలో రాయబారాలు
రామాయణంలో హనుమంతుడు
వివేకానందం

పెళ్ళికొడుకులు (నాటకం)
రాగహృదయం (నృత్యనాటిక)
వేంకటేశ్వర కళ్యాణం (యక్షగానం)
మల్లెపందిరి (కథలు)
జ్వలిత జ్వాల (నవలికలు)
అమృతకలశం (పౌరాణిక కథలు)
ప్రేయసీ ప్రియంవద (నవల)
సంతప్తులు (నవల)
తరాలు అంతరాలు (నవల)
కళాపూర్ణోదయం
మనుచరిత్ర



# ధర్మ సందేహాలు

ఉషశ్రీ

ధర్మ సందేహాలు అనే పదబంధం వినబడితే చాలు
ఉషశ్రీ గుర్తుకు వస్తారు.
ఆకాశవాణి ద్వారా ఆ కార్యక్రమాన్ని అంతగా మోగించిన
గళవీరుడు ఉషశ్రీ.
1986-90ల మధ్య ఆంధ్రజ్యోతి, స్వాతి వారపత్రికలలో
పాఠకుల ధర్మ సందేహాలకు సమాధానాలు ఇస్తూ
ఉషశ్రీ నిర్వహించిన శీర్షికకు ఇది పుస్తకాకృతి.
ఇందులో ఆరుకోట్ల ఆంధ్రుల ధర్మ సందేహాలకు
సమాధానాలు ఉన్నాయి.
ఐహిక - ఆముష్మిక - ఆధ్యాత్మిక పరమైన సందేహాలకు
వైజ్ఞానిక దృష్టితో సామాజిక స్పృహతో చారిత్రక అవగాహనతో సమన్వయ
దృక్పథంతో ఉషశ్రీ ఓర్పుతో ఇచ్చిన
సమాధానాలు ఇందులో ఉన్నాయి.
రామాయణ భారతాలు మొదలుకొని కాన్వెంటు చదువుల
వరకు రకరకాల సందేహాలు. అన్నింటికీ ఆలోచనలు రేకెత్తించే
ఆకర్షణీయమైన సమాధానాలు. అన్నింటా ఉషశ్రీ మార్కు గడుసుదనం
పాఠకులను మరీ ఆకట్టుకుంటుంది.

- ఆచార్య బేతవోలు రామబ్రహ్మం